ప్రొద్దుటూరు నివాసి ప్రకృతము రాజమహేంద్ర వరము
డిప్యూటి కలెక్టరు పూజ్యులు
శ్రీ బీగాల పిచ్చయ్య - మహాశయుల యుదారాశయమున
నీ పొత్తము బయలు మెఱసినది.

కూర్పరి
నాగనార్య.



# ఒక మనవి

పండితులు - కవులు - విమర్శకులు - కళాకారులు - పాఠశాలలు
కళాశాలలు - గ్రంథాలయములు కోరుచో నా
గ్రంథము లన్నియు సగము ఖరీదునకే
యీయఁబడును.

ఇట్లు,
దేశీయ సోదరుఁడు,
నారు నాగనార్య
(వైద్యవిద్వత్పండిత సత్కవి కవితా కళానిధి)
నాగవరము.
12—9—72.

# రామకత

[ అచ్చ తెనుఁగు ]



కూర్పరి

పండిత. నారువాగనార్య.



1972

 [వెల

# రా మ క త

అచ్చ తెనుఁగు -

## జో త లు -

ఉ॥ ఎవ్వని కన్ను సన్న నొక - యించుక
కల్గ జెగమ్ము ప్రమ్మ నా
యెవ్వని కన్ను సన్న నొక -
యించుక లేమి జెగమ్ము వమ్ము నా
యెవ్వని యాన బూతములె - చేనియు
నొదల మోయు నట్టి తే
జెవ్వత మేని నాయెదఁ గ - దించి సిరుల్
దొరయించుఁ గావుతన్ ౧

కం॥ తనుఁ దా నెఱుంగ కుండిన
దని సను నేఁ మేనితాల్పు - తన సొంతముఁ గ
న్గొనఁ దా విడుదల నందుట
కును మేలొందుటకుఁ జేర్మిఁ - గొని పొందుటకున్ ౨

కం॥ అబ్బురపు టచ్చ తెనుఁగీ
కబ్బము డెబ్బది యొకండు - గా "రామకతన్"
ప్రబ్బిన బత్తిని వ్రాసితి -
జొబ్బిలుతన్ దల్లిబాస - చొరవల్ తెరువుల్. 3

కం॥ ఎందఱొ! వ్రాసిన యీకత
యెందుల కిఁక వ్రాయుటెంత - యెబ్బెఱిక మటం
చెందురు కొందఱు రాముని
యందలి ప్రేముడిని వ్రాసి - తచ్చ తెనుఁగునన్. ౪

కం॥ 'తిమ్మన, యచ్చ తెనుంగున
గమ్మని 'రామకథ' వ్రాసెఁగద! వలదిఁకఁ బో
పొమ్మనకుఁ డెరికై తను
దిమ్మన మొకకొంత కలిగి — తీరు నిజేముగా. ౫

కం॥ 'రామకథ, వ్రాయ నామది
యామని కారయి చిగిర్చి — నంత మెయిఁ దెవుల్
బ్రామిన నిటు కూర్చితి నెటొ?
వేమరుఁ గైసరులు చేదువ — వేఁడెద బత్తి౯. ౬

గీ॥ అచ్చ తెలుఁగారు తెనుఁగులో — నర్వదారు
కబ్బములు వ్రాసి నేనూడి — గమ్మ పలుకు
వెలఁది! నీయడుగుల బత్తి — సలిపినాఁడ!
నిబ్బరపుటెదఁ గబ్బముల్ — నిలుపుమమ్మ! ౭

కం॥ మనుగడ నలంతి వెలితియుఁ
గనుపఱుపక, లోటుపాటుఁ — గావింపక మే
ల్మినిడి పజేఁ గొలిచి మన దీ
వనలిమ్మా విడుద లందు — బాటగుఁ జుమ్మా. ౮

కం॥ తెగులుఁ దగుల్కొని వగ చెడి
మిగుల బడల్పడిన నేను — మీఁదెఱుఁగక, వ్రా
యఁగల — నను తలఁపు సందియ
ముగుఁ దుది నీకాన్కఁ గొనుమ! యాదటఁ గనుమా ౯



# కత మొదలు

కం॥ ముట్టినది ముత్తెమై చే
పట్టిన యది యెల్ల మిసిమి - బంగారంబై
కట్టుపకాసగు - "భారత,
మిట్టట్టని పొగడ బమ్మ - కేనియుఁ దరమే? ౧

కం॥ 'సరయువు, దరిఁ 'గోసల, నా
దొరయును సిరులంది పొంది - దొరతన మందున్
బరగును బాణివడమ్మం
పలు తెలుఁగు 'నయోధ్య, హాయిఁ-బజేతని సనఁగన్ ౨

చం॥ పగఱకుఁ గంచుకోట మిడి -
పల్కులకాదరువైన పేట! యొ
త్తుగ దరమంపుఁ బూల్విరియు -
తోట! జెగా నడయాడి రచ్చలన్
నెగడిన మాట! సత్తెమున -
నిక్కి హళాహళిఁ ద్రొక్కుబాట! పొ
ల్పుగ నపరంజిమూట! సగి - పోల్పఱ
యుద్దియె కాఁదయోధ్యకున్. ౩

కం॥ ఎత్తగు మిద్దెలు - మేడలు
నొత్తగు పజె - పాడి పంట - లువ్వెత్తుగఁ బె
ల్లొత్తరమయి కలిమికి బి
ట్టొత్తరమయి నగరు మిగుల - నెచ్చియుచుండున్ ౪

కం॥ నట్టువ సాలలు గరిడీ
లట్టడు లంగళ్ళు మేలి - యాయిదపు గదుల్
చిట్ట పనితనపుఁ గొట్టులుఁ
గొట్టిడులుం గలవు పజెల - కుసు గూర్మినిడన్ ౫

కం॥ కలుచేలుఁ గారొరుసొత్తులఁ
దలఁపరు విద్దెలను బెద్ద - తనిసనుదు రెదన్
గలదక్కటికము - మఱిఁ బెఱ
పొలఁతులఁ దలఁచెదరు తల్లి - పోలిక బత్తిన్. ౬

కం॥ సోమరులుఁ గారు, పనులను
వేమరు కనుగల్గి చేయు - వెరవరయుదు రెం
తే మెయివంచి పొనర్చెద
రేమరకయె కరిసనమ్ము - డెంతయు బూన్కిన్. ౭

చం॥ కలిమికిఁ గాళ్ళుజాపుకొని -
గంతులు వేయరు లేమికిన్ వగన్
గలఁ గరు, కల్మిలేములొండి - కమ్మగ
జోగుల బాగుఁ జూచి రై

తులు బనిపాటు లెప్పుడును -
దొడ్డమదిన్ గిసుకన్ బొనర్త్రు గే
స్తుల మొగసాలఁ గల్మిచెలి -
చూపఱ నట్టువ సాలయై తగున్. ౮

కం॥ కఱదలును లంచగొండులు
మొఱకులు వెలిచేవ్రులు మరగు_మొప్పెలు దొంగల్
పిఱికితన మొరయు పందలు
గుఱిఁ దప్పినవారు మందు - కును గానరటన్. ౯

కం॥ వెలయుదురా యాణెము మేల్
గలిగించెడి వారు విద్దె - కై యడియాసల్
దలకొను వారు బత్తెమ్ములు
సలిపెడి వారిచ్చ మెచ్చ - సత్తెము వారున్. ౧౦

ఉ॥ కొండలఁ బిండిగొట్ట 'సెల - గో!' యని
మిత్తిని దుంపఁ ద్రెంపఁగన్;
బిండలివండు సేయ మను, బెల్కురి
సంద్రము లేడుఁ ద్రావ, నొం
డొండును దాళగింప, బువి -
నుప్పరమున్, గఱి నాగు కోఱలన్
బెండులు వోలె రాల్పఁ, దగు -
బీరపు జోదులు వోల్తు రయ్యెడన్. ౧౧

కం॥ వేవెలుఁగు కొలము కడలికి
రేవెలుఁగయి 'యజుని' కొడుకు_ఱేడు 'దశరథుం'
డై వెలయు నలువలంకులఁ
గావలసిన పేరు పెంపుఁ_గలుముల సొంపున్. ౧౨

ఉ॥ ఆడినమాటఁ దప్పఁడురి_యాటను
నైన నిబద్ధివీడఁ డే
నాఁడు నడెట్టి వింగడము_నన్
దలయొగ్గఁడు దాయనేనిఁ బో
నాడఁడు పేద నెల్లిదము_లాడడు
చిక్కినవానిఁ జాగపున్
జాడఁ దొలంగిచూడఁడు ప_జన్
గను సంతును బోలి ఱేడొగిన్ ౧౩

సీ॥ నెవ్వ జెవ్వనుల క్రొం_దీవె కౌనులయంద
కుదిరిక సకుల చేన్_గుబ్బలంద
కదలిక కలుకుల_కళుకు చూపులయంద
పెనకువల్ బోటుల_తనివులంద
వంకరల్ ముగుదల_వ్రాలు ముంగురు లందఁ
యన్నె మింతుల పొల_యలుక యంద
రాయిడి చెలుల తో_రపుఁ గౌఁగిళుల యుందఁ
తొడిబడు టతివల_నడకలంద

గీ॥ ప్రేఁగుపడు టన్న వెలఁదుల - విడుచుటంద
ముడివడుట ననబోండ్ల క్రొ - మ్ముడుల యంద,
దప్ప వేఱొండుఁ గానక, మెప్పుకోలు,
వడసి యాణియమేలు నా - పుడమి ఱేడు. ౧౪

సీ॥ కన్నెలా! మరునేస్తు - గున్నలా! కపురంపు
దిన్నెలా! రతనంపు - గిన్నెలనఁగ
కొమ్మలా! జాజిపూ - రెమ్మలా! జాళువా
సెమ్మెలా! యపరంజి - బొమ్మలనఁగ
బోటులా! ముత్తెంపు - పేటలా! వలరాచ
తోటలా! వెన్నెల - బాటలనఁగ
నింతులా! మరుచేతి - బంతులా! 'రతి' యింటి
దొంతులా! వేల్పుఁ బ - డంతులనఁగ

గీ॥ చానలా! కాక పెఱతేనె - సోనలా! వ
లంతి బిగి తేజ జిగి కూన - లా! పసందు
జాణలా! యన గట్టివాల్ - సకులుఁ గలరు
కాసె కొస గాలి గోవాళ్ళ - నోసరించి. ౧౫

కం॥ 'తల్లి - పజే'వోలె మను తే
డల్లికబిల్లిక మెలంగి - యనుఁగయి యోమన్
అల్లారు బెల్లమై వా
రల్లటమును లేని మనికి నందిరి యెందున్. ౧౬

కం॥ తాఁజేయఁ బూను దరమం
బే జగమెదిరినను జేసి - యే తీరు, జగా
తేజులు మేల్మేలను విరి
జాజులు నెత్తావులుఁ దె - సల్ విరియు నటుల్. ౧౭

కం॥ కల వన్నియు సంతొక్కటి
వెలియై యేమున్ననేమి? - విర విర వోఁజు
మ్మలు సుట్టి యెల్ల ప్రొద్దులు
వెలలింపుచు మనికిలపడి - వెల వెలఁ బాఱెన్. ౧౮

కం॥ సంతు కొఱ కంతులేని ది
సంతులు వడి మంతు కెక్కు - జేతనము లెన్నో
వంతుమెయిఁ జేసి లాబము
సుంతయినను లేమి వంత - సొంతం బాయెన్. ౧౯

గీ॥ సంతు లేని పుట్టువెంతయు వంతయే,
తప్ప సుగము లేదు - తనువు లేదు
పున్నె మేని రాదు - మన్నిక కాదు, మ
న్గడయు లేదు! యేదు - గడయు కాదు. ౨౦

కం॥ అని మెనమండ్రగు మంతురు
లను బిలిచి "సుమంత్రు"ఁ గన్న - లను బొదివి యిటుల్
వినిచెను సంతొక్కటి లే
మిని బున్నెపుఁ బంటఁ బండ - మిని మనికి చెడెన్ ౨౧

కం॥ మనవిగ 'సుమంత్రుఁ' డిట్లను
మనుజేనికి నొజ్జ లెంత _ మందియొ? కలరో
య్యన వారిఁ బిలిచి తీర్పుం
బొనరించిన చాయఁ జేయఁ_బూనుదు ననుచున్ ౨౨

గీ॥ వామదేవ, వసిష్ఠ, జా _ బాలి, కణ్వ,
కశ్యప, సుయజ్ఞులు మొదలు _గా రుసులను
బిలువఁ బంచిన వచ్చిరి _ పెంపు నింప
వారికడ మన్ను జేడిట్లు _ పలికె బత్తి ౨౩

కం॥ సంతు కొఱ కొక్క_ జన్నము
దెంతయుఁ జేయుదిఁకఁ దబిసు _ లేమందురు? మీ
వంతుసుమా! పలుకుఁడు మీ
యంతటన 'సనత్కు_మారు' _ డపు డిటు లనియెన్ ౨౪

ఆ॥వె॥ 'రోమపాదు', డనెడి _ భూమి యేలిక కల్లుఁ
డైన' ఋశ్యశృంగు, నామతించి
వ్రేల్మిఁ జేసి నంత — వెన్నుని బుజముల
వడువుఁ గలుగఁ గలరు _ కొడుకు లనిన ౨౫

కం॥ రుసు లితవుఁ బలుక నెమ్మది
విసువాసము తోడ జేడు _ వేలిమి పనుల
ప్పస మొనరుపఁ బ్రెగడల బి
ల్పిస కొల్పెన్ జేతన మెంత-యేఁ సంతసిలన్ ౨౬

సీ॥ రాణులను మూవురను దశ - రథుఁడు కూర్మి
దగ్గఱిలి ప్రేముడి తలంపు - లుగ్గడించి
సంతుష్టిఁ గోర్కె - లెట్టింప - సంతసిలిరి
యన్నులకు బిడ్డలన గంపెఁ - డాస కాదె! ౨౭

ఆ॥వె॥ "రోమపాదుఁ డంపె - రోవెలందుల" ఋశ్య
శృంగు కడకు "వారి - నెగదిగఁ గవి,
యెంత తబముఁ జేసి - రివ్వారు కొమ్ములు
రెండు మొలిచె నా కొ - కండు సుమ్మీ. ౨౮

కం॥ తొలకరి మెఱపుల వలె వెల
వెలఁదుల నెపుడేనిఁ గనక - వింగడమున ని
చ్చలమయి కనుఁగొని సంతస
కులమఁగ రాఁ బిలిచి బోడ - యబ్బురముబ్బన్ ౨౯

సీ॥ గుబ్బెతల నిబ్బరపు టుబ్బు - గుబ్బలఁ గని
కొమ్మ నాకొండె, కలదు మీ - కు మఱి యొకటి
వెలయ నచ్చెరువగుఁ బున్న - ముల వలంతు
లెందఱో! యని మెచ్చెనా - 'ఋశ్యశృంగు' 30

సీ॥ చూచి తలయూచి మదినేచి యాచెదురుఁడు
గొప్పవాఁడని మెప్పుకోల్ - కుదిరి తిన్న
దనమునన్ వెలవెలఁదులు - తమకు లోఁగు
నట్లు జాణతనమ్మున - నంగవింప 31

చం॥ తెగఁబడి 'ఋశ్యశృంగుఁ' గొని - తెచ్చు
పనిం బొనరింపఁ డోన నె
వ్వగఁ గొని 'రోమపాదుఁ' డను - వాని
కుఱంగటి కేగి జోతలి
మ్ముగ జేతఁ గూర్చి సొంతపని -
మొట్టమొదల్పులు కాడి యొప్పుకో
లుఁ గుదిరినంత నత్తఱిసి - లోఁగొని
తెచ్చెను తే'డయోధ్య'కున్. 33

గీ॥ 'అంగ' నాడు వీడి - యా - 'శాంత;' ఋశ్యశృం
గులు 'నయోధ్యఁ, జేరి - కొడుకుల కయి
జెన్న మొప్పనమున - సంతన పడి తేడు
వారువమ్ము దెసల - వదలి పెట్టె. 3౪

గీ॥ 'సరయు' వొడ్డున - గుఱ్ఱంపు - జెన్నమునకు
నదవదలుఁ గొని కొడువయు - నొదవఁబోని
కూర్చు సంచారముల జేతఁ - గూర్ప నెంచి
పుడమి తేడాయితంబగు - పూన్కి మించె 3౫

ఆ॥వె॥ జెన్న వాడ యందు - నన్ని వితమ్ముల
మేనితాల్పు లలరి - మెచ్చువచ్చు
పిండివంట లెల్ల - మెండుగ బోసేసి
గఱ్ఱు మనుచుఁ ద్రేపఁ - గలిగి రపుడు. 3౬

కం॥ ప్రేలిమి పను లంతంతట
మేలిమి పస నివ్వటిల్లె – మిడి మిడి యీవుల్
చాల నొసంగఁగ దేవర
యాలో జేన్నంపు టగ్గి – యందుం బొడమెన్. ౩౭

కం॥ తెవులడఁచు మంచి నించును
మివులన్ సంతుఁ గలిగించు – మేలిమిఁ బెంచున్
తవతవఁ బెంచును పాసె
మ్మవలన్ ముపురాంధ్ర కిమ్మ – టంచుం బలుకన్. ౩౮

గీ॥ వారువపు జేన్నమఁదు 'దే – వర' యొసంగు
పసిఁడి గిండిని గొనవచ్చి – పాసె మింత
మన్ను జేడప్పు డగ్గటిం – పంగఁ జేరి
బత్తి చిగురొత్తి కేల్దోయిఁ – బట్టుకొనియె. ౩౯

గీ॥ సంతు కోరిక ప్రేలిమి – సవదరించి
కోరు కొండలపై వానఁ – గురిసెఁ గానఁ
దబిసులకుఁ బెక్కు – కాన్కలఁ దనివిదీర
నిచ్చి సంతసపెట్టె జే – జెంత యేని. ౪౦

గీ॥ చెప్పినటు ముప్పురాంధ్రను – జేరఁ బిలిచి
పంచియిచ్చిన సంతస – పడిరి వారు
కాని తటి నెట్టిదియు రాదు – గాని యయిన
యదను నంద తనంత నె – య్యాదియు వచ్చు ౪౧

గీ॥ 'దశరథుని' మువ్వురిల్లాండ్రుఁదాల్చి చూలు
నంత కంతకు నెల లెక్క - లైన కొలఁది
నోట నీరూట, మంటి పై - పాటుఁబడుట
యలసటయు నోర్పులేమి - బిట్టటమటమ్ము ౪౨

గీ॥ కనులు విరియుటఁ జను లుబ్బ - కమ్ముఁ గనుట
నడుము బలియుట తియ్యని - నుడులు వినుట
చిట్టుములు పొడచూపుట - చిన్ని నవ్వు
లాట ముగురాండ్రకును సాజ - మై తనర్చె ౪౩

గీ॥ జగము పోకడ గుర్తించి - ముగితి నించు
తలఁపు లెడనెడ జేతఁగూర్చి - మెలపు మీరి
యొరుల సేమంపుఁ బని పాటు - లొమ్మి వచ్చు
జేతనపుం గోర్కి తీగెలు - సాగు చుండె ౪౪

కం॥ వీణియ మీటుట కలసటఁ
బూనిరి జగమనెడి పొత్త - మును జదువంగా
మానిరి యిలువేల్పులఁ గొలు
పూనిరి ముగురాండ్ర బత్తి - యొత్తర మగుటన్. ౪౫

గీ॥ అంతఁ 'కౌసల్య' 'రాము'ని - యవలఁ గైక
'భరతు'ని 'సుమిత్ర' 'లక్ష్మణు' - మఱియు నొక్క
కుఱ్ఱ 'శత్రుఘ్నుఁ' గనియె న - ల్గురను వెన్ను
నాల్గు చేతుల వోలె రా - ణుఁ గనిరపుడ. ౪౬

గీ॥ ఏటఁ బెరిగెడి వారొక్క - పూటఁ బెరుగ
వెదురు మోవుల వలెఁ గోల - మ్ముఁ దరియంగ
వలఁతి నవ్వులుఁ దప్పట - ద్దులును మల్లె
సరులుఁ జెరివిన కూకటుల్ - మరులు కొలుప. ౪౭

ఉ॥ కాటుక రేకతో నొసలి - కన్నర
విప్పిన బొట్టుతో జిగా
మాటల తేటతో నెనరు - మాటిన
డెందముతో హళాహళిన్
బాటిలు నాటతో దెసల - పాటెడి
చూపులతోఁ బితాళ్ళకై
లాటపు రాటుతోఁ గొడుకు - లం
గనితేడలరారు చుండినన్. ౪౮

ఆ॥ వె॥ కప్పురంపు సిరముఁ - గప్పినటుల్ వెన్న
విద్రుచు మాడ్కి - మల్లె - విరియు పగిది
వెన్నెలలము తీరు - వన్నెలుఁ జిన్నెలుఁ
గొమరుఁ దనపు నవ్వు - లమరఁ జూచి. ౪౯

కం॥ ముగురాఁడు వారితో జే
డగచాట్లుం బెక్కుపాట్ల - నంది తుదకుఁ గాం
చెఁగదా! నలువుర కొమరుల
వగపేది సుగమ్ముఁ దగిలి - బలకాయించెన్. ౫౦

శా॥ మున్నేనాఁడెఱుఁగంగఁ జాలని
సుక - మ్మున్ సంతసమ్మున్ మదిన్
గన్నాకై పెనుపొంది తాఁ గొడుకులన్ -
గారాముమై పెంచుచున్
గన్నారంగను జేతులారఁ దడవున్ -
గాఁగింటఁ దన్పొందుఁ జే
సన్నన్ ముద్దుల ముచ్చటన్ దనిసనున్
సంతుం గనం బ్రేముడిన్. ౫౧

మ॥ ఎదురన్ మెచ్చుల పచ్చ వచ్చి
నటు లెం - తే వేలుపున్ గారు పాల్
పిదుకం జాలిన పోల్కి - వెన్నెల
నెఱా - విప్పారు తీరొప్పె ఱె
ల్లదరం బూచిన తేవ నవ్వు
కెరటా - లందందుఁ బొంగారు న
ట్లాదవున్ బిల్లల నవ్వుతాలు
తలిదం - డ్రుల్ జూచు నప్డెంతయున్. ౫౨

కం॥ పవలొక చాయను రేయొక
సవురున నిముస - నిముసమున - జక్కని తీర్పుం
దవిలి యనటి మోవు వలెన్
తవతవఁ బెరిగిరి కడున్ హు - టాహుటి నిసువుల్ ౫౩

కం॥ చిటిపొటి ముద్దులతో ము      కం॥
చ్చట నిచ్చు మెఱుంగు పలుకు _ సందడితో న
చ్చట ముచ్చట మొగములతోఁ
బుట పుటమని నల్వురొక్క _ మొగిఁ బెరుగ తఱిన్ ॥8॥

కం॥
కం॥ ఒకనాఁ 'డయోధ్య'సే లెడి
యెకిమీఁ డొడ్డోలగమున _ నెల్లఱు పజెలం
దెకదొట్టి వెలయు సదనున
గకవిక పాటొంద నడవి _ కాఁపరి వచ్చెన్. ॥9॥

కం॥
సీ॥ పొడవు గడ్డము వాఁడు నిడుపైన మీసమీ
నమ్ముఁ బోలిన జేన్నిదమ్ము వాఁడు
నెమ్మోయి వెన్నెల _ నిమురు నటుల్ బూదిఁ
బలుచఁగ మెయిఁ బూయు _ బక్క వాఁడు,
రుదురాకు పేద్దపే_రులఁ దాల్చు మెడవాఁడు,      గీ॥
నొసలఁ గుంకుమ బొట్టు _ నెసఁగు వాఁడు,
నొక కేలలొత మిం _ కొకట కమండల
మరుదారఁ జేపట్టి నట్టివాఁడుఁ

గీ॥ చేక్కలిని బూది నింపిన _ సంచివాఁడు      కం॥
ముదుక బొఱిన జిగి కావి _ బొంతవాఁడుఁ
దలఁపు లోలోన దేవమ్ము సలుపువాఁడు
వచ్చె జడదారి ఱేడంత _ పిచ్చలింప ॥10॥

కం॥ పేరోలగమ్ము - పజే - జో
హారువు లిడి రంత - బోడ - యదుగుం దమ్ముల్
పేరెమ్మువాటు నర్మిలి
నాజేడెంతయును (మ్రొక్కి - హారతు లిడినన్. ౫౭

కం॥ సరదార్లు వజీర్లును మం
తిరులును బజేలెల్ల నడరు - దెంచిన మది సం
బర మలర మేము (గలమున
నిరాబారి పలికె నొక్క - నిమిసము లోనన్ ౫౮

కం॥ మీారంద రెందులకు? నా
వారిచ్చోట( గలరు తేజవడసిన యగినిన్
మీారిన బరవసమున పసి
వారలు నల్లారు ముద్దు - పాప లటంచున్. ౫౯

గీ॥ రామ - లక్ష్మణ - యనుపేర - గోము మీార,
బెరుగుచున్నారు - పని నెఱ - వేర్చు జోదు
కుఱ్ఱ లవ్వారితో( జని - కుదురు( గాన
వచ్చితిని వారి( గొంపోవ - వలయు, మఱియు ౬౦

కం॥ మగ(టిమి సిగ మిగిలిన జేగ
మగ లెందఱో? కలరు( - వారి మన్నికలిట వీ
లగునే? దరమము నిలుపుచు -
ముగితిం గై సేయు వారి - పొందొడ( గూడన్. ౬౧

గీ॥ వచ్చితిని, రాచేపుట్టు లి - ప్పట్లు నుఱవె?
కతము, మెయి పుట్టు వొంది, ని-క్క మ్మెఱింగి.
రాచేకీవి, మెఱుంగుఁ, దు - ఱంగలించు,
ధోసఁగెసంగని, పుట్టుల - తోఁ, బనియన! ౬౨

కం॥ ఆమాటలు విని నంతట
మైమై ఱేడడలు గుడిచి - మల్లామడియై
సామీ! యేమని సెలవిడి
యోముదురో! మాఱలఁ బలుకుఁ-డొకసారి యనన్ ౬౩

చం॥ అనవిని కోనకాఁపు నగి - యల్లన
మెల్లన 'రాము - లక్ష్మణుఁ'
మునుకొని వెంటఁ బెట్టుకొని -
పోవ నిటే యరుదెంచినాఁడ నా
పని తడవోర్వ రాదనిన -
ఫట్ అని గుండెల సేరు నిప్పుఁ బో
సిన యసువై దిగాలుపడి -
చెమ్మగిలన్ గనులంత ఱేడనుఁ. ౬౪

కం॥ కానక కను సంతిట్టులు
కానకుఁ బంపింప నెల్లు - గాళ్ళాదును మీ
యూన సుమి! కాలరుల నూ
రేనియు వేయేని లక్ష - యేనియు సరియే! ౬౫

శా॥ పంపింతున్ నెఱవేర్చి జన్నమును
గా - పాడన్ జేగా జోదులన్
దెంపుం, బెంపు, మదింపు సంపతిల,
లే - దేనిన్ సరే! నెన! యే
జెంపున్ మంపును లేక రక్కసగుమిన్ -
జేక్కాడి బన్నమ్ము మా
యింపన్ సొంపుగ వ్రేలిమిన్ గడవ
నెం - తే సత్రిం బోరాడెదన్. ౬౬

కం॥ కనికరము జాలు కొలమున
కనువగుటన్ వెఱం గడింది - యగు నా మనవిన్
విని ప్రోవ వేఁడెదను జే
కృనిసామీ! యంచుఁ బడియెఁ - గాళ్ళన్ వ్రేళ్ళన్ ౬౭

గీ॥ ఓలగమ్మున్న వార ల-య్యో! యటంచు
వారు ముకుపచ్చలారని - పాపలనుచు
వలవ దిటు తల్లిచాటు పి - ల్లలని మిపులఁ
గనికరముఁ దోఁపఁ బలికి ర - కృఱ కొలంది. ౬౮

ఆ॥ వె॥ ఆకుచాటు పింది - యలుఁ బూప పాయంపు
కొమరు నిమురు రాచే - కొమరు లేడ?
ఆటకాఱు! కుమ్మి - లాటకు దొరకొంటఁ
గాదె! రుసికిఁ దెలియు - రాదె! యిదియు. ౬౯

గీ॥ ఎవ్వరెటుఁ జెప్ప తన పంత - మింత విడఁడు
జడల రాయఁడు పలుకాడె - జెన్నమోము,
రామ - లక్ష్మణు - లే ముందు - రావలెనని
పట్టుదల నుడుముపట్టును - బట్టినట్టె ౨౦

కం॥ ఎవరెంత జెప్ప తేనికి
సవరించు కొనంగ లేక - చేదికిలఁ బడి యే
డువ మొదలు వెట్టె నాయెడ
లివ తోఁడ వసిష్ఠుఁ డెదుర - లేచి యిటులనెన్ ౨౧

కం॥ మనుతేడ! యిట్లు పనవుట
చనునే? సరివారు నగరె! చాల్చాలిఁక లే
చి నిరాబారి మదింగల
యనువున నెఱవేర్పు మనుచు - నండయి పలికెన్ ౨౨

ఉ॥ పంట వలంతి తేడ! యొక -
పట్టున, నీరుసి, సాయ మాటచే
యంటును సొంటులేని యొక -
యల్లట ముండని పోరులందు ము
క్కంటిని నైన గెల్వఁగల -
గండుమగంటిమిఁ గల్గు విద్దెలన్
గొంట నిజమ్మ! మేలుఁ గయి - కొంట
తిరమ్మని నచ్చఁ జెప్పినన్ ౨౩

కం॥ ఒడ్డోలగమున బజ లెటు
లడ్డిన రుసి వెంటఁబంపు - టరువని పలుమా
రొడ్డారించెఁ వసిష్ఠుఁడు,
బిడ్డలఁ బంపించుటందుఁ - బెంపఱలాడెన్ ౨౪

కం॥ ఆడంత వసిష్ఠుఁడు మా
టాడుట విని యెడఁదఁ జిల్ల - నై కుదిరిక నా
బోడ యడుగులకుఁ జేతులు
జోడించి వలంతి బత్తి - నూడిద లిచ్చెన్ ౨౫

ఆ। వె॥ ఒంటికాని వెంట - జంటయాఁ రాము - ల
క్ష్మణులఁ బంప నెడఁదఁ గలఁత పడుట
రాచ వంగడమ్ము - రాణువ కదలెను
సిసుల విడిచి యుండ - వసముఁ గాక ! ౨౬

ఆ। వె॥ అడవికాపు హజ్జ - లడఁకువఁ బుడుకుచుఁ
బుడమి యొడయఁ డపుడ - జేడిఁ గొను కనుఁ
గొలఁకు నీరుఁ దుడుచు -కొనుచుఁ దా బ్రతిమాలి
గనికరించి నన్నుఁ - గావు మనిన ౨౭

ఆ। వె॥ క్రోనకాపు పల్కె - జేనితోఁ జూపుడు
వ్రేలు చుట్టుఁ ద్రిప్పి - వెలయ రొకరు
సాటివారు వీర - లోటమిఁ గనబోరు
వెఱపదేల? పొమ్ము - విడిచి పెట్టి ౨౮

కం॥ నీవంగడపున్ వెలుఁగులు -
నై వెలిఁగెడి వీరు జగము - నందెదురొడ్డన్
లావరులు లేని మగలై
వేవెలుఁగును రేవెలుంగు - వితముందురనన్ ౭౯

కం॥ ఏలిక కడ బంటుండిన
పోలిక రుసి యొద్ద తేడె - పో లెంక వలెన్
కేలుదుగ - మొగిచి నిలిచెను
మేలిమి జడదార్ల సత్తి - మిండం డగుటన్ ౮౦

గీ॥ చేయునది లేక, యేమియుఁ - జెప్ప లేక
విడిచి పోలేక, వెంటాడు - వెరవు లేక
యెట్టులో బోడకాళ్ళను - బట్టి మ్రొక్కి-
దశరథుండూరుఁ జేరంగఁ - దరలి వచ్చె ౮౧

కం॥ కన కన మండుచు ముచ్చి
చ్చును బలె దెసలంటి వెలుఁగు-చును బెంపుఁ దన
ర్చినఁ విశ్వామిత్రుం డా
తని వెనుకన్ జనిరి యన్న - దమ్ములు బత్తిన్ ౮౨

కం॥ ముమ్మొన వాలు తుదిం బలె
నమ్మూవురుఁ గలసి మెలసి - యడవిం బడి పో
నెమ్మి రుసి దరిసిఁ రాముం
డిమ్మెయి నా 'సాడుఁ' గూర్చి-యేమని యడుగన్ ౮౩

శా॥ దానిం గూరిచి 'గాధిపట్టి'
పలికెన్ - దాదవ్వలన్ గోన డెం
దానన్ మెచ్చుచు మున్ను మంచు
మలపై - నన్ దేనముం జేయు కా
క్రేనిన్ బూవిలుకాఁడు ముల్కుగమిచే -
డీల్పాటుఁ గావింపఁ దో
డ్తో నైదమ్ములవానిఁ ద్రుంపఁ దగు
చో - టున్ గాదె! యీ యూ యెడన్. ౨౪

మ॥ వలిగుట్టన్ వెలిగిబ్బ రాతు
తబమున్ - వాలాయముం జేయఁ గొం
డల రాచూలి వలంతి బేటమున
జెం - తం బొంతఁ దాఁజేరికన్
గొలువన్ బూవిలు దంట వేలుపుల
కె - గ్గున్ బాపఁగాఁ బూని వా
రలపై నేసె నసోగ పూములుకు
లా - రాటమ్ముఁ బెటెత్తఁగన్. ౨౫

ఉ॥ చిచ్చుఱ కంటి మంట మసిఁ -
జేసెను జెన్నపుఁ గొంగ వెంటనే
పచ్చనివింటివాని నిట - బన్న
మొనర్చిన తాపుఁగాన నా

మచ్చో నెఱుంగు కోసమయి -
మానిసుతెల్లఱు 'నంగనాడు' నా
హెచ్చుగ వాడుకొందు రిది - యెంత
పసందగు చోటు రాఘవా! ౧౬

కం॥ అడవుల బడి నడయాడుచు
బడిబడి నాయా యెడముల( బరికించుచు; రా
ముఁడు - 'లక్ష్మణుండు' రుసివెం
బడి చేనిరి 'సుదాము' కొండ(_బడి మెఱపు లటుల్ ౧౭

గీ॥ ఇంతలో నొక్క - రక్కెస - యెట్టయెదుర
వచ్చు నూరేనుఁగుల సత్తు - వ( గలదాని(
గాంచి యిదియేమి? బూతమా - కాక మేని
తాలుపా! యని 'రాముఁ'డా - తబిసి నడుగ. ౧౮

కం॥ ఇది యొక యాఁటది జేన్నము
సదమద మొనరింప నిటకు( జేనుదెంచెను జెం
పఁదగు నని తబిసి పలికిన
నది యెటు? మగుదలను జెంప_నగునా! తగునా? ౧౯

కం॥ 'రాముం' డిటు లడిగిన, వి -
శ్వామిత్రుఁడు, 'తాటక' యన( బఱఁగినది పే
రామికను రుసుల, వారల
బూములఁ, జెఱచు నది గాన(_బోకార్చు మనన్ ౨౦

కం॥ గోరవపు మార్వేసమ్ములఁ
బోరాటము సేయు దానిఁబొలియఁగ నంపా
చారము తీరుల కోరులఁ
బోరితమున జంపె బుజేము – పుట్టు వితఁడనఁ౯ ౯౧

కం॥ మొగు లెక్క – ప్రోడ 'రాముని'ఁ
బాగడుచు జడదారిఁ జూచి – ముందంపగుమిన్
దగ 'రాము'ని కీయుందగుఁ
దగు నని యితవాడి పోయెఁ – దన దారి బడిన్ ౯౨

కం॥ విలువిద్దె యెంత గలదా
కొలఁదులు నేర్పించి 'గాధి – కొడు' కిచ్చెను వా
రల కెచ్చుగ మెచ్చుగు ని
చ్చల మగు బలు నంపగములు – చేట్టమ్ములతో ౯3

గీ॥ అచటి సన్న్యాసు లెల్ల వ – హ్వా! యనంగ
'రాము' గుర్తించి తమ యూసరాకు నామ
తించి పొగడిరి 'రాముఁడు' – మించె మంచుఁ
బాసిన పునాస చేందుగు పగిదిఁ బొలిచి. ౯౪

కం॥ అంతట 'రాముం' – డా రుసి
చెంతకుఁ జేని పొలసుఁ డిండ్ల – చేఁతలు రోఁతల్
వింతగ వినఁ గోరెద నన
నంత వినిచె పోఁకుమూఁర యఁలజేడి చెయ్వుల్ ౯౫

గీ॥ ఉక్కివులు రక్కసులు వారి - కొక్క నేమ
మించుకయును లేదు దరమమా! యెంచఁ బోరు
సత్త్రెపుం దెర్వ్యాఁద్రొక్కరు - చేక్కని నడ
వడి యెఱుంగరు వలఁతి మే - వడి నెఱుఁగరు. ౯౬

చం॥ పొలఁ దిని నల్లఁద్రావి పలు -
పోకలఁ బోయి పరాయి వారినిన్
గలఁచి నిసిన్ మెలంగి చేదు -
కర్జములం బొనరించి జేన్నముల్
నిలుపఁగ నెత్రు కండలగి - నిం
బడవైచి తోలంచి మంచి సా
దులఁ బుటమార్చ్చి మస్గడ నె - దుర్గొని
యోడరె! నల్లఁద్రావుడుల్. ౯౭

కం॥ మంచి, చెడుగు, లివి దొందము
లంబాడుదు రెందుఁ బెద్ద - లరయఁగఁ మిగులన్
వంచకులగుఁ బ్రావేల్పులు
మంచియనఁగ వేల్పులే సు - మా! సాకిరిద్మై. ౯౮

కం॥ అనవిని వ్రేలిమి మేల్పడి
చేన మేమెటు మసలవలయు జేయ్యన సెలవిం
డన, 'రాముని'తో నానతి యి
చ్చెను 'రుసి' బలు మంతనములుఁ_జెఱు పలుకులతో ౯౯

కం॥ వరుసన్ బ్రేల్చెఁ బొనర్పఁ బూనుకొను
'వి - శ్వామిత్రుపై రాముపై
కఱదల్ రక్కసు లొక్కచో బలిసి
మూ - కల్ గట్టి దండెత్తిన
న్లైఱచిన్ బ్రేవులు నెత్రు పెమ్ములు
మ - తెన్నన్ వేయ వెన్వెంటనే
తఱుమన్ వాలు మెఱుంగు తూపు
గుమి కా - దండున్ వితాకొందినన్. ౧౦౦

చం॥ పెలుకుటి నోటఁ గాల్గఱచి -
వేగిరమే, పరువెత్తఁ గ్రొత్త దం
డొలసి మొయిళ్ళ చాలు నిలు - చుండి
తటాలున సూదితాలు, అ
ప్పలు విసరన్ గనుంగొని గ -
బాలున నాల్కలు చాపి ముందు పే
రలుఁగులు పైపయిన్ విడువ -
నంతట చిచ్చున కోడి పాఱెనన్. ౧౦౧

కం॥ ఇటు లెందఱసర లిట వ
చ్చుటకును గతమగునో! యరయు - చున్ మెలకువ నా
కిటుకుఁ దెలిసి పొంచి హుటా
హుటిఁ బోరఁగఁ గాచి వేచి - యున్నట్టి తఱిన్. ౧౦౨

కం॥ గుఱి మీఱి పాఱుటసరలుఁ
బఱతెంచిన 'రాముఁ, డరసి – భగ్గన మంటల్
చురచుర మూఁగి రగుల్కొన
సురక్రోవిన్ బఱపెఁ బగఱు – చుమ్మలుసుట్టన్. ౧౦౩

కం॥ వెనుచేఱచి రంతఁ 'రాముని,
పెను చిచ్చఱ కోల సెకల – వెఱనొకఁడొకఁడే!
అనుకొని నటు జెన్నము సో
బనముగ నెఱవేరె, 'గాధి – పట్టి' యెలర్చెన్. ౧౦౪

కం॥ జెన్నమ్మో 'మారీచుఁడు'
మున్నగు రక్కసుల చేతఁ – బాడవడఁగక, గె
ల్పు న్నొగ్గుటచే. 'రాముని'
పున్నెమ్మో యనుచు జేగము – పొగడెన్ నెగడెన్. ౧౦౫

ఉ॥ అంతట, 'రామ–లక్ష్మణులు', నంచేల
పంచేల వెల్గఁ బైనమై
చెంతఁ గలట్టి యమ్మిథిలఁ –
జేరిన యంత విదేహరాజు, తా
నంతటఁ దాసు వచ్చి రుసి –
యగ్గులఁ జాఁగిలి మ్రొక్కి విన్నపం
బెంతయు బత్తి నిల్లనియె –
నేనిఁక మేవడి యైతి నంచొఁగిన్. ౧౦౬

క॥ వీరెవ్వరు? పుడమికిఁ బం
చారించిన దేవరులు గనంబడు నట్టుల్
సారొప్పెఁ 'బలకు'డన జడ
దారి 'మిథిల' - జేని కనియెఁ - దనివార నిటుల్ ౧౦౭

క॥ ఊరును బేరును దీరును
సౌరును బొల్పారు టెల్ల - జెక్కని కతగాఁ
గూరిచి వినిచినఁ జనకుఁడు,
గోరిక తీరికల నెలమిఁ - గొప్పరమందెన్. ౧౦౮

క॥ తనతల్లి తిట్టు విడుదలఁ
గని తలిదండ్రులును గూడి - కను, మెలఁగు టొగిన్
విసుట 'శతానందు'డు, 'రా
ముని' మిగులన్ బొగడికోలు - ముమ్మర మాయెన్ ౧౦౯

ఆ॥వె॥ మిత్తి గొంగ విల్లు - నెత్తిన జోదున
కిత్తుఁ బుడమిపుట్టు - వెత్తరమున
రండు రండటంచు - రాజులఁ బిలువఁ జా
టించినాఁడ! దెసలఁ - బంచినాఁడ! ౧౧౦

గీ॥ అనుచు 'జనకుఁడు' వలికిన - నడవికాఁపు
మంచి దలచెద దీవించి - మంతుకెక్కు
రాకొమారులు వీరు వీ - రేకొలంది
చూచెదని పట్టుఁబట్టి య - చ్చోటి కరుగ. ౧౧౧

కం॥ పలు నాణియంపు కేలిక
లలరారఁ గొండమల్ల - య విలు నిటారుం
బలె మోపెట్టఁగ వచ్చిరి
బలువిడి తమ నిలువు బలుపు-బయ లుబ్బంగన్ ౧౧౨

సీ॥ దగ్గఱించి యిదేమి - దయ్యము వలె నున్న
దిఁక వీలుఁగాదని యెరియువారు
తాఁకి యెత్తఁగఁ బూని తరముఁగాదని చేప్ప
రించి దాదవ్వుల - నేగువారు
నటు నిటుఁ గదిలించి యయితిఁ గాదని దెసల్
పరికించి ప్రక్కకు - జెరుగువారు
నెటులైన దీని నె - త్తుటమంచిదని చేతఁ
గాక తటాలునఁ గదలువారు.

గీ॥ అంత వారింతలైరి మే - మెంత యనుచు
బిక్కమొగమున సిగ్గిలి - వెడలువారు
సైరి సెగకంటి విల్లెత్తు - నయ్యలెల్ల
నుప్పనకుఁ గూడఁ గొఱమాలి - యున్నవారు! ౧౧౩

సీ॥ ఇదియెంత? చిటికలో - నెత్తమే? మేముని
జొల్లు బురద గుంటఁ - ద్రెళ్ళువారు
నిదియొక్క లెక్కయే - యేమెంత వారమం
చరసి వీల్గాక య - ల్లాడువారుఁ

దటుకున నెత్తి 'సీ - త'ను బెండ్లి యాడమే,
యని చెయిఁదాఁకి మి - న్నరయువారు
నీసారి నాబీర - మెట్టిదో! కనుఁడని
పఱతెంచి చేదికిలఁ - బడెడివారు.

గీ॥ మగఁటిమి కొఱంతఁ గల్గు ని - మ్మానిసులకు
డాయరాదని కోఁతలుఁ - గోయువారు
కొలువు కూటము పెద్ద గ గ్గోలుఁ దప్ప
కలఁడె మందున కొక్క మ - గన్నయైన. ౧౧౪

ఉ॥ అత్తఱి 'గాధిపట్టి' తన -
యండ మెలంగిన రాచపట్టితో
నుత్తరు విచ్చి 'రాము' డపు -
డొయ్యన జీలుగ బెండుఁ జేతితో
నెత్తిన మాడ్కిఁ జుల్కన మె -
యిన్ నిముసమ్మునఁ నెత్తిపట్టి వి
ల్లొత్తి 'పెఠిల్లనన్' విఱిచె -
నుక్కరి జోదులు నబ్బురం పడన్. ౧౧౫

కం॥ అద్దరి దాపుల నుండిన
గద్దెలఁ గూర్చున్న ఱేండ్లు - గజిబిజియై యా
సద్దు విని దిగాల్పడె మది
బిద్దంబయి దెసలఁ జూచి - వెఱఁ బాఱి రెటో? ౧౧౬

మ॥ విలు మోపెట్టిన యప్పు డంతిపురిలో -
విప్పారు కందోయి వె
న్నెలలుం గాయఁగఁ జూచి 'ఫెళ్ళు'
మని త్రు - న్చెన్ జూడరే, పూపజా
బిలి తాల్పున్ విలునంచుఁ దొయ్యలులు
గ - న్వ్రిందుల్ నిగారింపఁ బే
రెలమిన్ గాంచిరి 'రాము' -
నింగి సిగ వి - ల్లీటార్చు చూపామనిన్. ౧౦

మ॥ కనులారన్ దెలిసిగ్గుఁ దోఁప వెనుకన్ -
గైత్రవాలు వాల్జాపులన్
గనుఁ దోడ్తో సకి కన్నుగీటి నగు -
వక్కాణించు బోటిన్ దటా
లున నోర్యార్చాయు దెసల్ గనున్
బుఘుసరా-లున్ మూరొ్కనున్ నిట్టని
ల్పున నుండున్ దనుఁజూచు 'రాముఁ'
గనుగెల్పున్ - సీత, కొండాడుచున్. ౧౧

గీ॥ అప్పుడ 'జనకుని' సంతస - మంతుముట్టెఁ
జుట్టు పట్టు తేండ్లుఁ దలలుఁ - గొట్టుకొనిరి
రాణివాస మెలర్చిరెం - తేనిఁ సీత,
యెడఁద నిండారు సంతోస - మినుమడించె. ౧౨

కం॥ 'రాము'నిఁ దలి దండ్రులకును,
ప్రేముడి నీ పోలు పొందు _ వే నెఱిఁగింపం
గా మునువచ్చిరి యోణియ
మే మొదలూడి పడినట్టు _ లిట్టలవు మదిన్ ౧౨౦

తే॥ 'దశరథుండుఁ దలఁచెఁ _ దబిసుతో బిడ్డల
పంపు నెడఁ గలంకు _ పడితి _ నేఁటి
మేలుఁ దలఁపరాని _ దై అగ్గొనర్చె ముం
దేది? జేరగునేరి _ కెఱుకపడును. ౧౨౧

గీ॥ 'సీతఁ' గై సేసి వాసిమై _ చెలులు పూస
రములుఁ గయి దండనిచ్చిరి _ 'రాము' మెడను
జేర్మిమెయి సప్పనము సేసి _ కూర్మివడసెఁ
దాను మగనినిఁ గోను బత _ మూను 'సీత'. ౧౨౨

చం॥ పలువురు జోదు లెట్టెదుర _
ఫట్ అని (పట్టని) చిచ్చెఱకంటి విల్లుఁ దు
న్కలఁ బొనరించి పోటరికిఁ
గానుకగాఁ జెయిసాపి తీసికో
వలయు నటంచు 'సీత'నిడె _
బత్తి మదిన్ 'జనకుండు' చుట్టు ప
ట్టులు బళిరాఁ సెబాసని క _ డున్
బొగడన్ గయిదండ లిచ్చుచున్. ౧౨౩

కం॥ 'జనకు'ని కొమరిత 'నూర్మిళ,
పెనుపరి 'లక్ష్మణున కొసఁగి - పెండిలిచేసెన్
దన తమ్ముఁడగు 'కుశధ్వజు'ఁ
డనుజేసి కొమార్తె లిరువు-రం దొకరితయా. ౧౨౪

గీ॥ 'మాండవి'ని 'భరతు'నకిచ్చి - మఱియును 'శ్రుత
కీర్తి 'శత్రుఘ్ను'నకు నొసం-గి కొలువరులు
మేటి హంవీరుల కొలువు - కూట మందు
'జనకుఁ'డొనరించెఁ బెండిలి - జగముమెచ్చ. ౧౨౫

గీ॥ పెండ్లి సంబర మంతయుఁ - బెచ్చరిల్లి
వరుసగాఁ దొందరలుఁ గొంత - వఱకుఁ దఱిఁగి
వేఁగు తఱి చెందుకుంబలె - వెల వెల నయి
పలుచేఁ బాఱిరి యిరువాగు - బందుగులును. ౧౨౬

కం॥ కానుకలుఁ బసిఁడి సొమ్ములు
నేనికలున్ వారువమ్ము - వెలనాగలు న
న్నె నల్లిండ్ల నొసంగెను -
దానయి 'జనకుండు' కొమరి-తలు నలువురకున్. ౧౨౭

కం॥ అరదమ్ములు పెక్కు-వపై
నరుదెంచిరి పెండ్లి వార - లందఱ'యోధ్య'క్
బెరిమ నొరిచు మది వచ్చిరి -
తిరుణాళ్ళకుఁ బోలెఁ బజెలు - తెందేపలుగా. ౧౨౮

చం॥ అటఁ జేనుదారిలో నడుమ -
యా'జమదగ్ని' కొమారుఁడడ్డి యె
చ్చటి కిటుబోవ నెంతురిఁక -
సాగదు నిల్వుఁడు బేసికంటి విల్
పుటపుటఁ ద్రుంచి తంట యిటు -
పోలునె! బీరముఁ గల్గెనేనిఁ ద్రుం
చుటకిదె! నాదువిల్లుఁ దెగఁ -
జూపుమ! మేటి మగండవైనచో! ౧౨౯

కం॥ అనినంత 'దశరథుం' డొ
య్యనఁ జేతులుఁ గట్టుకొని య_యా! తబిసులకున్
గినుకఁ జెనకంగ నగునే?
కనికరమున గుఱ్ఱవానిఁ - గావుండనినన్. ౧౩౦

కం॥ ఇరువదొక మారు ఱేండ్లన్
బరిగొని తుత్తుమురు సేయు - బాపం డెదురన్
వెఱఁ బఱవక నిలుపోపుట
లుఱవే! యీ'పరశురాముఁ_డుండు టెఱుఁగవే?. ౧౩౧

కం॥ ఊరక పోనిత్తునె? తెగ
టారుచు పనిఁ బూనకుంట - యనువగునే! రా
రాఁరామా! యియ్యెడఁ దెక
తేరకు నిను విడుతునే? పదింబదిగ ననన్. ౧౩౨

కం॥ రుసిపాపవు బాపఁడ వ
ప్పసముగ నీతోడఁ బోరఁ - బాడియె! యీాయ
క్కసమేల? వదలుమనఁ గ
క్కసపుఁ వాఁ జూపుఁజూచి-కడ కిట్లనియెన్. ౧౩౩

కం॥ నాయొజ్జె విల్లు విఱచిన
నీయొళవరి తనముఁ గనక - నిను విడువ ననన్
చేయెత్తి వింటఁ గోలన్
డాయన్ బాపండు గడగ - దన్ వడఁకాడెన్. ౧౩౪

ఉ॥ 'రాము'ని దాసి యా'పరశు -
రాముఁడు' దేవర వీవు, సాజమా
'రాము'ఁడటంచు నెంచి యిటు -
ప్రల్లదమాడి యెఱింగితిప్డు న
న్నేమెయి నేనిఁ బ్రోవ, నెన -
రెంచుమటంచు 'మహేంద్ర' మేగెదన్
దామిపుడోము చో-నని వి -
తావితలై పలుసార్లు వేడినన్. ౧౩౫

కం॥ మనుగడ నీసరు దేన
మ్మ్మన గడపుచు మిన్నకుందు - మొగి విడిచినచో
నన 'రాముఁడు' సరియనియెన్
జనియెన్ జమదగ్ని కొడుకు - చాలని కడఁకన్. ౧౩౬

కం॥ ముదుసలి తేడగు 'దశరథుఁ'
డెద సంతస మంది పయన - మెంతయుఁ దొరగా
ముదలించె నంత యూరున
బదిలముగాఁ జేరి రెల్ల - వారరుదారన్. ౧౩౭

కం॥ కనుచూపు మేరఁ బజ పరి
గొని చూచిరి దీవెనలను - గురిసిరి పెద్దల్
తన రాణివాస మలన
ల్ల నివాళులొసంగ మేళు - లం బడయు మదిన్. ౧౩౮

గద్దెము। కం॥ కలదన్ని యెడలఁ దెలియం
గల వారికిఁ దన్నుమించి - కలదే? మతెందున్
బలుకవె! మదిఁ దాటిన యా
వల వెలుఁగే నిక్కమంచుఁ - బ్రామినుకులొగిన్. ౧౩౯



# రా మ క త

## మలిపాలు (అయోధ్యాకాండము)

కం॥ జెగమంతయు నీవే యని
ముగిలికి నీవాలవాల - ముగదా! యని సో
యగముల నెలవని బూ
తగముల కాదరు వటంచుఁ - దలఁచెద! సామీ!

ఆ|వె॥ అంతఁ గొంతవడికి - నా'రాము'పైఁగూర్మి
నేలుబడి నొసంగ నెంచి కొలము
సాము లెల్లఁ బిలిచి - తామదిఁ గోర్కినం
తయును దేటపఱచె - 'దశరథుండు'

ఆ|వె॥ పజకుఁ జాటఁ బంప - వచ్చిరి తెం దేప
లుగను మంతనమ్ము - లును జెరుపఁగ -
నిచ్చగించి రంత - నేకతమాడి 'రా
మునికి రాచటికము - ముట్టఁజెప్ప

గీ॥ పుడమి జేడెంతొ! సంతస - మున నెడంద
విరియ మంతిరులను బిలి - పించి వలయు
కర్జములొనర్ప సంబారు - గములఁ గూర్పఁ
గూర్పరుల నేర్పరించెను - నేర్పు కొలఁది.

కం॥ తనయేలు బడికి లోఁబడు
కనుచూపు కొలంది మేరఁ గడచిన నాడుల్
తనవసమగు వశితమ్ముం
మునుకొని 'రాము'నికిఁ బట్టమును గట్టుమదిన్. ౫

కం॥ పలునాడుల పున్నెపు పె
రుల నీళ్ళను నాకుటింటి – రుసి యడుగుల దు
మ్ములవోకఁగఁ గొని తెచ్చిరి
యలవడు నేలుబడి కనువు – నగు సరకులొగిన్. ౬

గీ॥ ఏలుబడి గద్దె 'రాము' నెక్కింప నెంచి
పెక్కు నాడుల పెద్దలఁ బిలువఁబంచి
కబురు 'దశరథుఁ' డంపె న – గ్గలిక మించి
'రాము'డది వినితల్లిఁ జే – రం దలంచె. ౭

గీ॥ తల్లి యడుగుల కెడ ప్రొక్కి – తండ్రి మాట!
జెప్ప మొదలిడు నంతలోఁ – జేరఁ బాఱ
పిన్నతల్లి 'సుమిత్ర' యం – పిలిన బత్తి
నామె హజ్జల మోడ్పుఁ గేల్ – 'రాముఁ' డిచ్చె. ౮

కం॥ ఇది యిటులుండఁగ 'దశరథుఁ
డెదమెచ్చిన కజ్జమగుట – నెంతయు నెలమిన్
బొదలాడి పూనికఁ దెలుపఁగ
మొదలిడి యటవదలి యంతి – పురికిం బోయెన్. ౯

కం॥ రాణులెఱింగిన సంతస
మూనదరని ఱేఁడుపలుక నోఁగి జెతనుపడెన్
గాని 'కయికమ్మ' యెదురుట
చే ననువగు పనియె_కాని చేఁతగ మారెన్.

కం॥ ఉన్నట్టు లుండి క్రన్నన
జెన్ని తెగుల్ దగులు పగిది _ జెగమెఱుఁగక తాఁ
గొన్నట్టి కోడి కోకకా
లన్నటు 'కైకమ్మ' లేకి _ యైపోఁకాయెన్.

కం॥ 'రాము'న కెగ్గొనరింపఁగఁ
దా మును దలపోయు కతనఁ _ దఱి జేతపడుటన్
ఏమరక యెఱిఁగి - 'మంథర'
బూమెలు వన్నంగఁ 'గైక' _ పొంతకుఁ బోయెన్.

కం॥ ఏమేమి? కుట్ర పన్నెనొ?
ఆ'మంథర' విసపు గాలి _ యులమెనొ? వారె
ట్లామెకఁ బల్కిన పల్కులె!
ప్రామినుకులఁ జోలెఁ జెల్లు _ బడి కాఁజొచ్చెన్.

కం॥ 'కౌసల్య'కును 'సుమిత్ర'కు
వాసిమెయిం బలికి _ 'కైక' వద్దకుఁ జేన తే
డాసమెయి, బిలువఁ 'గైక' యె,
రోసపు గది నుంట జేని _ తొమ్మె విఱిగెన్.

క॥ అనువు మెయిఁ బిలిచి పలికిన
వినియు విననియట్టులుండి - వింగడమున దా
ననియె, నిటు మున్ను నేఁగో
రిన కోర్కులఁ దీర్చి నవద - రింపుఁడు పనులన్. ౧౫

క॥ సత్తెమ్మె యేడుగడ యగు
సత్తెమ్ము కొలమున బాడమి - సత్తెము కొఱకై
కుత్తుకలు వోవ నోర్చెడి -
సత్తుం గల తేడదెట్లు - సత్తెముఁ దప్పన్. ౧౬

క॥ కొడుకుల పయి ప్రేముడి విడి
వడకయ సత్తెమ్ము విడిచి - బ్రదుకొల్లక యె
క్కుడుఁ గుతిలపడియు నీకో
రెడి కోర్కిం దీర్తు నంచు - తేడు సకికనెన్. ౧౭

గీ॥ 'రాము'నకుఁ గాక నాడు 'భ - రతు'న కిడుట
యాతఁ డీరేడు నేడులు - నడవినుంట
రెండు కోరిక లేరికో - రినది 'కైక'
సరియె, యటు లిచ్చితంచు ద - శరథుఁడాడె. ౧౮

గీ॥ 'కైక' చెడు పేరు పడుటకో? కాక! 'రాముఁ'
డడవి నిడుములఁ గుడువనో? పుడమి తేడు
వలపు కొసవెట్టి బలియుటో! తొలికొలంపు
సత్తెమును నిల్పు నిట్టిక - ర్జనుస్త్రఁ గలిగె. ౧౯

కం॥ పలుకుట తడవుగఁ గను గ్రు
డ్డులు క్రిందికి మీఁది కెటున - టుల్ దిరిగి నురుం
గులు సెలవులఁ బడి వెలలన్
టల పల నయి పడక పయి గ - బాలున పడియెన్. ౨౦

గీ॥ నలు దెసలఁ జిమ్మచీఁకటు - లలమె, నెఱకుఁ
దారు పులుఁగులు గూండ్లకుఁ జేరఁ బాఱె
నాకసం బంత సీసంపు - ఱేకు వీఁక
నల్లనై కానుపించెఁ గ - న్బ్రామి పజెకు ౨౧

కం॥ అటనట రిక్కలు తటపట
పొటమరిలెన్ గంకి గింజ - పుట్టి నటుల్ చీఁ
కటి పలపలవోఁ దొలిమలఁ
బుటపుటనై రే వెలుంగు - పొడమి వెలింగెన్. ౨౨

గీ॥ జవ్వనము, వెన్నెలయు, సిరి, జగము నంత
హాయిఁ జేకూర్పఁ గాన నా - రేయి పిండి
యారఁ బోసినటుల్ చెలు - వారె జిలుఁగు
వెలుఁగు లొలసిన వెన్నెల - బలిసి మివుల. ౨౩

మ॥ ఎఱ్ఱకై ఱెక్కలుఁ దట్టుకొంచు
బయలెం - తే గ్రుడ్డుకొన్నుల్ సరా
సరి పోయెన్ మెఱుంగెక్కె - నల్వొలఁకులి -
చ్చెన్ గాఁపులుం గాండ్లుఁగ

టిరి - వేవెల్గటుపైనఁ దూర్పుదెసఁ
బా-టిల్లెఁ నిగారింపు పెం
పు రహింపన్ జెగమంత మేలుకొని
యేపుం జూపి ప్రాపుం గొనెన్. ౨౪

కం॥ ఊఁకించి కాకి మూఁకలు,
కా - కా - యని తెక్క- లడఁచి-కక వికపాటుఁ
జేకొని యంతిపురిం గడి
వోక, రవాళించె సకున -ముం దెలుపునటుల్. ౨౫

గీ॥ తతిఁ గడచిపోయె 'లగనము'ఁ - దప్పిపోవుఁ
గాన 'దశరథుఁ' బిలిపింప - నౌనటంచు
నొజ్జగు 'వసిష్ఠుఁ, డంపిన- నొగి' సుమంత్రుఁ
డరిగెఁ గైకేయి, నగరు డా - యంగఁ దొరగ. ౨౬

గీ॥ వేవెలుఁగు జిల్గు వెలుఁగులు - వెలలఁ బాఱె
నేలుబడి గద్దె 'రాము' నె - క్కించు లగన
మల్ల దే! వచ్చె 'దశరథుఁ' - డరుగు దేరు -
నట్లు సెలవీయుఁ డని 'కైక' - నడిగి నంత ౨౭

కం॥ 'రాముం' డిటఁ బుత్తేరం
గా మనుతేడానతి - నిడెఁ - గాన సుమంత్రీ!
ఆ మాటఁ జెప్పి పనుపుమ
నేమము పాటించు మని, యు-నియెఁ 'గైక' వడిన్. ౨౮

కం॥ ఆమాటలు మది నమ్మి స
రే! మంచిది, తల్లి! యట్టు-లే రాము, నిదే
ప్రేముడిఁ బంపెద నని, గా
రామున బలికెఁ - 'సుమంత్రి'-రామునితోడన్.

చం॥ పిదప 'సుమంత్రి' పల్కు విని -
వేగిరమే తన తండ్రి యొద్దకే
గఁ దలఁచి 'సీత' తోఁ బలికెఁ -
గైకమ, ప్రేముడిఁ బిల్వఁ బంపెఁ బో
యెద నని 'రాముఁ' డాడియొక -
యించుక జంపుతనమ్ము లేక య
య్యాదనున కేగి తండ్రిఁ గని -
యాదల వంచి జోహారు చేసినన్.

గీ॥ తెప్పిటిల్లి లేచి - తేరి పాఱంజూచి
యొడలు బడలుఁ దొడర - నుస్సురనుచు-
సొమ్మసిల్లి మెదడు - దిమ్మెక్కి పలుకు పో
కడయుఁ జూపు లేక - కదల కున్న. 3

కం॥ 'కైకమ్మ' యడుగుఁ దమ్ములు
సేకొని బత్తి మది మ్రొక్కి - చేరువ నిలువన్
పైకొని 'రాముని' కిట్లను
ఖాకున గ్రుమ్మినటు లామె - పరుసంపు నుడుల్. 3

మ॥ పదునాల్గేడులు 'రామ!'
నిన్నడవికిన్ - బంపించి నీకిప్పుడీ
యఁ దలంపుం గొను నేల్బడిన్
'భరతుఁ డో-య్యంజేయు మీతండ్రి బె
ట్టిదపుం గట్టడఁ జేసి చెప్పె నిది
తం-డ్రీ! బత్తిమై గొల్చి చే
సెదొ! త్రోపాడెదొ! వంగడంపు
గుటివా-సిన్ నిల్పెదో! దుల్పెదో! 33

కం॥ అని కచ్చితముగఁ జెప్పిన
విని 'రాముఁడు' తలను వంచి - పినతల్లి కెదన్
హాణిగ లిడి తప్పనని రి
వ్వనఁ జేసె 'నాగేటిచాలు - పుట్టువు' కడకున్. 3౪

కం॥ నాగటిచాల్పుట్టువునకు
నాగడపుం గత జరిగిన - దంతఁ దెలిపి తా
వేగిరమునఁ దల్లుల కడ
కేగిన వారిది యెఱింగి-యిరువు రెరియఁగన్. 3౫

గీ॥ 'రాము' వెంబడి 'సీత'-గా-రవము మీర
'లక్ష్మణుఁడుఁ' దోడరాఁబడి - లముగఁ దల్లు
లిరువురం జేరి మ్రొక్కి-రెం-తేని బత్తి
జరుగు కత విన్నవింప న-చ్చెరువు నెంది. 3౬

ఉ॥ చుమ్మలుసుట్టి, బీడువడి - చొక్కి,
వనారిలి గోడుఁజెంది పే
రుమ్మలికమ్ము ప్రమ్మవగ - నూర్చి
కనారిలి యోర్చి నేమమున్
నెమ్మదిఁ గ్రమ్మ నెట్టెటులా!
నీకును నీకును నీకు సేమమున్
బ్రమ్ము నటంచు నిండు మదిఁ
బల్మరు దీవెనఁ బ్రాలుపోసినన్.

గీ॥ తమ్మిదొర వంగడమ్ము స - త్తెమ్ము మీర
కునికిఁ దమ తేని యానతి - నొప్పఱికము
సేయమిని గుంది యేమియుఁ - జేయలేక
యిద్దఱొప్పి రడవికి వా - రేగుటకును.

గీ॥ నారచీరలుఁ గట్టి కానలకు మెట్టు
వారిఁగని యూరివారు వెం - బడిలిరపుడ
కుమిలి పొర్లాడు నవ్వారి - గోడుఁ జూడఁ
దల్లిపజె చుట్టఱికము సం—తరిలె నరరె!

గీ॥ 'రాముఁ' డడవికిఁ బోయి మా—రాము పడుటఁ
దెలిసి 'దశరథుఁ' డెనలేని - కలఁత నలఁగి
గోడుఁగుడుచుటతో నెడ - బీడువడియె,
నెమ్మదికిఁ దోడు నెమ్మోయి - వమ్ము సెందె.

కం॥ జడలుంచి నారచీరలుఁ
దొడి బసుమ మలంది యడవిఁ – ద్రొటిలి నడువన్
నడిదారి 'గంగ' యెదురే
ర్పడ దాటించెను 'గుహుండు' – రహిఁ బడవపయిన్.

కం॥ 'భారద్వాజు'ని – పాకన్
జేరంజేని రంత మివులఁ – జెచ్చెరఁ బలుసిం
గారంపుఁ 'జిత్రకూటము'
నారసి సంబరము నెంది – రట – దశరథుఁడున్. ౮౨

గీ॥ అవలఁ 'గౌసల్యఁ బిలిపించి' – యజ్ఞదత్తు
నేనుఁగని చెంపఁ దలిదండ్రు – లిచ్చినట్టి
'తిట్టుఁ' దలకొనె నీనాఁటి – కిట్టులయితి
నక్క-టా! చావుఁదప్ప దే – మందుననుచు. ౮౩

ఆ॥వె॥ వనరి వనరి మివుల – వాపోయి వాపోయి
కుంది కుంది డిందు – నంది డెంద
మెరియ సురియపోటు – నెయిది నటుల్ దుది
'దశరథుని' కుసురులుఁ – దటపటించె. ౮౪

కం॥ కానక కానక కనుసం
తే నడవుల పాలగుటకు – నెంతేవగపుం
బూనుచు హా! రామా! యని
పానమ్ములు విడిచె ఱేడు – బలు తగులమునన్. ౮౫

గీ॥ 'భరత - శత్రుఘ్ను' లకును వేఁ - గరులఁ బంప
నెఱిఁగి తమగుండె చెఱువులై - యెరియ నేడ్చి
చేయునది లేక తమయూరుఁ - జేరుకొనిరి
తాతగారూరు 'కేకయ' - తరలి వచ్చి.

కం॥ 'భరతుఁడు' వచ్చిన పిమ్మట
జరిగిన కతలెల్ల నెఱిఁగి - చెయ్యనఁ దల్లిన్
దరిసించి గుండె చెదరిన
పరుసమ్ముల నెదిరి ఱిచ్చె - వడ మాటాడెన్.

కం॥ నాపుట్టువుఁ గొను దోసం
బీపగిదిన్ గట్టికుడిపె - నేమని నిన్నున్
ఱాపాడఁగలను కలుఁచేపు
మోపికలీ పానులంది - పొంది మెలంగన్.

కం॥ చెడువంగడపున్ మొలకఁగఁ
బొడమిన నీకెటుల మంచి - బుద్ధి పొసంగున్
విడుచుట మేల్ తల్లి విన్నై
యడరుట నిన్నేమి చేయ - నగు రాకాసీ!

కం॥ దేవరఁ బోలిన 'రాముని'
నీవెటు లడవులకుఁ బంప - నెంచితొ? నీనా
ల్కావిత మెటులాడెనో? త
ల్లీ! వినఁజాలన్ దోసంగు - లెసఁగవె! నీకున్.

కం॥ నీ కడుపున బుట్టుటచే
నాకీ వెతఁగాక! కల్గు - నా మేటి యసం
బోకలుచే! మగనిఁ జంపిన
కైకమ్మా! నిన్నుఁదల్లి - గా నెటులెంతున్. ౫౧

కం॥ అని తండ్రి సబము 'సరయువు'
కును గొని చని యగ్గిఁబేర్చి - కొదువ పనుల్దీ
ర్చిన మీఁద నన్నదమ్ములు
వనరి మిగుల నింటిపట్టు - పాడఱియున్నన్. ౫౨

గీ॥ కొలముసామి 'వసిష్ఠునిఁ - బిలువనంపి
'రాము నెట్లైనఁ దోడ్కొని - రాఁ దలంచి
తమ్ములోడను నలబల - గమ్ములోడఁ
'జిత్రకూటమ్ము' మల దరిఁ - జేర నరుగ. ౫౩

కం॥ అలబలముఁ జూచి 'గుహు' డీ
చేల మేలొకో? 'రాము' పైనఁ - జెనదని - నాదా
బలిమిఁ గనుమంచు మార్కొనఁ
దెలిపిడి భరతుండు నిజముఁ - దెలిపిన దోడ్తో ౫౪

కం॥ ఆరామునిపై బత్తిని
దారిని జూపించి 'గుహుఁడు' దనదారిఁ జనెన్
'భారద్వాజుఁడు' రాణువ
తీరుంగని యొడలు మండి - తిరుగం బడియెన్. ౫౫

కం॥ భరతా! యేమిది? యడవులఁ
బఱచినదే గాక! 'రాము' పయి దండెత్తన్
బరిగొంటివి సిగ్గింతయు
వఱలదె? 'కైక' కొడుకగుట-వలనఁ గలిగెనో.

గీ॥ మగనిఁ జంపించు మగువ వకుఁ-దగిన కొమరుఁ
డీవ యని ముల్కు-పల్కుల-నెదురుదిరుగ
నపుడ 'భరతుండుఁ' గేల్దోయి-యప్పళించి
యౌదలను వంచి తుదకిట్టు-లనియె రుసికి.

గీ॥ 'రాము' నిన్ వేడికొని పోయి-రాచెఱికము
నెంచి యెప్పటి యట్లప్ప-గించు కొఱకుఁ
దోడుకొని పోఁ దలంచితంచాడి నంతఁ
దబిసి తలమున్కలయిన సం-తసము బలిసి.

ఉ॥ దీవనలిచ్చి, పొమ్మనెన, న-
దేపనిగాఁ బయనించి దెందమం
దావిలపాటు దారిబడి-యన్నఁ
గనుంగొను నాస పేర్మి నెం
తే వెరవారయౌన్ 'భరతుఁ'-
డిల్లరు దేరఁగ జూచి 'లక్ష్మణుం'
డావపు గ్రచ్చకాయలటు-
లట్టె పెకీల్మని చిట్లు నల్లెదన్.

శా॥ అన్నా! చూచితె! దండుతో 'భరతుఁ
డో - య్యన్ వచ్చె విస్వోది యం
దు న్నిండారెను వార్వపుం దడము
కా - ల్దుమ్మెల్ల నింకిట్టులాఁ
కొన్నఁగ మేల! యెదిర్చి క్రొమ్మగటిమిన్ -
గూలార్చి గెల్పొందుమా
యన్నన్, 'రాము'డు, నవ్వి 'లక్ష్మణు'ని
డా - యంజేరి తానిట్లనున్. ౬౦

కం॥ చెట్టెక్కి చూడనేలా?
కట్టలుకన్, 'భరతుఁడ'న జేగా బత్తిమదిఁ
గట్టుపకారయి నిలుచునం.
కట్టా! నీకంటె నతఁడె! - గలువ యనఁ దగున్. ౬౧

కం॥ అనవిని 'లక్ష్మణు' డూరక
వెనుకంజన్ నిలిచెఁ గనుల వెంట జెడిఁ గొనన్
జెను నీరు దొనలఁ బాఱెడి
యనువున భరతుండు, దరిసి హా! యని యేడ్చెన్. ౬౨

గీ॥ ఏమిరా! తమ్ముఁడా! యిటు లేడ్వ నేమి
కతమొ! తెలియదు మదికి విం-గడముఁ దోడరె!
నంచు 'రాముండు' బలికిన - నపుడ, 'భరతుఁ'
డయ్య మనలను విడి తొంటి - జియ్యఁ జేరె! ౬౩

కం॥ అనటయు తడవుగ వారల
కనుదమ్ముల వెంటఁ దెలియ - కయె, కాలువలై
మునుకొని వఱదలు వాఱెను
గొనకొని వారెచటనుంటఁ - గూడ మఱచుటన్. ౬౪

చం॥ కడుపున జేయిపెట్టి వడి - గాఁ
గలబెట్టిన యట్టు లబ్బపో
యెడి పలుకుల్ వినన్ గలఁగి -
యేడ్వఁ దొడంగెను 'రాముఁ' డంటియుం
డెడి సయిదోడు 'సీత' పల -
వించుట లబ్బమో! చెంత పొంత నుం
డెడి జడదార్ల కన్నుల వి - యించె
వనారిలి కావి రేకలల్. ౬౫

కం॥ ఎడనెఱుఁగు కోనకాఁపులె
బడిబడి యితవాడి 'రాము' - బన్నముడుపఁ బా
ల్పడి రంతఁ గొంతవడి కూ
రడిలిరి దేవరను బోలు - 'రాముం' డైనన్. ౬౬

కం॥ జెగమున మెయితాల్పులతోఁ
దగులాటం బుంట, వగపుఁ - దగులుకొనెన్ మి
న్నగు 'రాముఁ' డంతవానికి
నిఁగ మొఱకుల 'మాట' పల్కు - నేలా? పొసఁగున్. ౬౭

గీ॥ రాణివాసంపు సేమ మూ - రఁగల ప్రజల
యునికి మఱి మఱి 'యడిగి' య - యోధ్యఁ గుఱిచి
పలుకునెడ 'భరతుఁ' డిట్లని - పలుకఁ దొడఁగె,
బత్తి చిగురొత్తు నెద తమ్మి - యొత్తిగిల్ల, ౬౮

ఉ॥ 'కైక'కు లోఁగి తండ్రివలు - కన్
దరమమ్మెటులాయెఁ గానకుం
బోక పోసంగునెట్లు? దలఁపుం
బడియొల్బడి వీడి బోడవై
పీఁక మెలంగునెట్టు లిది -
వింగడమేకద! రాచకోవిమై
నీకనుసన్న మమ్మరసి -
నీప్రజపోలిక మమ్ము సాకవే! ౬౯

కం॥ నీయరయని యీరాణియ
మే; యొల్లన్ నీదు వెంట - నే వచ్చెదమం
చాయిత్తమైతి మనిపలు
చాయల 'భరతుండు' వినిచి - చక్కన్ బలుకన్. ౭౦

ఆ॥ వె॥ ప్రొద్దు వంగడంపుఁ బుట్టులు రాచవా
రింత వెట్టులంచు - నెఱుఁగనైతి
కసటు సేత నసము - 'గంగ'లోఁ గలిపిన
రాచకొలమ దెట్లు - రాణకెక్కు. ౭౧

సీ॥ 'ఇక్ష్వాకు' కొలము వా - రేనాడు నాడీ - త
ప్పనిమాట, పఱుగు రేర్పఱచు బాట,
తండ్రిమాటలు జవ-దాటని నీవది
విడచుట లూపిరి - విడచుటె యగు,
నత్తవారిలు సొచ్చు - నటు కానఁదిరుగుట
హానుకోటను నడ - యాడు జాడ
కనుమూసి తెఱచులో - ననె యానఁ గడచేను
మఱిరాక యూరూరుఁ - దిరుగ నగునె ?

గీ॥ ఏలుఁబడి గద్దెనెక్కి - నిం - డోలగమునఁ
బజెల బిడ్డలవోలెఁ గా - పాడు టుఱవు
యింతకంటెను దరమ మొల - దేమికలద
టంచు 'రాముఁడు' 'భరతు'ని - కనియెఁ గూర్మి

ఆ॥ వె॥ ప్రొద్దులేని పవలు - పోలిక, నెత్తావి
పొసఁగనట్టి మల్లెఁ - బోణ నీవు
లేని యోణియమ్మ - లెస్స! యుండునె? దిక్కు
రాయఁడుండనట్టి - రేయిచాయ

గీ॥ అనిన 'భరతు'నకును 'రాముఁ' - డనియె; నిట్లు
తమ్ముడా! 'దశరథుండగు - తండ్రి - కొడుకు
నైన నేసత్తెమునకింత - యపసరిల్ల
జెగము ముగిలికి లంకె యే - పగిది జేరుగు.

గీ॥ సత్తెమున లేని మనుగడ – జగతి కగునె?
సత్తెమే లేక యెల్లప్డు – జగము బ్రదికి
యుండినను మండినను గాని – యొకటె సుమ్మి
గాన సత్తెంపు నడవడి – మానలేను. ౭౫

కం॥ మన కాలమున సత్తెపు వి
త్తన మెప్పటినుండియో, యి – తవుగ మొలిచి మ్రో
డును నయి కాచి పజేశె దని
సనఁ జేసెశె దానిఁ ద్రుంపఁ – జేను నే? భరతా! ౭౬

గీ॥ అనిన 'భరతుండు' మాటాడు – నంత 'రాముఁ'
డిద్ది నా – యానగా గడి – యింపు మింకఁ
దప్పరాదు సుమా! యని – యొప్ప జెప్ప,
'భరతుఁ' డా'రాము'తో మించిపలికెనిట్లు. ౭౭

ఆ॥వె॥ నీవురాక యిచట – నిలిచినఁ బానమ్ము
లూడ్త దబ్బ సెజ్జ – నుండి యిపుడ
యనుచుఁ బల్కు తమ్ము – నరసి కౌఁగిటఁ దీసి
కుస్తరించి కూర్మిఁ – గొంత వినిచె. ౭౮

గీ॥ కాలము నడవడి దరమముఁ – గూడ ప్రొద్దు
వంగడముఁ బుట్టి సత్తెమ్మె – వదల కునికి
పుట్టు వొందిన నే తప్పి – పోవు నెడల
భరత! నేపుట్టి యేమి లా–బమ్ము చెపుమఁ ౭౯

కం॥ అని చెప్పి యొడంబఱిచిన
విని 'భరతు'ని కోర్కిఁ దీర్ప - వెరవనియు 'వసి -
ష్ఠుని' యాన వినికి 'రాముం'
డనువున, దమ్మునకుఁ బావ - లందిచ్చె వడిన్. ౮

గీ॥ 'శత్రుజయ' మను నేన్గుపై - సవదరించి
పావలను గొనిపోయె సం - బరముఁ బెరయ
'భరతుఁ'డా 'నందిగామమ్ము' - పట్టుఁజేరెఁ
గొండదారులఁ బట్టి 'రా - ముండు - మెట్టె. ౮

గద్దెము॥ కం॥ ఉన్నావో! లేవో! జగ
మెన్ని తగాదాలఁ బడియె! - నిటఁ నుండఁ గలాఁ
డన్న యెడ, సేఁత - కుమ్మరి
యున్నాఁడని తెలియు టెంత - యో! తెలివి పబూ! ౮



# రా మ క త

## (మూఁడవపాలు అరణ్యకాండము)

కం॥ నీయునికి లేక జగమే
మాయును నీయునికిఁ గలుగ – మఱి పొడచూపున్
నీయంత గొప్ప తేజీ
యీయెడ లేదిదియె, సత్తె – మగునో సామీ! ౧

గీ॥ రక్కసుండు 'విరాధుఁడన్' మొక్కలీఁడు
గదిసె నీలోన 'సీత'ను గుదియఁ బట్టి
చంకలోఁ బెట్టుకొని యాతఁ – డింక నిట్టు
లాడఁ దొడఁగెను కరవాఁడి – వేడి పలుకు – ౨

కం॥ జడదాఁరుల వేసముఁ గొని
పడఁతి నొకతె వెంటనంటఁ – బఱతెంచితివే
జడదార్ల పచ్చి నెత్తురు
గడగడ నే ద్రావునట్టి – కట్టడ; రామా. 3

కం॥ అన విని 'రాముం' డట 'ల
క్ష్మణు'తో మాటాడ నపుడె – చంపెద వీనిన్
మును 'భరతు'పైన నలుక యి
తనిపైఁ జూపింతుఁ జూడఁ – దగు నా బలిమిన్. ౪

కం॥ అని పలికి యంప పొదిఁ గల
మినుకుటలుంగును బెకల్చి - మిడి లావు మెయిన్
గనుపించి వేయ నెత్తురు
దొనఁబడి పొఱునటు వాఁడు - త్రుంగెన్ బ్రుంగెన్.

కం॥ 'శరభంగు' 'మందకర్ణి'ని
నరసి యగ 'స్త్యుని' బొగడి 'జటాయువు'ఁ గన మూ
వురు న బ్రమంద నాకొనె
పరగున మీతండ్రి కయిన-సఖుఁడను రామా! ౬

కం॥ 'అరుణు'ని కొడుక 'జటాయువు'
పరగును నాపేరు మివుల - బలిమిఁ గలాఁడన్
బెరిమన్ నీకయి మేల్మొ
లోరిమన్ గూర్తునన 'రాముఁ' డూకొని వెడలెన్.

కం॥ చేని చేని 'పంచవటిన్' ల -
క్ష్మణ! చూచితె; యిదియ మనకు-మనికి కునికిన్
జేనుఁగాన నాకుటిలు నొం
డనువుగ జేతఁగూర్పు మనుచు - నానతి యిచ్చెన్. ౮

కం॥ పై దోడాకుటిలున్ నిం
పాదిగఁ గై సేయ నదియ - ప్రాపై వారం
దాదట నుండఁగఁ బండ్లకు
గాదిలి సయిదోడుఁ బంపఁ - గా నొక్క యెడన్. ౯

ఆ॥ వె॥ వెదురు పొదరు నజుకు - నదనునఁ జంబుకు
మారుఁ డూరు పేరు - మాసిపోవఁ
గాంచిఁ లక్ష్మణుండు - కళవళిపడి యన్న
గారి మ్రోలఁ జెప్పి - కావుమనిన ౧౦

గీ॥ అడవి కాఁపుల వలన న - య్యది యెఱింగి
దోసమును గాదటంచు సం - తోసపడిరి.
యింతలోఁ జుప్పనాతి య - య్యెడకు వచ్చి
తన కొమారుఁడుఁ జచ్చినాఁ - డని తెలియుట ౧౧

మ॥ కను గ్రుడ్డుల్ నిడుచంద్ర నిష్ఠురవలై -
కన్పింపఁ గిన్కన్ దటా
లున బర్వెత్తి నిజమ్ము సెప్పఁడికఁ
మీ - లో నేరు? మా కుజ్జవా
నిని దున్మాడిన వాఁకటన్నఁ దబిసుల్ -
నిక్కమ్ము! ఱేడొక్కఁడా
తనిఁ ద్రుంచెన్ బొదటిల్లు వచ్చునెడ
నా - తర్వాత నెట్లేగెనో ౧౨

కం॥ అని వెఱపున మిడుకుచుఁ బ
ల్కిన బోడల వీడు పట్టుఁ - గెలఁకుల వెదుకన్
జెనె నటనట.నొకచో, రా
ముని సీతను లక్ష్మణుఁ గనె - ముగురెట్టెదురన్ ౧౩

సీ॥ తెలిదమ్మి తేకు వెన్నెల వన్నె జెతగూర్చు
కళుకుఁ దేర్చిన సోగ - కనులఁ జూచి
పున్నమ చందురు - నున్న కందేర్చిన
ముగుద జాబిలి రేక - మోముఁ జూచి
యెలదీగ బాగు మీ - సలఁ జిందుఁ ద్రొక్కు క్రొ
మ్మొలక నవ్వుల తీరు-వలనుఁ జూచి
ఖోరతల్పుల నొక్క - మారు మీఱఁగఁ జాలు
ప్రమ్ముఁ దేఱు వెడంద - ఱొమ్ముఁ జూచి

గీ॥ బలిమి రూపెత్తు నిడుద చే-తులనుఁ జూచి
మిసిమి సురతాణి తాడాలు - మేనుఁ జూచి
యొడ లెఱుంగక వలవంత - యొత్తరింప
'రాముఁ' జూచిన మది నమ్మ - రానిదాయె.

గీ॥ వలపు కొసవెఱ్ఱి మందు సా-పడిన కతన
జెగముఁ దోఁపక తనబిడ్డ - చావు నెఱిఁగి
కూడ 'రాము'నిఁ గనినంతఁ గ్రుంగిపోయె,
సారిది వలపు విఁమ్మాఁకఁ - జప్పనౌక !

కం॥ 'రాము' దరిఁజేరి నీ - పగా
నామదిఁ గలదంచుఁ బల్కి - నన్ 'రాముం'డీ
గామును దిద్దుడు సేయం
గా మెలకువ యనుచు. నాకు-గల దోకయాలున్.

కం॥ ఈ నా చిఱు తమ్ముని కా
లేనియు లేదంచుఁ బలుక నెగబడి వలపన్
ఠాణా తెఱచి దివాణము
పోడిమి దొరసాని కీవి పోలికఁ బలికెన్. ౧౭

చం॥ అదివిని 'లక్ష్మణుండు' మొయి —
యంతయు సూడిన జాడ పల్కు నీ
నుదురున సూదిఁ గ్రుచ్చినటు —
నొవ్వగు ముక్కుచెవుల్ విదుర్చి పం
పఁ దగు నటంచు నెంచి పిద —
పన్ దఱిగెన్ దన యన్న సన్న కన్
దుదఁ గనఁ జాలి 'లక్ష్మణుఁడు'
తోడనె యాపని చేసి తీరినన్. ౧౮

కం॥ ఖరుఁడున్న కొలువు కూటము
దరిసి మొయిన్ నెత్తురోలుకఁ దటపట నేలన్
బొరలాడె నేడ్పు కూడుగ
బిఱుసున బలుకాడె గోడు పెంపరలాడెన్. ౧౯

ఉ॥ ఎవ్వఁడు కన్ను మిన్నెఱుఁగ కీ
కొఱగామి పసిన్ బొనర్చె వాఁ
డెవ్వఁడు మిత్తి నెత్తి పగిలించు
తలంపున పంతగించెఁ దా

నెవ్వఁడు మిత్తిగొంగఁ దల - నెక్కిన
'గంగ'ఁ గలంపఁ జూచు వాఁ
డెవ్వఁడు నన్నెఱుంగకిటు -
లేత్తెఱఁ జేసెను మీఁదెఱుంగకే.

చం॥ ఖరుఁ డిటులాడ రక్కసులు -
గండు మగంటిమి మించు జోదులై
పరిఁగొని 'రాము'పైఁ గినిసి -
పల్కుచు నుల్కుచు నీజెగమ్మె పె
ల్కు-జి మసిచేయు చాయ -
సెలగో! సెలగో! యని గుంపుకట్టి వ
చ్చిరి పెను బూతముల్వలె ని - సీ!
యతఁడెంతని? పోటు మాటలన్.

కం॥ వచ్చిన 'దూషణు'ఁ డోడ్తో
బ్రచ్చి 'ఖరుని జెంపినంత - వడివడిఁజెనిపే
రచ్చువడ'రాము' బలిమిని
మెచ్చి 'యకంపనుఁడు' సోఁకు - మేటికి విని చెన్.

ఉ॥ అత్తఱిఁ జుప్పనాక యలుఁ - గంటిన
జింక తెఱంగు నొత్తి ప
ర్వెత్తుచు నన్నకాళ్ళఁ బడి -
యేడ్చుచుఁ గన్నుల నెత్తురొల్కఁ బే

పెత్తిన గిన్కఁ దిట్టుచు స –
యింపఁగ లేని నొగుల్ దగుల్కొనన్
దత్తర మెత్తి యొత్తిగిలి – తాఁ
బడు బన్నములన్ని యెన్నుచున్. ౭౩

కం॥ ముకుసెవులుఁ దెగిన మొగము
న్నకుఁ జూపక చూపి కెవ్వు – నన్ గేకలిడన్
సెకఁదాఁకు మేని తాల్పటు
కకవిక పాటొందు నన్న – కడఁ జెల్లెలనెన్. ౭౪

చం॥ అడవిని నాకుటెంట నొక – యన్న
యుఁ దమ్ముఁడు వారి వెంబడిం
బడఁతుక యొండుఁ గద్దు నెల –
మాదిరి మోము వలంతి సింగపున్
నడుము వెలంది వెన్నెలను –
నవ్విన నవ్వుఁ బదాఱు సాలులన్
బడసిన జవ్వనిన్ గనుల –
పండువుగాఁ గనుగొంటి మాయురే! ౭౫

కం॥ జిగమంత కడిగి గాలిం
పఁగ నగపడ దొక కడాని – బరిణఁ గనుఁగొనం
దగు నాకే తగుఁదగు ననఁ
దగులాటవు పెత్తికోల్గ – దా! నీకయినన్. ౭౬

కం॥ ఆ నెలఁత నాకు వదినగ
యైనన్ నా భాగ్యమేమి? - యని పలుకుదు నీ
కేనబ్బు టలసదనియే !
నానమ్మక మింతచూచి-నన్ దెలియ నగున్. ౨౭

కం॥ అనిచెప్పిన చెల్లెలి యే
డ్పును మాన్పి యలంతి పల్కు - శోకడఁ బోపా
మ్మని యిదె! బరతము పట్టిం
తును జేపో! మాపో! చూచు-దువు నాబలిమిన్. ౨౮

కం॥ అనిపలికి చెప్పినటు చే
సిన గద! నాబతినఁ దీఱుఁ - జేయమి వాకా
టున కురవగు నని నిడుద తలం
పున మిగులన్ వగలఁ బొగిలి - మొఱకుఁ దనమునన్.

కం॥ మరునాడు 'రావణుఁడు' తన
యగదముపై నెక్కి-నిక్కి - యడవికిఁ జని చె
చ్చెర 'సీత'ను బెల్లింపున
బరువడిఁ గొని తేర నెంచి - పయనం బయినన్. ౩౦

కం॥ 'మారీచుఁ'-జేరి తనకుం
గూరిన సెగ్గింపుల వినఁ - గోరి పలుకుచున్
గేరుచు 'సీత'ను బడయం
గోరిక కలదంచు నతనిఁ - గొండాడు తఱిన్. ౩౧

శా॥ ఔరా! రావణ! నీవ పల్కినటు నీ-
దౌ యుక్తులున్ రక్కసుల్
మారా రాముందిరి 'రాము' చే
నతఁడనన్ మంపిల్లె నీబుద్ధి యాఁ
హా! 'రాముం' డన నీసరుండె!
మెయితా-ల్పంచుకా మదిన్ నమ్మి నీ
పీ రేద్రిమ్మరి చేఁతలన్ జెనకె దోః-
యీ కర్జములన్ మానుమీ. 37

కం॥ అని పెక్కు తెఱంగుల బు
ద్దిని గఱపిన బదులు వలుకఁ-దెగ తెంపునఁ ద
చ్చనలాడుట కంటెను 'రా
ము'ని ప్రోలను జేచ్చుటెంతో! పున్నెమటంచున్.

మత్తకోకిల॥ వాడిపలుకుల నొవ్వనాడిన-
వాఁడు రావణుఁ గూర్చి యి
వ్వాడు మోఱకుఁ డడ్డు చెప్పిన-
బన్నములన్ గలిగించు నా
పాడుచావున కంటె 'రాము'
ని-పజ్జఁ జేచ్చుట మేలటం
చాడికల్ గొనిఁ రావణుం గొని-
యాడెఁ దీయని పల్కులన్. 38

ఆ॥ వె॥ నీవ చెప్పినట్లు నేఁగూర్తు నీయానఁ
దప్పఁ దంచు నెడఁద – నొప్పగించి
నంతఁ బసిఁడి లేడి – వయి 'సీత' చెంగటఁ
బరువుఁ బెట్టుమనుచుఁ బట్టుఁబట్టె. 30

కం॥ ఇది నెఱవేర్చినచో! నె
య్యది మార్గ్యలుకకయె, సీమ – యం దొకసగముఁ
దుదిఁ బంచియిత్తుఁ దప్పను
మదినమ్ముము నిక్కమనుచు – మఱి మఱిఁ బలుకన్.

కం॥ బ్రతికితిని దేవరా! యని
యతని వలం దవుల కీవ – లావలఁ బడితిన్
వెత రానున్నది కాని –
మ్మతుకు బ్రతుకు కంటె మేల్మి-యగుఁ జావైనన్. 32

కం॥ మేలుఁగదా! యని రక్కస
యేలిక చే సెలవు నంది – యేతెంచెను దా
నోలి మెయి తాల్పుఁ బ్రాపే
చాలు ననుతలంపు – గుంపు – సంపతిలంగన్. 33

సీ॥ మేలిమి మెట్ట విల్మేటిచే నున్నట్టి
జింకకు దీనికి – లంకె యేమొ?
చెందురులోని ప – సందగు నిట్టికి
దీనికిఁ జెలికార – మానొ! యేమొ?

మించు మించిన సంచు - నొంచిన యిద్దాని
మేని మెఱుంగు ని - ల్పానెనేమొ ?
అడవి మెకాల ను - న్నట్టి క్రొన్నడతీరు
సొరు లీలేడికిఁ - గూరెనేమొ ?

సీ॥. వేల్పు పడఁతులు వింతకై - విడచి సంత
సమున గన్గొని ముఱియు మె - కమొ ? మతేమొ ?
యనఁగ, నందమ్ము చేందమ్ము పుణికి పుచ్చు
కొన్నటుల్ లేటి వెలిఁగెఁ గ్రొం-గ్రొత్త మిసిమి. ౩౯

గీ॥ చెవులు.ఱిక్కించి కన్నులుఁ జేరెఁడేసి
బెళుకు చూపులఁ జూచుచు - వెలికి నుఱికి
కుప్పిగంతులు వైచుచుఁ గొమ్ములెత్తి
పర్వి గిట్టలదుమ్ము ను - ప్పరము మెఱయ. ౪౦

మ॥ వలకేలెత్తి కుఱంగటన్ బువుల
రా - ల్పన్ బూనికన్ జేలు కొ
మ్మల నాడించుచు నిట్ట నిల్వన
గనెన్ - మ్రాన్పాటుఁ బాటిల్ల ని
మ్ముల నెందుంగనఁ బోని క్రొందళుకు సొం-
పుల్ నింపు జింకన్ జెలుం
గులు వెల్గొంది న యంద చేందములు మై-
కోలాయెనా 'సీత'కున్. ౪౧

కం॥ ఎటులైన దానితో న
చ్చేట ముచ్చట నాడుకొనఁగ - సంబరపడి ప
ల్కుట కిచ్చగించె 'రాము'ని
కట నాగెలుచాలు పేరి - యతివ తనంతన్. ౮౨

కం॥ కానితఱిఁ గట్టడులె, యె
వ్వానికిఁ లోఁగొని కలంప - వచ్చును - మయితా
ల్పేనియు మదివచ్చిన యటు
బోనిచ్చున్ గోరికల నె - పుడు బన్నపడన్. ౮౩

కం॥ చెడుతఱి వచ్చునెడన్ గో
రెడు కోర్కులుఁ గూడ దాని - రెట్టింపుగఁ బా
ల్పడుఁ గాన 'సీత' జింకకుఁ
బడు పాటులుఁ గట్టడలయి - పలు వెతలవిడున్. ౮౪

కం॥ తనమగనిఁ జేరి నిగనిగ
మని నోటి నురుంగు వెన్నె - లటు వెదలిన లే
డిని జూపి దానిఁ గొని తె
చ్చిన 'సీత' యెడందఁ గడవ - నేమం బనియున్. ౮౫

కం॥ చిక్కక దక్కిన నొక్కెడఁ
జిక్కుల నెక్కువఁగఁ గూర్పఁ - జెండి యయిన దోల్
దక్కిన చాల్ గని వింతగ
నిక్కుచుఁ దనివారఁ జూచి - నెమ్మది నుంమన్. ౮౬

చం॥ అనవిని యాలిమాట నిజే -
మారయ్య జాలక 'రాము' డొయ్యనో
య్యన బరువె_త్తి జింక నెటు -
లైనను బట్టుకొనంగ నెంచి టి
వ్వన జేనుదాని వెంటఁ బలు -
పోకలఁ బోయి యెటేవిఁ జిక్క ద
క్కి సటులఁ దోఁచి వేచి నటు -
కేరడముల్ పచరించి మించినన్. ౪౭

కం॥ అది నులికొమ్మల మొకముగ
నెదురం గనిపించుఁ గాని - యెంచ నసరయే!
యది వంచేనమని 'లక్ష్మణుఁ'
డదిరా! పల్కాడ 'రాముఁ' - డది వినఁడేమో? ౪౮

చం॥ అటునిటు దారితారి యెటొ?
యడ్డము దిడ్డము వచ్చి సొచ్చి య
ప్పటముగఁ బిక్కి దక్కి నటు -
పర్విడి నుర్వును గ్రక్కి సొక్కి వే
సటఁ గలిగించి యాసలు వె -
సం బురికొల్పుచు డగ్గఱించుచున్
డటుకున దూటి పాఱుచు న -
దాటున ముంగల దిక్కి నిక్కుచున్. ౪౯

ఉ॥ ప్రొద్దొక యింత దానికయి –
పోరి బడల్పడి డస్సి క్రుస్సి తా
గ్రుద్దినటుల్ వితాకున ద –
గుల్వడి కిన్క – యొకింత పున్కలో
నద్దినమాడ్కిఁ గోల దరి –
యన్ గుటీవో నరివోసి యేసినన్
గద్దటి మాయలేడి గిర – కాల్గొని
పొర్లుచుఁ జావు గొంతుతో. ౫౦

కం॥ హా! లక్ష్మణ! యని చెచ్చిన
నాలో, 'మారీచుఁ' జూచి – యబ్బురపడి ము
న్నే 'లక్ష్మణు' డిది పల్కిన
నాలింపఁగ నైతి రాఁగ – లట్టి దోసంగుల్. ౫౧

కం॥ మైతాల్పులకును 'గట్టడ'
పాతర లాడించు నెట్టి పట్టుల గానక్
లోఁ దెలుఁగ నైతి నచ్చోట
'సీత' యు – 'లక్ష్మణుఁ' డదెట్టి–చిక్కులఁ బడిరో. ౫౨

కం॥ అని తనలో దా సందియ
మును బెనఁగొని 'రాము' డెడఁదఁ–బొడమిన తలఁపుల్
మునుముకొని వేఁపఁ దోడ్తో
వెనుదిరిగెన్ వచ్చిన పని – విత యయి – యంతన్. ౫౩

మ॥ మరదీ! లక్ష్మణ! లక్ష్మణా!
యనుచు నే - మం బొప్పఁబిల్పొందు ద
గ్గర విన్పించెను 'రాము' నేమి సిలుఁ
గుల్ కార్చిచ్చెటుల్ దాఁకెనో?
తొరగాఁ బొమ్మన 'లక్ష్మణుం'
డనియొ, నెం - దుం గాని మాయన్నకున్
నెఱసుల్ దాఁకవు సోఁకవే మయిసఁగా-
నీ! యంచు మాఱొడ్డినన్. ౨౨

కం॥ మాయన్న కెవ్వరొక కీ
డేయెడఁ జేయంగలేర - దేల? వెఱవన
మ్మా! యన దొసఁ గెసఁగనిచో?
మాయురె! నిన్నట్లు పిలుచు - మాటఁ దలఁపుమా!

మ॥ అను 'సీతన్' గని 'లక్ష్మణుండు'
వినుము - మ్మా! 'రాము' నిన్ బోర గె
ల్వను ముక్కంటియు బమ్మ వెన్నుఁ
డును బో - లర్ జాల రిచ్చోట మా
యను బన్నంగల రక్కసుల్
గలరు వా - రాతీరులన్ బూటక
మ్మును జూటం గలవారినమ్మ నెడ నె -
ప్డున్ జిక్కులన్ జిక్కవే! ౨౬

[19]

కం॥ అనినంతట 'లక్ష్మణు' గనుఁ
గొని యీవలఁ దిరుగఁ గన్ను - గొలఁకు లెఱుపునై
యనరాని మాటలాడుట
కును మొదలిడె! 'సీత' - చెలులు - కొఱగాములనన్.

కం॥ సవతుల కొడుకులు పగవా
రవుదు రనుచుఁ బెద్దలాడు - నది దబ్బఱయా!
అవునవు! దెలిసెను 'రాముని'
కవలన్ నన్నేలు కోర్కె - లదవద పఱచెన్. ౫౮

ఆ॥వె॥ అగ్గి నుఱికియైన - బగ్గము పాడౌదుఁ
గాని కీడుతలఁపుఁ - గలుగు నిన్ను
ముట్ట నోడుదాన! చెట్టపనుల్ గల
వాని సబముఁ గుక్క - లైనఁ దినవు. ౫౯

కం॥ అని తూలనాడినను 'ల
క్ష్మణుఁడమ్మా! చెడుతలంపుఁ - గలదా! యిక్కొ
నను సోఁకుమూఁక చేఁ గీ
డెనయు నటంచాడి తింత - యెఱుఁగవె! నన్నన్. ౬౦

సీ॥ అమ్మ! 'సౌమిత్రి' కన్న సీ - వన్నెమంచు
నెన్నఁగా లేదు మది నిట్టి - నన్నుఁ బట్టి
బిడ్డఁగాఁ దలపోయక - సొడ్డులాడఁ
దగునె? మగువల కిది సాజ - మగునొ? యేమొ?

కం॥ ఇటులాడి కన్నుఁదమ్ములఁ
బుటపుట వేన్నీళ్ళుఁ దొరఁగఁ బొనుపడి పిలుపె
చ్చట నుండి వచ్చెనో? య
చ్చటకుం బరువెత్తె 'రాము'_నరయుట కొఱకై. ౬౨

కం॥ వెనుదిరిగి చూచుచును దన
మునుపటి చొప్పరసి పరుగు _ పొందిక మెయి నే
చిన వదిన పలుకులను గల
పెను చెడుగు మదిం దలంచు _ భీతున జెనియెన్. ౬౩

సీ॥ గిలుకు పానలు మెట్టి - తొలసి పేరులుఁ బట్టి
హర! హరా! యనుచుఁ గొం_డాడువాఁడు
వెలిబూది మూఁడురే - కలు దిద్ది నుదుట గుం
డ్రని చుక్క_బొట్టు గం _ దమ్ము వాఁడుఁ
జేమంతి పూసరుల్ - సెవుల పోగులవాఁడు
రుదురాకు పెద్ద పే _ రెదఁగలాఁడు
సంజె కెంజాయ నో _ సరిలు కావిఁ గలాఁడు,
వల కేల్క_మండల - మొలయువాఁడు.

గీ॥ వలపు గిలుబాడు కోరచూ _ పులుఁ గలాఁడు
మిండ జంగము వేసాన _ మెఱయు వాఁడు
నాకుటిలు ముంగిటికి వచ్చి యట్టులిట్లుఁ
దారుచున్ 'రావణుం'డటఁ _ దటపటించె. ౬౪

సీ॥ వెలఁది నెమ్మోముఁ బూయు - వెలిబూది వెలుఁగులు-
తఱపి వెన్నెల దెసల్ - త్రస్తరింపఁ
గన్నులంగించు జే - గా మించు క్రొంజూపు-
కోపులు వలఁకులఁ గుస్తరింపఁ
జీటికిమాటికి - 'సీతఁ' గన్గొను నాస
ముందు వెన్కల కేదఁ - దొందరింప
వీలెటుగల్గు ని - వ్వెలఁదిఁ గొంపోవ నం
చురియాడు సందియ - మురవడింప

గీ॥ చిలుక తత్తడి మేటి వ - జీరు ములుకు
వెడఁద నోనాటి కళవళ - మినుమడింప
లెపుడెపుడుఁ గందు నాపని - యెట్లు నెగ్గు,
నేదివెర, వెట్లు, సేతు, నం - చెదఁ గలంప. ౬౫

ఉ॥ అత్తఱి 'సీత' నెమ్మది న -
హా! యటు 'రాముఁడు' వోయె నింతకు
వ్వొత్తుగ 'లక్ష్మణా!' యనుచుఁ -
బిల్వ నతండును బోయె లేడియో
జిత్తులమారిదైయె మిథ్యలఁ జిక్కులఁ
బెట్టుచు నున్నదో? సిలుం
గత్తెనో? యేమొ? రాకునికి
నచ్చోట నేమి దొసం గెసంగెనో? ౬౬

కం॥ అని వగచి కన్నుఁగవఁ జొ
ర్చిన నీరు తొంటంకి పైట - చెఱఁగున బడ గో
టను మీటుచుఁ దనలో ని
ట్లనుకొనెఁ దనమగనిఁ గూర్చి-యడలి బడిబడిన్. ౬౭

గీ॥ ఇంతలో దొంగ సన్యాసి -యెదుర నిలిచి
మొగము తేట పిసాళింప - నగవు లొలుకు
తిన్నఁదనమున గొంతెత్తి - చిన్ని యెలుగు,
తోడ 'సీతమ్మ' తోడ మా - టాడఁ దొడఁగె ౬౮

కం॥ నమ్మక మెదఁ బదిలింపఁగ -
నమ్మాయలమారి జోగి - హర! హర! హర! నా
ముమ్మారుఁ బలుకు నెడ నెడ
నమ్మగువన్ దరిసి మాట - లాడును-బెక్కుల్. ౬౯

కం॥ ఊరెయ్యది? పేరెయ్యది?
తీరెయ్యది? పుట్టినింటి - తెఱఁగెయ్యది? నీ
సౌరు నిగార్తమ్ముల్మను, బయ
కారముఁ జూఱఁగొను మగని - కత యెయ్యదియో?

కం॥ అని యడిగిన బైరాగినిఁ
గని, యీతఁడెవండొ? కోన - కాఁపరి యని యె
త్తిని బత్తి నూఱ డిల్లుం
డని తన కత యెల్లఁ జెప్పి - యనువేర్పఱుపన్. ౭౦

మ॥ కలికీ! నీకత నేనెఱింగితిని నిం -
కన్ నాకతల్ నీకిదే
తెలియంబల్కెద 'లంక' నేలుపబుడన్ -
దిక్కొదు మ్రొక్కొదు న
ల్వాలఁకుల్ తేండ్లకు నైదుబూతముల
కున్ - 'బమ్మన్న' మాతాత పే
ర్వాలయున్ 'విశ్రవసుండు' తండ్రి,
యిఁకఁ బే - రే! 'రావణుండఁ' జుమీ!

కం॥ ఈరేడు జగమ్ముల న
న్నెరీ? యెదురించు వార - లెందుంగల రె
వ్వారయిన సరియె, మార్కొని
దోరింతుర్ బోర నెంత! - దొడ్డ బలియునిన్.

కం॥ కోరిన బోటుల కూటమిఁ -
వారక పాటింతు నొకట - వలదని త్రోతున్
నీరూపు వినిన కోరిక
లీరికలెత్తె నిఁక నన్ను - నేలుకొనఁ గదే!

నను దలఁచి యెందతెందలో?
కనుగీటన్ గోటఁ బుచ్చి - కలికీ! నీరూ
పును గాంచి పొందవచ్చితిఁ
గనుకన్ దరితీపు మాని - కలియవె! నన్నున్.

గీ॥ అనిన మోమోడి వెనుకకు _ నాకటింటఁ
జొరఁబడిన సీతఁ జూచి యా _ మొఱకు టసుర
అంత విడువక ముందున _ కింత జేరిగి
చెలఁగి నీతీరు మాటాడె ! _ 'సీత' తోడ. ౭౬

ఆ॥ వె॥ కాయ గసురు లేరి _ కడిఁగాఁగ బోసేయు
నలఁతి 'రాముఁ' డేల ! _ యసురమిన్న
నన్నుఁ గొన్న సుకము _ లన్నింట రాణివౌ
దన్నుఁ జూచి 'సీత' _ యతని కనియె. ౭౭

ఆ॥ వె॥ పాఱుటసుర, యిట్లు _ వలికిన నగ్గిపై
గుగ్గిలమ్ము చల్ల _ భగ్గుమన్న
యట్లు మండి మోరి _ యసుర ! నీ నెమ్మేను
పడుఁగాను సంతు _ బీడువోను ! ౭౮

కం॥ 'రాము'నకు నీకు నేన్గుకు
దోమకు గల తెఱపుమఱుపుఁ _ దొడరు నిఁకన్ నీ
వామిక వేమరు నీమెయి _
బూమెలు వలుకాడ నోటఁ బురుగులు పడురా ? ౭౯

గీ॥ మిత్తి నెత్తిన కాలెత్తి _ మొత్తినట్లు
విషపు ముద్దను మ్రింగిన _ విధము - జేముని
దుంత కనుగ్రుడ్లు దురుసున _ బెఱుకుతీరు
నోరి ! 'రావణా !' 'రాము'తోఁ _ బోరు టనిన ! ౮౦

కం॥ అనినంత వింత వేసముఁ
గొని బెబ్బులి జింక నెత్తు - కొని పోయిన చా
యను 'సీత' నెత్తుబరికా
నిని పోలెన్ సొంతదారి - నిం బడి పోవన్. [illegible]

చం॥ ననుఁ జెఱఁ బట్టి 'రావణుఁ' డ -
నందగు రక్కసుఁ డుక్కుమీరి తే
రున గొనిపోవు వాఁడిదె! యి -
రుల్ గనరిచ్చెట లక్ష్మణా! చేల
మ్మున నినుఁ దిట్టు లాబమిటఁ బొం
దితి దోసమ - యేమిచేయుదున్
నను విడిపించుకోఁ గలిగి -
నన్ బెను పున్నెముఁ గల్గు వెంటనే- [illegible]

కం॥ ఓ రామ! యొక్క యుక్కవుఁ
డీ రామను! దీసికొని యి-టేగెను దిక్కై
లేరెవ్వరు! రారెవ్వరు!
గారామున వచ్చి నన్నుఁ గై కొనఁ బోవే! [illegible]

గీ॥ 'రాము' నిల్లాల నే 'దశ - రథు'ని కోడ
లను 'జనకు' కూఁతురను 'సీత' - లంకనేలు
'రావణుఁడు' దొంగలించి కొం - పోవుచున్న
వాఁడుఁ గావరె? పున్నెమ్ము - వాడుకొనరె! [illegible]

కం॥ అని 'లకుముకి' పలె నేడ్చిన
విని రోసము పోసరింపఁ - బెంపఱ మది 'రా -
వణు'తో 'జటాయు' పటఁబో
రిననసరం యెదిర్చి వాని - ఱెక్కలు నఱకెన్. ౧౫

గీ॥ పులుఁగు ఱెక్కలఁ ద్రుంచి గొ - బ్బునను బోయి
హౌసుతోట నశోగము - నందుఁ గ్రింద
డించి 'సీత'కుఁ గావలి - యుంచె నసర
ముసరెఁ గలకండఁజీమలు - ముసరినట్లు. ౧౬

కం॥ మరునాడొక్కెడ వేపిన
తఱి మరుని లకోరి సెకలఁ - దాళనివాఁడై
పరువెత్తె నందచందము
లిరవందఁగ 'రావణుం'డ - దే పసిమీఁదన్. ౧౭

శా॥ సింగారమ్మొదరంగరించినటుఁ గై -
సేసెన్ బదార్వన్నియా
బంగారమ్మున మాసికమ్ము పొదుగం -
బడ్డట్టి సొమ్ముల్ మెయిం
బొంగారన్ సవరించి యందెరవళున్ -
మార్మోయఁ దేరెక్కి ని
ల్వ్యాం గొల్వన్ సకులున్ బరాబరులు
గెల్వుం జాటి పోటాగ్గఁగన్. ౧౮

కం॥ వచ్చుట తడవుగ 'సీత' ను
హెచ్చరికఁ బొనర్చి నన్ను - ఓ ! చూడుమ ! నా
హెచ్చగు నందము చేందము
మచ్చున కై యొక్కసారి - మాటాడు చెలీ! ౮౯

కం॥ దచ్చి కడ లేలువారిని
వ్రచ్చుదు నాయాన మీఁరు - వారిని మరుఁడ
ప్పిచ్చును సొగసున కుంకువ,
ముచ్చిరు నాబీరమరసి - బూతము లెల్లన్. ౯౦

కం॥ ఇకఁ 'రాము' నాస వదలుమ,
సకి సంద్రము దాటి నెవఁడు - జాలును! మది మా
ర్పోకయింతఁ బూని నాతో
సుకముం జూఱఁగొను మివిగొ? సూడిదలనినన్. ౯౧

కం॥ విని 'సీత' మొగమ్ము సగ
మ్మును వంచి చిరాకుఁ బెంచి - ముందొక కేలన్
గొని గడ్డిపఱక నడ్డ
మ్మును నిడి 'రావణు' నితోడఁ బోరిత మాడెన్. ౯౨

ఉ॥ రావణ! గడ్డి పోచకుఁ ద - రమ్మునుఁ
గాని దోసంగు చేఁతలన్
బ్రోవగు నీవ దేడ? జెగ -
ముం దన యాన మెలంగ నేర్పుఁ దీ

ర్పావటిలంగఁ బ్రోవఁ గొనియాడఁగ
నిక్కగు 'రాముఁ' డేడ? 'ఛీ'
కావరమింతఁ జేసె నుడి – కారము
మానుము నీదు బీరమున్. ౯౩

చం॥ నగటిమి యున్నఁ గట్టెదుర –
మారొక్కని గెల్వు సిడమ్ము నెత్తి మె
ల్లఁగ వెలుఁగొందఁగాఁదగు బ –
లారె! సకిన్ దెరచాటు దాని నొం
టిగ నడయాడుదాని నిటు –
లెక్కనఁ గోణముదారి వేసమొ
ప్పఁగఁ గొని దొంగలించితివి –
పోకిరి సేఁతల నిద్దిబుద్దియే. ౯౪

కం॥ సీయాలెట్టులొ సీక
ట్లే యొరులకు వారి యాంధ్ర – నెంచుట సాజం
బోయసర! యింత యెఱుఁగవు
ఛీ! యొప్పనివారిఁ దెచ్చి – చెడెదవు చెడుగా! ౯౫

కం॥ అనవివి 'రావణుఁ' డీసీ
ళ్ళను దన పప్పు లుడుకవను – లాగున దలపో
సి నెఱి వలపోర్చి గిట్టున
జేను పూనికఁ జెలుల కాన – సరి క్రొత్త నిడెన్. ౯౬

కం॥ తడవుమొయి నోర్చి సీకిదె!
గడువిచ్చెద నొక్క-యేడుఁ గాకుండిన నిక్
గడికండ లేర్చి గ్రద్దల
కిడెద! సుమీ! యనుచు నసర - యేగెన్ గినుక

కం॥ ఇది యిటులుండఁగ 'రాముం'
డెదురయి 'లక్ష్మణుఁడు వచ్చు-టెఱిఁగి మది బదా
బదలయి నిప్పుల కుంపటి
యెదఁ గుదిరిచినట్లు పొగిలి - యిట్టులు పలికెన్.

శా॥ ఏరా! తమ్ముఁడ! యేకతంబొ?
యిటు నీ - వే తెంచుటల్ తోఁపదీ
ఘోరమ్మౌ యడవిన్ సతమ్మసుర లె-
గ్గున్ సెగ్గు నెగ్గింతురీ
తీరున్ నీకెఱిఁగించితిం దెలిసి ప్రాఁ-
తిన్ వచ్చితే 'సీత' యే
మా రాముళ్ళ బికారి చేపడెనొ! యే -
మై - పోయెనో? మాయురే!

కం॥ నాలావు, చేవ, బీరము
నో లక్ష్మణ! నీ వెఱింగి - యును, నివ్వెఱతో
వాలాయముఁ బరునెత్తితి
వీలాగున 'సీత' విడచు - టేమన వచ్చున్? ౧౦

కం॥ అనవిని హా! 'లక్ష్మణ' యను
పెనుసడి యొకఁడేగుఁదెంచి – వెఱఁ గూర్చిన నీ
యునికరయ వచ్చితిని హె
చ్చిన మచ్చికపెచ్చు పెరుగ–సెడు గడరునో కో ? ౧౦౧

కం॥ జేరిగిన దంతయుఁ దమ్ముఁడు
వరుసఁ బూసఁ గ్రుచ్చినటుల – వర్ణింపన్
మఱి మఱి 'రాముఁడు' లక్ష్మణు'
నరసి దోసంగెసఁగెఁ గడచి – నది తలఁపేలా ? ౧౦౨

కం॥ ఇత్తెఱఁగున దమనెదమొల
కెత్తిన ప్రేముడిని జెట్లు – తీరమ్ములు ను
వ్వెత్తుగ దాటుచుఁ బొడగని
రుత్తది పజేనెలవుఁ జూచి – యుల్లం బడలన్. ౧౦౩

ఉ॥ అంతట నిద్దఱుం గలిసి –
యాదర బాదర నాకుటింట నొ
క్కింత బిరానఁ జొచ్చి యట –
నిట్టటు లారసి 'సీతఁ' గానమిన్
వంత గుబాలునన్ దవిలి –
ప్రయ్యలు వాఱు మదిన్ వితాకునన్
గ్రంతలఁ బుంతలన్ బొదలఁ గానలఁ
గోనల వాగులన్ గడున్. ౧౦౪

కం॥ చెట్టుకుఁ జెట్టుకు గుట్టకు
గుట్టకుఁ బుట్టకును బుట్ట - కున్ వెఱ్ఱులటుల్
నట్టడవిఁ బట్టి మెట్టిరి
కట్టెదుముల తిట్టలై చె - కాపికిఁ దిరుగన్ ౧౦౫

చం॥ వలదని చెప్పినన్ వినక -
వైళమ దాలిచి నారచీరల
గ్గలమగు బత్తి వెంటఁబడి
కానల ద్రిమ్మరి యాకుటిల్లె' కెం
పుల యయినిల్లుగాఁ దలఁచి -
బోగములన్ విడనాడి కాయ గూ
రల బ్రదుకీడ్చి జింక కయి -
ప్రాచిత మిట్లగలించి నోంచెనే! ౧౦౬

కం॥ అని కాలును గాలిన పి
ల్లినిబోలెన్ దిరిగి సురిగి - లేమరి యయి మె
ట్టిన యెడ మెట్టక పో
యినపోకన్ బోయె నడవి-పొలమరు లగుచున్. ౧౦౭

చం॥ ఎటుఁగిన 'సీత' పోఁబడి యొ -
కించుక తెల్పి యితమ్ము సల్పి నా
మొఱవిని కావరే! యెడఁదఁ -
బూనరె! యక్కటికమ్ముఁ బున్నెపుం

దెరువును ద్రొక్కెగే! యనుచు -
దేవురుగొట్టయి రాముఁ డొగ్గి వా
చఱచుచుఁ గోనకాఁపరులఁ -
జెట్టుల జెట్టుల బిట్టు వేఁడుచున్ ౧౦౮

ఆ|వె|| అలసి సొలసి సొమ్మ - సిలి బెగ్గడిలి నడ
యాఁడు తఱి 'జటాయు' - వనెడి పులుఁగు
వారి తోడ నిట్లు పలుకాడె నెత్రు వ
ఱ్ఱోడఁ దెగిన ఱెక్క - జోడు తోడ ౧౦౯

కం|| హా రామ! యనుచు నేడ్వఁగ
నో రామా! డేగ చిలుక - నొడిసి యెగయు న
ట్లా రావణుఁ డరుగు నెడన్ -
బోరాడితి ఱెక్కదోయిఁ - బొడవడఁచె నిటుల్. ౧౧౦

కం|| ఎంత యెదురొడ్డి లాబము
కింతేనియు లేమిఁ దేలుఁగడఁ - దెలుపుటకై
యింత తఱి వేచి కాచితి
సొంతము పని యనుచుఁ దాను - సురులఁ విడిచెన్.

గీ|| చేయవలసిన పనులెల్లఁ - జేతులారఁ
జేసి పక్కికి మేల్గూర్చి - వాసి చనిరి
'సీత' కై, వారి యటమటఁ జెప్ప నేల?
రాముఁ డంతటి వాఁడె యా - రటముఁ గుడిచె. ౧౧౨

గీ॥ వింత మెయిఁ దాలుపుఁ 'గబంధు' - నంత దరియ
వారలిర్వురుఁ జేఁజిక్కి - బాదవడిరి
తెప్పిఱిలి వాని చేతులఁ - దెగ నఱకిన
విడుదలందిరి మాయను - విడుచు వడువు. ౮

కం॥ చేతులుఁ దెగియుఁ 'గబంధుఁడు'
ప్రాఁతిగ మీరెవ్వరనుచుఁ - బదులడిగిన వా
రీ తీరు తీయములు విని
సీత మగండాఁ కబంధుఁ - జెవి నిట్లనియెన్. ౯

కం॥ 'రావణు' నడవడికలు నీ
కేవితమున నైనఁ దెలియు - నెఱిఁగిన వఱకా
లోవయిన మెఱుక పఱుపుము
నా, వాఁడొక కోర్కి గోరి-నన్ వెను వెంటన్. ౧౦

గీ॥ వాని కోరికఁ దీర్పఁ 'గ - బంధు' సబముఁ
గాల్ప మేల్మేలి రూపును - గయికొని కను
పించి 'రావణు' కతలెల్ల - వెల్లడించె
నిట్లు 'సుగ్రీవు' చెల్మిఁ గా - వింపు మనుచు ౧౧

చం॥ ఇదియును గాక 'వాలి' వెడ-లింపఁగఁ
జేరెను 'ఋశ్యమూకమం
దు' దరిని మంతిరుల్ గలరు -
దొడ్డ మగంటిమిఁ గల్గు పోటరిన్

వెదకుచు నుండు నన్నపయి -
వేటిమి 'వాలి' నిఁ జంప నిబ్బరం
బెదఁ గలఁగఁ దలంచి యిది -
యే లగనంబని పట్టుఁ దెల్పినన్ - ౧౧౭

కం॥ అంతట 'రాముఁడు' - లక్ష్మణుఁ
డెంతయు నరవిరుల తీగె - లెగఁ బ్రాఁకు పొదల్
జెంతఁ గల యాకుటింటన్
సంతోసం బంతుముట్టు - 'శబరిం' గాంచెన్. ౧౧౮

గీ॥ వేలపుట్టులు తపముఁ గా - వింప నెట్టె
యెదుర దేవర కనుపింప - నెంత సంత
సమ్మొదవు నంత నెమ్మది - నెమ్మిఁ బ్రమ్మ
ముంగిటను - రాము నడుగుల - మొక్కు లిచ్చి.

గీ॥ అడుగుఁ దమ్ములఁ గడిగి నీ - రౌదల నిడు
కొంచుఁ బున్నెపు నీర్దావి - కొన్ని వేల
పుట్టు దోసాలు మాసెనాఁ - బొగడి కోలు
సేసి యయ్యెడ నూడిగ - మాసఁ జేసి ౧౨

గీ॥ ఆరముగ్గిన పండ్లు నే - ర్పార నేరి
కొఱికి చేవిఁ జూచి మేల్దిపిఁ గూరినవియె,
తీసికొని యారగింప నం - దించె 'శబరి'
బత్తియే గాదె! జగమెల్ల - ముత్తిఁగూర్చు ౧౨౧

కం॥ నాపుట్టువుఁ గడఁ దొలఁగెను
నాపున్నెముఁ బండె వీరె – నాదేవరలి
ట్లైపార నేగుఁ దెంచిరి
నాపాలిటి వేల్పులెల్ల – నను మన్నింపన్. ౧.

కం॥ నేనెంత పున్నెపుం బను
లేనియు గావింపకున్న – నీవేల్పులు ని
ట్లే నెవము లేని కూరిమి –
మై ననుఁ జూతురని 'శబరి' మఱి మఱి పొగడెన్.

కం॥ ఎన్నో పుట్టుల ప్రాఁచిత
ము న్నెగ్గుట గాక! పున్నె – ముం గూరుటచే
మన్నికఁ గొని మనుగడ నా
కన్నయ్యల కొఱకుఁ గనులుఁ గాయలుఁ గాచెన్. ౧

గీ॥ 'రాము' నడియాలమును జూచి – 'రాము' నూడి
గమునకై వేచి బిమ్మిటిఁ – గాంచె 'శబరి'
ముజ్జగమ్ములు నొక్కచో – మ్రొగ్గతిలిన
బత్తికిన్ దక్కనవి యెల్ల– బడిసివాటు ౮.

గద్దెము – కం॥ నీవెలుఁగందని పొందని
తావొక్కటి నరయు కొఱకుఁదరలితిఁ దుది నే
నై వెలుఁగుఁ గలిగి మెలఁగుటఁ
గావర మడఁగారె! గోరికలు జారె! దొరా!

# రామకత

## (నాల్గవపాలు కిష్కింధాకాండము)

కం॥ తరముల కొలంది తబిసులు
వరుసన్ నిన్నెఱుఁగు కొఱకుఁ - బన్నుగడల్ ప
న్నిరి వెలినున్నఁ గదో! ని
న్నరయుట? దానయ్యె నొరుల-నరయుటెటు? పబూ!

కం॥ గుంపులు గుంపులు తామర
తంపరగాఁ బూచి పండి- తనిసనఁ బొదరిం
డ్లింపున బెంపున సొంపున
అంపిలి చూపఱకుఁ 'బంప' ప్రాఁతిన్ నింపున్. ౨

గీ॥ అడవి లచ్చికి సోబన - మైన తేయి
పడకటిలు విరిసెజ్జ నేర్పఱచు తెఱఁగు
విరులు నెత్తావి గుబుఁరు తీ - వెల బరువున
వ్రాలి రాలుట బువి పూలబాట యయ్యె 3

ఉ॥ అంతట 'బుశ్యమూక' మను నమ్మలఁ
జేరిన 'రాము' లక్ష్మణున్
వింతగఁ జూచి క్రోఁతు లొక -
వేడబముం బచరించి యేలికన్

మంతిరులం గనుంగొని సు -
మాళము మాలిన డెందమందు బీ
తెంతయు నాటఁ దెల్విడుల -
హెచ్చరికం బొనరించి మించినన్.

కం॥ గాలికి రాలిన రాకుల
పోలిక ప్రెగ్గడలు పాఱి - పోయి రడవికిఁ
వాలాయము 'సుగ్రీవుం'
డాలించి నిడూర్చి పల్కె - హనుమంతునితో

కం॥ అనుమంతా! వారెవ్వరో?
పెను సందియమందెఁ బెద్ద - పెనఁదువ మెయి వం
చేన మొనరింపఁగ వచ్చిరొ?
కనుఁగొని రమ్మనుచు నానఁగా నిట్లనియెన్.

కం॥ దొర లన మార్వేసమ్ములఁ
బరిమార్తు రదెంత దొడ్డ - పగతురఁ దబిసుల్
తెఱఁగున ననుఁ జెంపఁగ వ
చ్చిరొ! లేదో? తెలిసికొనుము! - చెచ్చెర జనుమా

కం॥ విలు నమ్ము·లెందు జడదా
రుల కుండుటెఱుఁగ? వాలి - రోసముతో నీ
బలియుర నంపెనొ? చంపఁగఁ
బరుగునఁ బన్నమ్మొర్చి-వడయుము నిజేమ్ముఁ.

మ॥ అని సుగ్రీవుఁడు నిర్వ్యాజం బలుక న
య్యా! వైళమే పోయి చె
ప్పిన మాడ్కిన్ దరిఁజేరి వారి యెడఁదల్
విప్పారు తప్పొప్పులన్
గని మీకా వివరమ్ముఁ దెల్పెదను గ్రాఁ-
కన్ బొంది కుందంగ వ
చ్చునె! కొండల్ తలక్రిందులై పడిన రా-
జుల్ వెన్నుఁ జూపింతురే! ౯

మ॥ అని మోమోడక పల్కి మేవడిన డా-
యం జేరి నిల్వెత్తు బ
త్తిని జేమోడ్పు లొనర్చి 'రాము' దరి బం
తిన్ నిల్చి మైవ్రాల్చి యి
ట్లనియెన్ సాములవార లిచ్చటికి రా-
నయ్యెన్ గదా! కూరిమిన్
దనిసెన్ మాప్రజ లాణియమ్ము సుకమం-
దర సందియం బున్నదే! ౧౦

కం॥ మీరేచేటి నుండి యిటకరు
దేరితిరో? యేమిపనియొ? తిరుగా నెటకున్
జేరఁ దలఁ పున్నదో? యా
తీరుల్ సెలవీయ వలయు - దేవర లనుచున్ ౧౧

క౦॥ ఊరును బేరును కొలమగు
తీరున్ను మఱి జేరగుకతలుఁ - దెందేఁపలుగా
సారెకు నెఱిఁగింపం దగు
వారక నాకనిన వినుచుఁ - బ్రన్నదనమునన్. ౧౨

తే॥ అన్న మిన్నకున్న - నయ్యెడ 'లక్ష్మణుఁ
డున్నమాటఁ జెప్పి - యోటువడియె,
'హనుమ' యూరడించి - నంతటఁ దమ బడ్డ
బన్నములను బలికె - వరుసఁ బెట్టి ౧౩

గీ॥ అవల 'హనుమంతు' తో రాముఁ - డనియె మాకు
మీకు వేరమ్ము లేదు చె - ల్మియె కడిందిఁ
గోరు వారము 'సుగ్రీవుఁ' - గోర్కెఁ దీర్ప
వలయు నామూరుగాఁ బల్కె - వలె నటన్న ౧౪

గీ॥ నేలఁ జాఁగిలి పడి మోడ్పుఁ గేల లేచి
సెలవుఁ గైకొని యేలికఁ జేరి యున్న
యన్ని వివరమ్ములను జెప్పి - నంత సంత
సించి 'సుగ్రీవుఁ డానతి - నిచ్చె నిట్లు ౧౫

తే॥ అంత మంచి వారలైనచో నవ్వారి
చెలిమి కలిమి మనకు - బలిమి యలము
తోడితేరఁ బంచెఁ - దొందర సుగ్రీవుఁ'
'డనుమఁ' గాంచి వేఁడి - కొను మటంచు. ౧౬

చం॥ 'అనుమ'యు 'రామ - లక్ష్మణుల' -
యండకు వేఁ జేనుదెంచి మాపబుం
డును మిమ్ముఁ దోడితేరఁగఁ గ -
డున్గడు ప్రేముడిఁ బంపెఁ గాన రం
డని వెనువెంటఁ దోడుకొని -
యాదరబాదరఁ బోవ తేడున
చ్చిన మది హెచ్చు బత్తిఁ గొలి -
చెన్ జెలు లెంకలు యూడిగమ్మటుల్

సీ॥ 'ఋశ్యమూకమ్ము' దాటి యొ - కింత దవ్వు
పోయి 'గంధంపుమలఁ' జేరి పొలపపు మది
నగ్నినాకికిగాఁ జెల్మి - ననువు పడెన
టంచు నొండొరు లొకట మా - టాడు కొనిరి.

గీ॥ అంత 'రాము'ని చెంతకు - 'హనుమ' చేరి
యడుగుల మడుగులొత్తుచు - వాణిగల నిడి
మెల్లఁగాఁ జల్లఁగా నొడ - లెల్లఁ బులక
రింపఁ బెంపున సొంపు గ-డింపఁ బలికె.

కం॥ మాపబుఁ డిక్కట్లకు గుఱి
యై పెక్కులు చిక్కులంది - యగచాట్లకు లో
నై పాలిపోయి లేవడి
కాపురమై పోయె వారి-కత వినుఁ డనినన్.

శా॥ ఆలిన్ గోల్పడి యాణియమ్ము విడి నీ-
యట్లీతఁడుం గూడ గ
గ్గోలుం జెంది చిరాకుఁనంది యడవిన్ -
గోల్పాటు లేకిట్లు తం
టాలన్ గ్రుంగె నిఁకేని నిబ్బరము సం -
దర్ గుందుమున్ డింద మేల్
మేలుం బొందఁ గలాఁడటం 'చేనుమ' కూ-
గ్మిన్ బల్కు సాగించినన్. ౨౧

గీ॥ తోడ సుగ్రీవుఁడు'ను లేచి - దొఱకి నట్టి
'సీత' సొమ్ములు ముడిచిన - చేల చెఱఁగుఁ
దీసికొని 'రాము' చేతి కం - దించి యిట్లు
పలికె గాదిలి నెనరుట్టి - పడిన యట్లు ౨౨

కం॥ మంతిరులతోడ నేనును
మంతనమాడు తఱి 'సీత' - మముఁ జూచి మదిన్
వంత పెనుపొంది నిది చే
మంతి పువుంబోలె విసరె - మా యెట్టెదురన్. ౨౩

కం॥ కొని తెచ్చిన నెచ్చెలి న
చ్చిన కూరిమి సొమ్ము లంతఁ - జేకొని నిముస
మ్మున దవ్వు తలఁపుఁ బోఱి
వ్వునఁ దాఁ దొల్లింటి మాడ్కి - బొదలాడు తఱిన్.

కం॥ నా వలనఁ దీరుపం దగు
నే వేనియుఁ గోర్కులున్న - ని పుడడుగుండు నాఁ
జేవఁ దలిర్పఁగఁ దీర్చెద
నావుడు 'సుగ్రీవుఁ డిట్లు - నన్ మొదలిడియెన్. ౨

చం॥ బలియుఁడు వాలి దెబ్బ కిటు -
వ్రాలితి సోలితి సొక్కితిన్ గడున్
గలఁగితి నాలిఁ గోల్పడుటఁ గాక
విలాయతి పీడనాడితిక్
వెలికిని బాఱఁద్రోల నిదె -
వీఁగుచుఁ దూఁగుచు విక్కుచున్ గటా
వలపటు దాపటక్ జెడితి -
వాలినిఁ జంపిన మేల్మి నందెదన్- ౨౯

ఉ॥ నావిని 'రాముఁ' డిట్టులనె -
నాదగు బీరముఁ జూపిఁ వాలినిన్,
గావర మూచముట్టు తోలఁ -
గక్ బొనరింతును జూడుమన్న 'సు-
గ్రీవుఁడు' సంతసించి మది -
తేకరవిప్పిన యట్టు లిట్లనుక్
దేవర! యింతకంటెఁ గల -
దే! పెను పండువుఁ గాదె మన్గడన్. ౨౭

గీ॥ తండ్రిసన నేలుబడి యెల్ల - దక్కెఁ వాలి,
కాతఁ డానేయ మేలఁ మా యావి యనెడు
రక్కసుండుక్క నిక్కి పో - రం దొడంగె
రేయి తటినేను 'వాలి'కి - సాయ మెంచి ౨౮

గీ॥ వెంట నేఁటింన నొండొండ - గెఁటు బలిమి
లేమి గవిఁ జొచ్చె నసర 'వా-లియుఁ జొరబడె
నొక్క యేడైన రారైరి - నొకఁడుఁ గూడ
నేమి చేయుటకుం దోఁప - దించు కేని - ౨౯

కం॥ తటిఁ గడచి తుదకుఁ గ్రొన్నె
త్తురు పాఱెన్ 'వాలి' మడసెఁ - దుది రక్కసి య
ద్దరి దాటఁడంచు బండను
బొరియకు నడ్డమ్ము పెట్టి - పోయితి నంతన్ 3౦

కం॥ సూనరి! నేఁ గెడసినచో
నా నెలఁతం గూడి సుగము - నను రాచేటికం
బూనఁగ నెంచితె యని పగఁ
బూనికనఁ జంప 'వాలి' - పూనుకొనె దొరా! 3౧

కం॥ ఇది నిజమని 'సుగ్రీవుం'
డెదపైఁ జే వైచి పలుక - నెట్టులు 'వాలిన్'
సదమదము సేసి నిముఁ బ్రో
చెద నని తా వక్కణించె - సీత మగఁ డటన్. 3౨

గీ॥ అంత 'సుగ్రీవుఁ' డిట్లనె – నన్న 'వాలి'
'దుందుభి' సబమ్ము డాకాలి – తోడ దవ్వుఁ
జిమ్మెఁ దామట్లు సేసిన – నమ్మె దవినఁ
బూని 'రాముఁడు' నెగఁజిమ్మె – బోటనవ్రేల ౩

కం॥ అప్పు డది పచ్చిది బరువగు
నిప్పు డెండుట కతన నెంత – యేఁ జుల్కన నే
రుపు తోడ నేడు తాడుల
నిపుడే తెగనొక లకోరి – నేయఁగ వలయున్. ౩౪

గీ॥ అటు లయిన 'వాలి' నొంచు ను – దుటు బలిమియుఁ
గల దటంచెద నమ్మ వీ – ల్గల దటన్న –
చెచ్చెరన్ 'రాముఁ' డందఱ – చ్చెరువు నొంద
'ఫెళ్ళు' మని తాళ్ళ నేడింటి – త్రుళ్ళడంచె ౩౫

కం॥ పిడుగులు పడు వడువున వ
య్యెడ నేలంగూలు తాళ్ళ – నేడిటి 'సుగ్రీ'
వుఁడు సూచి యెడఁద నబ్బుర
పడి 'రాముని' బలిమికలిమి – వడిఁ గొండాడెన్. ౩౬

కం॥ నిన్నని నెదిరించెడి వాఁ
డున్నాఁడా! ముజ్జగముల – నొక్కఁడయిన, మా
యన్న యన నొక్క తెక్కా !
అన్నా! నీ సాయమెంత – కయినం దగదే ! ౩౭

కం॥ అనుటయుఁ దోడనె 'సుగ్రీ
వుని' గనుఁగొని 'రాముఁ' డనియెఁ-బొమ్మా! నీయ
న్నను బోరి కీడ్వఁ గిష్కిం -
ధను వాకిట నిలిచి పిలిచి - నన్ వచ్చుననన్. ౩౮

కం॥ వాఁకొనినన్ సుగ్రీవుం
డూఁకొని 'కిష్కింధఁ' జేరి యురవడి రవళిన్
జేకొని 'వాలిం' బిలిచిన
బాఁకున గ్రుమ్మినటు 'వాలి' - బలుతలఁపులతో ౩౯

చం॥ ఇదివఱకేని లేని దగు -
నీరస మిడ్డెటు వచ్చె నప్పుడే
ల్లిదమున బాఱుపోతయిన -
లెంక యిటే యెదిరించి నిల్వ బ
ల్లిదుఁ డెవఁ డొక్కఁ డీతనికి -
లెస్సగ సాయము సేయనోపు బె
ట్టిదముగఁ దాఁకి నొంచెదఁ గ -
డింది మగంటిమిఁ జూపి త్రుంచెదన్. ౪౦

కం॥ కట్టాయితమయి తిరముగఁ
గట్టుపకాసయి వలంతి - గరువము కనులన్
మిట్టిపడి బుజము లిరుదెసఁ
దట్టుచుఁ బరువెత్తి యొత్తెఁ దమ్ముని సత్తిన్. ౪౧

ఉ॥ అంతట నిర్వ్యాఁ రొక్క_మొగి -
నందెల బిందెలు వీఁగమ్రాఁగి పో
టంతయు వారునై బిరుదు
లందిన జోదుల తీరు పోరులో
నెంతయు నొందురుల్ వెనుక -
కిగ్గక తగ్గక మగ్గకగ్గియై
పంతముఁబట్టి కొట్టుకొను -
పట్టున నెట్టన 'వాలి' హెచ్చినన్. ౬

కం॥ విడువక మడమను ద్రిప్పక
కడువడి దీకోలుకొలఁదిఁ గావరముర వై
బడిబడి నొకళ్లొకళ్ళి
బ్బడి ముబ్బడి పగ్గెఁబూని_బవరము సేయన్. ౭

కం॥ గడియ లొకకొన్ని కడచుఁడు
గడుసరి య'వ్వాలి' బలిమిఁ గడుకొన_'సుగ్రీ
వుఁడు' బడలి యడలి నట 'రా
ముఁడుఁ' జూచుచు నుండె విల్లు_మోపెట్టి కటా!

కం॥ అప్పుడు 'సుగ్రీవుఁడు' చా
వొప్పమిఁ దప్పించుకొనియె - నూపిరిఁ గలచో
నుప్పమ్మి బ్రదుక నగునని
యొప్పుచు నా'రాముఁ' జూచి_రోఁజుచుఁ బలికెన్.

గీ॥ ఆడి తప్పని కొలమునుం బాడుచేసి
చెప్పి తప్పించి తిరుగుట - లొప్పగు నొకొ ?
'వాలి'చేఁ జిచ్చి యుందు నీ పలుకు నమ్మి
నెట్లొ? తప్పించుకొని బ్రదు - కీడ్చినాఁడ ! ౪౬

కం॥ అని యేడ్చిన 'సుగ్రీవునిఁ'
గని బిక్క మొగమ్ముతోడఁ - గా దటు నాచే
పనుపడి విడు నమ్మోరక
చేను నే? యుసు రడఁచు నంచు - సందియ పడితిన్. ౪౭

గీ॥ ఇద్ద ఱొకపోల్కి నుంట - గుర్తింప లేక
విడిచితిని గాక ! 'సుగ్రీవుఁ - విత మెఱుంగ
నొక్క యడియాల మిదుమని - వక్కణించు
'రాము' నానకు 'లక్ష్మణుఁ - డామతించి. ౪౮

గీ॥ పొగడ పువుదండ మెడనిండ సొగియు చుండ
గుఱుతు పట్టఁగ వీలు నే - ర్పఱచి యవల
ఆణి పోటునకుం బొమ్మ - టంచు 'లక్ష్మ-
ణుండు' బలుకాడ 'సుగ్రీవుఁ - డండ నుండి. ౪౯

కం॥ ఈసారి నైన 'వాలిని'
గాసిపడక జంపి నన్నుఁ గాపాడు మటం
చా సాసల 'రాము'నితో
బాసాడెఁ జేతఁ జేయి - వై చిన యట్టుల్. ౫౦

కం॥ తప్పక నీ పగతుని నా
చెప్పిన చొప్పునను జంపి - చేపట్టుదు నం
చప్పసము బతినఁ బూనెనో
కప్పుడు 'రాముఁ డటు విడువ'-నడలవె ! జగముల్

గీ॥ మఱల రెండవ సారి నే - మమ్ముఁ గూరి
'వాలి'తో దుర మొనరింప - వచ్చినట్లు
'తార' విని యిది యేమి క్రొ - త్తదగు వింత
యిప్పుడోటమిఁ బొందు వాఁడెట్లు? వచ్చు! ౫

ఉ॥ కాన నెవండొ కండితని -
కష్టముఁ దీర్పఁగ మేల్మిఁ గూర్పగన్
బూనిక సాయమౌ ననుచుఁ -
బొంపిరివోని కడింది డెందమం
దూనిన కూర్మిఁ జేరిమిని నోరిమిఁ
బల్కెను దొ_ల్త 'వాలి' యే
మైనను బోదిలోఁ జొరక -
యంతట నింతట నుండ లగ్గగున్. ౫

కం॥ అని యొత్తి తార చెప్పిన
వినక యతెండెంత విన్న - విడిచిన దోసం
బున మఱల ననికి దొరకొనెఁ
గనుక నిదే దుంపఁ ద్రెంపి-కాని సయింపన్. ౫౬

కం॥ నేనెంత పెద్దవాఁడనో
దానిని గుర్తింప కిట్లు – దద్దమ్మయి నా
పై నెదురొడ్డెదె! 'సుగ్రీ –
వా: నీవంతమ్ముఁడంతుఁ – బలువా! తులువా! ౫౫

కం॥ తన్నిన తావునఁ దన్నక
నిన్నగదా! విడిచినాఁడ – నీకింతటిలోఁ
గన్నులు తలపై కెక్కెనె!
దున్నా! నీమేని నూగు – దులిపెద నిపుడే! ౫౬

కం॥ ఇట, నిలునక రమ్మని య
చ్చోట ముచ్చట లాడు 'తార' చేనవలదని మి
క్కుటముగ నడ్డిన వినకయె,
తటుకునఁ బయసించె 'వాలి' – దండడిసేయన్. ౫౭

కం॥ ఎట్టెదుర నెదిరి పదటున
గట్టలుకఁ బోరఁ గోరు – గడుసరి 'వాలిన్'
గిట్టి తలపోసెఁ దమ్ముఁడు
గట్టిగ నాచేత గిట్టఁ – గలఁడో? లేడో? ౫౮

ఉ॥ వచ్చిన 'వాలి' మ్రోల నిలు –
వన్ గెలువన్ గలవాఁడనే యటం
చొచ్చెము పొచ్చెమూ మదిని –
నోరిమిఁదూలి యెటౌనో? రాముఁడీ

బ్రముచ్చును జంపునో ? విడిచి -
పుచ్చునో ? యట్లయినంత మిత్రిచేఁ
జేచ్చుట నిక్క మిక్కుతలు -
సాగక దేవర ప్రోచుఁ గావుతన్

మ॥ అని 'సుగ్రీవుఁడు' సందియంపడి సరే -
యట్లైన నిట్లైన ని
య్యానిఁ బోరాడుము నీసరుండె; కలఁడో -
య్యన్ 'రాముఁ'డే దిక్కుటం
చని చేతన్ దోడలప్పళించి బుజేముల్ -
హాళిన్ వడిందట్టి వా
లిని జేసేత సిగమ్ము పట్టి తిగిచెన్ -
లేకిన్ బలెన్ గొట్టుచున్

కం॥ ఇటు పెక్కు తెఱంగుల ముం
గిటి వేలుపుగిడ్డి 'రాము' - నిం దలఁచుచు నె
ప్పటి కైన 'వాలి' మడి యిం
చుటఁ దప్పదటంచు గోటినూలలఁ గ్రుమ్మెన్.

చం॥ ముడివడు కన్బొమల్ కినుకఁ -
బుణ్కిన కన్గవ చింత నిప్పుకల్
మిడుగురు లుప్పతిల్ల నికి -
లించిన సంచునఁ బండ్లు గీటుచున్

విడివడు కోల వోలె బువి -
పెల్లగిలన్ బరువెత్తి యొక్కమా
రొడుపున సండిటం బొదివి -
యొత్తి దిగంబడ వైచి మొత్తుచున్. ౬౨

ఉ॥ తమ్ముఁడు నన్నపై నుఱుక -
దాటులువెట్టక పెక్కు మార్లెదన్
గ్రుమ్ముచుఁ గ్రిందికిన్ దిగిచి -
గ్రుక్క మెదల్పక నోరుమూసి యీ
రమ్ములఁ గంపతుప్పల స-
రాసరి నీడిచి నాస నాలిఁ బోఁ
జిమ్మఁగ లేక యోటువడి -
చీకిలిమాకిలి యైన వెంబడిన్. ౬3

శా॥ వాలారుం గొన గోళ్ళతోఁ జిలుక సా -
ళ్వం బెట్టులుం బట్టున
వ్యాలిం బట్టి బిరాన నీడ్చి పుడమిన్ -
వైవన్ జిరాకెత్తి గ
గ్గోలుం బొంది వితాకుఁ జెంది యుసురుల్ -
గోల్పాటుమై తమ్మునిన్
గాలన్ ద్రేవేలఁ గదించి మొత్తెఁ దుమురై -
కన్పింప మేనెల్లడన్ ౬౪

మ॥ పడుచున్ లేచుచు వంగుచున్ నిలుచుచున్-
జై వ్రాలుచున్ సోలుచున్
కడకున్ నెట్టుచు నెత్తిపట్టుచుఁ గడం-
కన్ దిట్టుచున్ గొట్టుచున్
పిడుగుల్ వడ్డటు గ్రుద్దుచున్ బొడుచుచున్-
బేరీతెలన్ దూటుచున్
నడయేనుంగుల వీఁకఁ దాఁకుచు ననిన్-
గాటంబుగాఁ జేయుచున్. ౬౫

క॥ ఈలాగున 'సుగ్రీవుఁడు'
'వాలి'యు లావు మెయిఁ దొడరి - వడఁబడి పోరం
జాలక బడలిరి గాములుఁ
జాలని యెడఁ బెద్దలైనఁ - గనుగందు నటుల్. ౬౬

క॥ ఇది యదనని 'రాముఁడు' ప్రమా
న్మొదలన్ బొంచి కొని యంపపొదిఁ గల నలుఁగున్
మొదలంటఁ దిగిచి విడువఁగఁ
గుదురఁగఁ జేసి 'వాలి' నేలఁ గూలం ద్రోసెన్. ౬౭

చం॥ ఉసురులు గొట్టు మిట్టిపడి -
యూడని బాడఁ గలంగి తాళలే
కసురుసురంచు బాదపడి -
యానల 'రాము'నిఁ జూచి వంచనన్

రుసి వలె వేసమూని నెన -
రుణ విడి రక్కస చేఁతలన్ ననున్
బసగరఁ గొన్న నీకొదవు -
ప్రన్నని లాబము దేమి - చెప్పుమా ౬౮

గీ|| అన్నదమ్ములు జగడమ్ము - లాడుచుండఁ
దీర్పరివిఁ గాక! యుసురులుఁ - దీయు టుఱవె!
నాడుఁగాదింక నీపజేఁ - గూడ కాదు
వేఁడుకొన లేదు - పొమ్మను - వాఁడఁగాను. ౬౯

క|| క్రోఁతుల పాల లేరుదిస
రాతోలుడుపులునుదాల్ప - రనువు పడని న
న్నితీరు జెంపి మన సుగ
మే తెగకుం జెందునో? యొ - కింత నెఱుంగన్. ౭౦

క|| 'భరతుండె' ఱేడు నీవాక
పర దేసివి - హాక్క దెట్లు - వచ్చె నిపుడు నన్
బారిఁగొనఁగ దగమ మించుక
యెఱుఁగని మొఱకు సననేల? యొఱుక నెఱిఁగియున్. ౭౧

క|| నాకొడయుఁడవా! నేరముఁ
గైకొని ప్రాఁచిత మొనర్పఁ - గాఁ బెద్దవా! నీ
పీకై వడిఁ ద్రుంపఁగ నగు
నే! కట్టిడి చెయిద మిట్టు - లెరియించె ననున్. ౭౨

కం॥ తన సొంత పనికి నొరులను
మనికితపడి త్రుంచు టెంత ? మరియాద ! దొసం
గెనయుఁ గద ! జగము పజే లీ
యనువునఁ జెడు దారి నడచి - యడలిరి రామా ! ౨

గీ॥ ప్రాను చాటుంచు కొని చంప - మగతనమ్మొ
యెదుర నిలబడి పోర నీ - వేమి ? లెక్క - !
యపుడ తెలియును మన యిర్వు - రందు బలిమి
యింక మాటాడ లాబ మ - దేమి కలదు ? ౨౮

శా॥ 'సీతన్' దొంగిలు 'రావణుం'
బారిఁగొనన్ - జేచేత నీవిట్లు సం
గాతిన్ మేల్పడఁ జేయఁ బాటువడి నీ -
కర్జమ్ము నేఁ జేయ లే
నా ! తంటాల్వాడు 'వాలి' పేరు విన నీ -
యా చోట్లఁ బర్వెత్తి పెన్
బీతిన్ బూతము పట్టి తుట్ట తుది నన్ -
వేడఁగఁ బాఱాడఁడే ! ౨౯

చం॥ పనిఁగొని 'రావణున్' మిగుల -
బల్మిమెయిన్ జెవిఁ బట్టి యీడ్చి తె
చ్చొకని నిముసాన రానె ? మదిఁ -
గొంకక 'సీత'ను తెచ్చియిచ్చి నీ

పనుపున పోన! నేరని నె-
వమ్మిడి చంపితి గాక! వచ్చు మే
ల్మినిఁ జెయి సేతఁ గోల్పడిన -
మీఁద నలందుర లాబముండునే? ౭౬

ఆ॥వె॥ నీదు కాళ్ళుఁ బట్టి - నేరమ్ముఁ జేసితి
నోము మంచు 'సీత' - నొప్పగించి
వేఁడికోలొనర్ప - వేగిరపడ 'రావ
ణునికి నాన నిడఁగ - లను గదయ్య! ౭౭

చం॥ గడుసుదనాన 'వాలి' కిను -
కన్ బలుకన్ విని 'రాముఁ' డోర్మి నీ
నడవడి లేని మాటలకు -
నవ్వొక యించుక వచ్చెఁ దమ్ముఁడే
ల్పడఁతిని నాఁచి మైసుగము -
పట్టఁ దవుల్కొని యున్న నిన్ను నే
వడువున దిద్దు పాటొనరు -
పన్ దగవున్ దరమమ్ము నాకగున్. ౭౮

కం॥ నాపని కొఱకై యీతని
గాపాడన్ నిన్నుఁ జంపఁ - గా వలసెఁ-దుమన్
జేపట్టు దోసపుం బని
యీపగిదిన్ గట్టికుడిపె - నేమందువిఁకన్ ౭౯

కం॥ ఇటు లూరడించి పలికినఁ
తటుకున లో నుండి వచ్చి – 'తార' పరుసముల్
తటఁపటఁ బిరిగొన పెల్లా
రట పాటును మేటిలంగ – 'రాము'నిఁ గనియెన్ ౮౧

ఉ॥ అంగదుఁ డాడు మాట వెర –
వారసి చెప్పియు నమ్మకున్కి – నీ
యంగదఁ దెచ్చుకొంటి నిటు –
లారడి చెయ్యల మేలె! పానముల్
బ్రుంగిన లాబమేమి! మముఁ –
దోడ్కొని పోవక యొంటి డించి పో
వం గతమేమి? యిందఱము –
పంచలఁ బ్రక్కల నుండమా పబూ! ౮౨

కం॥ మునుమిడి పెక్కు రకమ్ముల
పనవి పనవి యేడ్చి యేడ్చి – వగచి వగచి సూ
డిన మది 'వాలిం' గని ర
మ్మని 'యంగదు' బిలిచి 'వాలి'–యండ నిలుపుచున్.

చం॥ కొడుకును రమ్ము పొమ్మనుచుఁ –
గూరిమిఁ బల్కవు చెప్పఁదగ్గ మే
ల్నుడువుల నాడవేమయిన –
నొవ్వఁదలంపవు ముందు ముందు నే

ర్పడు పను లెట్లుసేయవలె –
వానికి నప్పన సేయ విట్టి చా
వడరెను' దిక్కుఁ దోఁప దెటు –
లక్కట! యుక్కరి! 'రాము' చేఁతలన్.

కం॥ అని పలవించుచు 'రాము'నిఁ
గనుఁగొని నేఁదిట్టఁ గలను – గానీ, యిపుడా
లినిఁ గోల్పడితివి మఱిఁ గూ
డిన దానిన్ మఱలఁ గోల్పడెదవిఁకఁ జమ్మా! ౮౪

ఆ॥ వె॥ అవల 'వాలి' – తార – నంగదుఁ దమ్ముని
కప్పగించి రాము నరసి మురిసి
కొడుకు కితండ 'యంగదుఁడు' వీన్నిఁ గూరిమిఁ
జూడుమనుచు 'రాముఁ' – జూచిపలికి ౮౫

గీ॥ అంత నుసురులు విడనాడి – నట్టి 'వాలి'
కాల్పు మున్నగు పనులఁ జే – క్క నెఱవేర్చి –
రపుడ! సుగ్రీవునకు నెల్ల – రాణియమ్మ
దొరతనమ్మును గట్టి రం – దఱును మెచ్చ ౮౬

కం॥ మెఱసెను మెఱుములు నురుములు
మొరసెను వినువీది మబ్బు – మోపుగ వానల్
కురిసెను బైరులఁ బచ్చలు
దొరసెను బువినెల్లఁ బజలుఁ–బొందిరరుసమున్. ౮౭

సీ॥ ముసురుఁబట్టి వాన - బోరను నులివులఁ
గురియుచుంటఁ బజేల _ కును గడింది
తలఁపు బలుపులలమి _ తలకొని మఱఁడెత్తి
కొన్న విల్లు డించు _ కొనక యుండె

కం॥ మైత్రాల్పు లెంతవారికి
సీతువు మదిఁ గలచి మార్పుఁ - జేకూర్చు నటుల్
సీతను గోల్పడు రాముని
కాత్రజి జేతఁగోరు జతన _ మనుమ యొజింగెన్.

కం॥ 'హనుమంతుఁడు' 'సుగ్రీవుని'
గని 'సీత'ను వెదకు టెంతొ? కర్జమ్మని దా
నిని జేయుట కట్టడ యని
వినిచిన 'సుగ్రీవుఁ'డంత _ వినుకలి కలిమిన్.

కం॥ దవుదవ్వుఁ దలఁచి యెటుసే
యవలెనో? నెట్టనగ గూర్ప _ ననువగు వారిగ
తవతవఁ గూరిచి నేర్పున
లివఁగొని 'సుగ్రీవుఁ'డాడె _ లెస్సగు బత్తిగ.

కం॥ సీతమ్మ _ వెదకు కొఱకయి
బ్రాఁతిగఁ బన్నగడ లెన్నొ _ పన్ని యవెల్లన్
ఏ తెఱకువ నెగ్గనో? చెడు
నో? తెలియుట లరసి మివుల_నుదుకువ మెలఁగన్.

కం॥ ఇది యిటు లుండఁగ 'రాముం'
డదవదగా మదిఁ దలంచె - నా 'సుగ్రీవుం
డదిరా! నను మఱచెను - బని
తుది యగు వఱకెఱుకఁదవులు - దురు మైత్రాల్పుల్.

కం॥ పనిఁదీరిన వెనుక తలం
పును గలుగదు జెగము పజెల - పోకడ సాజం
బునగు, మఱి దిద్దుపాటును
గొనకున్నన్ బనుల వెట్లు-కొనసాగుఁ దుదిన్. ౯౪

గీ॥ తలఁచి యిటు 'కిష్కింధకుఁ' - దమ్ము నంపు
టుఱవటంచని దరిఁజేర్చి - యుగ్గడించె
నీవు మాటాడు మిట్లు 'సు - గ్రీవు తోడ
'సీత' వెదకు పనిన్ మఱ - చితి వటంచు ౯౫

కం॥ తమ్ముఁడ! 'సుగ్రీవుఁడు' మరు
నమ్ముల బారిఁ బడి చేయ - నగు పని మఱచెన్
నెమ్మది సుగమ్ముఁ గోరిన
యమ్మానిసి నడవడిక ర - వంత దలఁచునే? ౯౬

చం॥ దరమము వీడి 'వాలి' యెడఁ -
దగ ములుకుల్ తెగనాటి చంపితిన్
పరిఁగొని క్రోఁతిజేనికయి -
పంతముఁ బట్టి యతండు దానినే

మఱచెను సొంతమా పనులు -
మాటికి మాటికి నెగ్గుదాఁక దీ
వరముగఁ బాలుఁగొందు రటు -
పై మఱపొందుదు రౌర! మానిసుల్.

శా॥ 'వాలిన్' జంపిన యంపకోల పొది నా -
వద్దన్ నిగారించి కెల
గేలన్ జేరఁగ వేచి యున్నదనుమీ -
క్రేళ్ళుబ్బి మాటాడుటల్
చాలింపన్ వలెనంచు బీర మొలుకన్ -
జాటించి రమ్మాపయిన్
వాలాయమ్ముగ వచ్చి తీర్పు వివరిం -
పన్ మెచ్చి పంపించెదన్.

కం॥ అటుగాక! తటపటించుచు
మటుమాయలు పన్నె నేని - మఱి 'వాలి'ని జూ
చుటఁ బోలె నేచి వేచెదఁ
గిటుకెఱిఁగి మెలంగు మనుచుఁ - గ్రేటున ననుమీ

గీ॥ అనిన మాటలు విన్న 'లక్ష్మణుఁడు' పోయి
చేరి 'కిష్కింధ' సుగ్రీవుఁ - జేరఁజీరి
పలికె 'రాముఁడు' పలికిన - పలుకులట్ల
పుల్ల విఱుపు పలుకులను - బొనుఁగుపఱచె.

సీ॥ కొన్ని పరుసమ్ములాడి యా - కొన్న సింగ
మట్లు సింగావళిన్ జేసి - నంత 'తార'
తారి మెత్తని పలుకులఁ దాళఁ జెప్పి
యచేట జేరిగిన కష్టమ్ము - లన్నివిప్పి ౧౦౧

కం॥ కనుఱెప్ప పాటుఁ దీరికఁ
గొనక సతమ్మరసి 'సీతఁ'-గొని తెచ్చుటకై
పనిఁబూని రేఁబవళ్ళును
మనుఱేడా! పాటుఁ బడె ను - మా! కనుఁగొనుమా!

కం॥ చెల్లఁగ మెల్లఁగ నల్లిక
బిల్లిక పెల్లూఱడింపఁ బిఱుసని మది అం
పిల్లఁగ 'రాము' నిత్తోఁ దా
వెళ్ళిన పని యైనతీరు - వివరించు నెడన్ ౧౦౩

కం॥ వెనువెంటన్ 'సుగ్రీవుఁ'డు
పనిఁగొను జోదులను బిలిచి - పలు దెసలను 'సీ
త'నరయు పని నానతి నిడ
'హనుమను' నేమించి పనుల-నరయుక మీఁదన్. ౧౦౪

సీ॥ 'మాల్యవంతము' జేరి నే-మకము మీఁర
'రాము' నడుగుల కెరగి తో-రమ్ము బ్రమ్ము
ప్రక్క నిలుచుండ 'రాముండు' వలికె నిట్లు
క్రేటుఁ గొని పోటు మాట 'సు-గ్రీవు'తోడ ౧౦౫

ఉ॥ ముప్పుఁ దొలంచి రాచెలిక -
ముం గయిసేసి యెవండుఁగాని ము
న్నెప్పుడు సేయలేని పని -
నేఁడ్తెఱఁ గూర్చి సువమ్ముల బేర్చిన
న్నప్పుడె; నీమదిన్ విడిచి -
యచ్చోట ముచ్చోట అంతు సంతలో
గొప్పగఁ దాలుకోల్మనికిఁ గోల్పడి -
పాడిఁదొఱంగ నాయమే. ౧౦౬

కం॥ చేసిన మేల్ మఱచిన యో
బ్రాసి సబమ్మైన మొఱఁగు - సాగు మొకమ్ముల్
బాసటఁ బసిపట్టవు గద!
వాసిగ నిఁక నొరులఁ గూర్చి - పలుకఁగ వలెనా ౧౦౭

గీ॥ ఇంతలోఁ గన్నుఁ గప్పెనే - అంతు సుకము
దరమమును గుర్తెఱుంగు కొ-త్తరము సుమ్మ
టంచు 'రాముండు' చుఱుకు పల్కాడినంత
సూది మొనఁ గ్రుచ్చు కొన్నట్లు-సూడి యెడఁద ౧౦౮

కం॥ మఱువను, జెప్పినమాటను
దిరుగను, నాయోపినంత - దెసల మసలి యె
త్రెఱఁగునను 'సీత' పోబడి
నరయుఁగఁ బంపించినాఁడ - నండఱ బంట్లన్. ౧౦౯

కం॥ అని చాఁగిలి పడి మ్రొక్కిన
కనికరమున 'రాముఁ'డనియె - గట్టుమనికి రా
యనిఁ జూచి నేస్తమును మఱి
పును బొందితి వంచు మోము - పుల్లగిలంగన్. ౧౧౦

కం॥ పోనాడి నాఁడు మొదలుగ
నీనాఁటికి సేయు పని య - దెట్టిదొ? పలఁకుం
జేనంటె నెంత? క్రొత్తగ
మానక వినిపింపుమా! సు - మాళము వించున్. ౧౧౧

కం॥ అనవిని 'సుగ్రీవుఁడుఁ' దాఁ
బనిచితి మల్లద్రిమ్మరులను - బలుదెస లరయన్
వినిచితి నాయానతి నా
సను నూపిరి యాడుదాఁక - సామి! మఱతునే! ౧౧౨

కం॥ జగమునఁ గల మల్లద్రిమ్మరు
లెగబడి 'కిష్కింధ' జేరి - రేమన వచ్చున్
మగటిమి రూపెత్తు నటుల్
సిగఁదాలిచి జేని యాన - చెఱలాడి రిటుల్, ౧౧౩

గీ॥ 'వినతుఁడలతూర్పు' దక్కిన - మున 'హనుమ' యు
పడమర 'సుషేణుఁ' డుత్తర - కడఁ శతబలి,
గాఁగఁబడవాళ్ళఁ గూర్చి లె - క్కకును మిగిలి
వెల్లువల జేతపఱచి పం - పించె వెదుక ౧౧౪

గద్దెము - కం॥ వేవెలుఁగును శేవెలుఁగును,
నీవెలుఁగును వెలుఁగుఁ గూర్ప - నేర్పగు దానిన్
లోవెలుఁగని వాకొందురు
నీవెలుఁగున్ దుదిమొదల్ మనికిఁ గల పెద్దల్. ౧౧౫

# రామకథ

## ( అయిదవపాలు సుందరకాండము )

కం॥ సత్తెమ్ము కన్న వేఱొక
యెత్తరమగు దరమమున్న – యెడ నది నీదా
సత్తని తక్కిన దంతయు
నత్తది యని నమ్మి బ్రదుకు _ టొప్పగు సామీ

కం॥ ‘హనుమ’యు మలద్రిమ్మరులును
జెని చేని పొడగనిరి _ పెద్ద _ చెట్టు ‘మహేంద్రం’
బను దానిఁ బూని నలుదెస
లను వెదకిరి ‘సీత’ కొఱకు _ లావరు లగుచున్. ౨

గీ॥ ‘రావణుఁడు’ ‘సీత’ నుం గొని _ పోవు మాట
మును ‘జటాయువు’ తనతోడ _ ననుట వలన
‘రాము’ఁడాదట ముద్దుటుం _ గ్రమ్ముఁ గూర్మి
‘హనుమ’ చేతి కేదో చెప్పి _ యంది యిచ్చె

కం॥ నలుదెసలఁ గ్రొమ్మద్రిమ్మరు
లలవునఁ జెలమూని తిరిగి _ రడవులు గవులున్
మల లేర్లు సీటికుప్పలు
వెలలఁగ పీల్గానిచోట్ల _ వెదకిరి మివులన్. ౪

చం॥ అవియివి యంచుఁ బేరుకొన -
నౌ న! జగమ్ము నగల్లు నెల్లచో
ట్ల వెదలి చొచ్చి చూచి యెచ -
టం బొడఁ గానక పట్టుఁబట్టి క్రొం
బువులను దేనె కోసమయి -
పోయెడి తుమ్మెదలట్లు వేసటం
దవులక త్రిప్పలంబడిరి -
తప్పక 'సీత'ను గాంచు నాసమై ౫

కం॥ తక్కిన మూఁడు దెసల్ సను
నక్కోఁతులు నూరు నాడు నరసి యరసి యే
దిక్కున 'సీతం' గానక -
కక్కటిలిన్ దిరిగి తిరిగి - కడు బడలి రహా! ౬

కం॥ దక్కినమును 'హనుమంతుఁడు
ద్రొక్కి సరాసరి చెలంగు - త్రోవలు డొంకల్
పక్కణములుఁ బల్లెలుఁ బలు
చెక్కియలం బొలు నేర్లు - సంద్రమ్ములునున్. ౭

కం॥ సందులు గొందులు బావులుఁ
బొందామర కొలను లూరి - ముందఱ తోటల్
బందిగము లడ్డములుఁ జూ
పందిన యెడ 'సీతఁ' గాన - కసురుసురగుచున్. ౮

చం॥ కుడిదెస సంద్రముం గదిసి -
కొందఱ క్రోఁతుల మూఁక_తోడ మే,
వడిఁగల వారు చేరి తెగు -
వన్ దరిదాపుల దాటవచ్చు నం
చుడిగము విల్వ యిట్టిదని -
యొప్పుగఁ జెప్పుచు నొండొరుల్ గదుర్
గడు బలిమిన్ గడించుచుఁ జె -
కా పికి దాలుఁగ హెచ్చరించుచున్. ౯

కం॥ బరవసము కొలఁదు లెఱుఁగమి
తఱుల మొగము మొకములన్ని_తడబాటున నొం
డొరుల పెను సందియమ్ములఁ
గొఱ తెలివిన్ బయట పెట్టు_కొను చుండిరటన్. ౧౦

గీ॥ ముదుకఁడగు 'జాంబవంతుఁడు' - మొదలగు మల
ద్రిమ్మరులు 'హనుమంతునిఁ' దెగఁ బొగడిరి
సందరము దాటు మొనగాఁడు - జాణకాఁడు
వీఁడొకండని పలుమారు - బిరుదులాడి. ౧౧

కం॥ కొండాడిన 'హనుమంతుఁడు'
గండు మగంటిమిని దాటఁ - గలనని యెదలో
నుండెడి సంతస ముబ్బఁగ
నిండారిన గెండకమ్ము - నివ్వటిలంగన్. ౧౨

కం॥ తక్కిన తఱుల మొకమ్ములుఁ
దక్కొన లేకునికి నింకఁ - దానయినను గా
ద్రొక్కి నిలుచుటయె మేలని
పెక్కువ బరవసపు 'హనుమ'-వేగిర పడుచున్. ౧౩

ఉ॥ ముందల సంద్రముం గడవఁ -
బూని తలన్ బయికెత్తి తోఁక మి
న్నందఁగఁ గానువంచి కొస -
యావి బిగించి తలంపుఁ బెంచి మో
విం దెలిపఁడ్లు గీఁటి తెలివిన్
గనుచూపుల కోరగించి యొ
య్యం దొడఁ దట్టి హుమ్మనుచు -
నట్లిగిరెన్ గొస కాలి బిట్టునన్. ౧౪

కం॥ అరరే! యని, సరి! సరి! యని,
యరిది మెయిన్ జూచి క్రోఁతు - లన్ని మెలర్పన్
బిరుదు మగఁ 'డనుమ' యెటు సం
దరముఁ దరిఁ జేరుతలఁపు - దండడిలంగన్. ౧౫

గీ॥ అద్దుఁ దగిలెను మైనాక - మనెడి గుట్ట
'హనుమ' కొక్కింత యాటట - యగుట కొఱకుఁ,
గాని యది రక్కసపుఁ జెయ్వు - లే నటంచుఁ
బరువడిన్ దాటి పో నెంచు - పరువ మందు. ౧౬

గీ॥ 'రాము' కర్జమ్ముఁ గూర్ప నే - ర్పరివి నీకు
మేలు సేయఁగ నుడుకువఁ - దాలు కొఱకు
వచ్చితిని కాలు మోపి నా - యిచ్చ విందు
పుచ్చుకొని పొమ్ము నీవార - ముగద! యనిన ౧

గీ॥ బంటుపని కుంటువడ దోసఁ - గంటు ననుచు
నెమ్మదిని నమ్మి యడుగాని - నేస్తమూని
యుబుసు పోకకుఁ దడవోర్చి - యున్నయట్లె
సెలవుఁగొని పయనించె న - చ్చెరువుఁ దోఁప. ౧౮

కం॥ తోలుదోలుత యున్న రూపును
గలిగియు మఱి పోను తేలి - కగ నలకనయై
వెలలి తుదిఁ గంటికగపడ
వలను పడని 'హనుమ' యెట్లు? పఱచెనొ! యేమో?

కం॥ అలలెగసి యుప్పరము పయి
నలముఁగ నుర్వ్వ గమి విరిసి - యలఁతి యలఁతియై
వెలలఁగ నెడ నెడఁగడు విం
తలఁ గనుచున్ సంతసమ్మునన్ జేనుదేరన్. ౨౦

కం॥ 'సురస' యను పేర వేల్పుల
తరపున నసర యయి వచ్చి - తాఁకినఁ గడఁకన్
బరిగొని యాఁకలిఁ దీర్పుమ
పరువడి యని యాఁకపెట్టె - బలిమిన్ బులుమన్. ౨౧

గీ॥ ఒండొరులు నెమ్మెయిం బెంచి - యొకనిమించి
యింకొకరు పోల నలఁతి మె - యిం గుదించి
దాని మేనను జొరఁబాఱి - దాటి పోయి
ఆఁకలిని దీరెనే? యని - 'హనుమ' యడుగ ౨౨

కం॥ నీసత్తి నెఱుఁగ వేల్పులు
వేసముఁ గైసేని యిట్లు - వెలువఱచిరి సం
తోసం బాయెను నీపని
వీసము వెలిపోక నెగ్గి - విప్పారుఁ గదా! ౨౩

కం॥ అని పలికి పాఁప పడఁతుక -
చేనె నావల వేగిరమున - సంబర మెదఁ బొం
గిన వాఁడయి కడలిని జే
య్యాన దాటెన్ బిక్క - బలిమి-యదిరా? యనఁగన్.

కం॥ 'లంక'యను నగర మెదురయి
కింకన్ 'హనుమంతుఁ' జూచి - క్రేటుంగొని నీ
వింక నెటకేగెదవు? నా
వంకన్ బడి చావు మనుచు-బమ్మయె వ్రాసెన్. ౨౫

కం॥ అనినన్ గింకిరిపాటుం
గొని 'హనుమ' యటెని నీకుఁ - గూడ యదే వ్రాఁ
త నిబద్ధి యనుచుఁ దలఁపుమ,
యనుచును గుప్పించి క్రింది - కటు త్రోపాడెన్. ౨౬

మ॥ వెనువెంటన్ బిడికింట నొమ్మదిమి నో –
ర్వాంటన్ బయల్దేర నె
త్రును బ్రేవుల్ గడికండలున్ జెమరి త్రో –
డ్రోఁ జంద్రనిప్పుల్ కనుం
గొనలన్ రాలఁగఁ జూచి దాని యుసురుల్ –
గోల్పోవ బంగారుగ
ట్టును సుత్తెం దెగఁగొట్టు నట్లడఁచి మ –
ట్టుం బెట్టి పో నంతటన్.

శా॥ లంకన్ జొచ్చి కడాని కట్టడము లు –
ల్లంబుబ్బ మేల్మచ్చు లే
వంకం జూచినఁ బైడి వెండి రతనా –
ల్పట్టుల్ జెగా మేడలం
దింకం జూడఁగలట్టి వెన్నొ? కలవా –
యీ తావులన్ గాంచె నో
ర్వాంకంబోలె సలించి మించి తిరిగెన్ –
బల్సుందియం బందుచున్.

గీ॥ ఊర నగరున సీతమ్మ – యునికిఁ గాన
రామి నంచల పంచేల – బూములెల్ల
వెదుకవలె నని తలపోసి – వెడలఁ బాఱఁ
గాలుఁగాలిన పిల్లినిఁ – బోలె 'హనుమ'

ఉ॥ ఇంతకు వచ్చి, వచ్చినటులే
వెనుపాటున వెన్కఁ ద్రొక్కుటల్
సంతరిలంగ లాభమె, ది –
సంతగుఁ గాదె! యలంతి పేరుఁ దా
నంతట వచ్చు నెమ్మది న –
నారిల నేమి గొనమ్ము క్రొఁతితే
డెంత చిరాకు రోకుపడు –
నింకెటు 'రాముఁడు' సేగిఁ బొందునో ౩౦

చం॥ మగఁటిమి జాటి సందరమ –
మాంతము దాటి యసమ్ము లేదు పో
ల్పుగ నిటవచ్చు కారియముఁ –
బూనిక చేయక యేమిచేసిన
ట్లగపడు నేమిచేయుదును –
అక్కట! దేవర సాయముండమిన్
దిగులున గ్రుస్సి పోవలసెఁ –
దీర్చెడి యోర్చెడి వారు లేరిటన్. ౩౧

కం॥ 'సీత'ను గనుఁగొన కేగిన
నాతఁడె నుసురూడ్చు 'రాముఁ' డదిగని తేడున్
బ్రాతియె? పానము విడచుట
నాతల, నాబ్రదుక దెల్ల – నడవిఁ బువులగున్. ౩౨

కం॥ అని యిటు లెంచుచుఁ దటపటఁ
జేనఁ బూవుందోట నడుమ - చేప్పఁగఁ పున్ ముం
మన సోగను బ్రమాన్మొదలున,
గనఁబడె 'సీతమ్మ' పులుల - కడ జింకవలెన్. 33

సీ॥ వానలేమిని వాడి వత్తులై గాలికిఁ -
దూగాడు నేలకి - తీగ బాగు
కసవేని నలఁతిఁ జి - క్కక వసివాడి
నిఁవ్వెఁఅదోచు లేజింక - పిల్ల వోలె
గడుసరి వడగాడ్పుఁ - దోడరఁ జిందర
వందఁరై వన్నె చెడు నంటి-మోవు శేవఁ
బగవానిచేఁ జిక్కి - బందిగమున ద్రోక్కఁ
బడు నట్టి మరుఁబోని - యొడయని వలె

గీ॥ విన్నవై గోముజాతి వెల్వెల్లఁబాఱి
యందముడివోయి డెంద మెం - త్రైన డింది
వన్నె చెడి దిక్కు లేక లే - బరము సోఁకి
వెఱపునన్ 'సీత' యందుండి - వేఁగుచుండె 34

కం॥ నిగురుం గప్పిన నిప్పటు
మొగులున దేవెలుఁగు పగిది - బురదను రతనం
బుఁగలట్టులు మంచును పడి
సొగసెడలిన తమ్మివోలెఁ - జూపట్టుటచే 35

గీ॥ పట్టరానంత వగపుఁజే - పట్టి రాచె
పట్టి కిట్టులు సెట్టలుఁ - దొట్టెఁగద ! య
టంచుఁ దానా 'యసోగము' - నందు నెక్కి
బిట్టు వగచుచు నుండె అంపిల్లుమదిని 3౬

కం॥ ఎత్తటి నేరికి నెచ్చట
నెత్తెఱుఁగున జేరుగ వలెనో ? యెవరెఱుఁగుదురీ
సత్తోక దేవర యెఱుఁగును
నిత్తటి 'సీతఁ' బడు నిడుమ - నెఱుఁగం దరమే ? 3౭

కం॥ తానిటు లుండఁగ నసవిలు
కాని కలువ పూలకోరి - గాడి మదిన్ ని
ల్వానమి బలు వలపు విస
ముప్పానుట 'రావణుఁడు' వచ్చె - నా రామునకున్. 3౮

సీ॥ నిక్కు చెన్దోయితో - టెక్కులాడి యొకర్తు
యడుగులో వెలిపట్టు - గొడుగుఁ బట్ట !
గాజుల యులివులు - గలుగల్లు మని మ్రోయ
సొగసరి యొకతె వీ - చోపు లిడఁగ
మదికింపు నింపు పె - ల్లిదమైన బరతమ్ము
చెలువ యొకర్తుక - చేయుచుండ
కమ్మ తెమ్మెరలు సోఁ - కఁగ నొక్క వగలాడి
వట్టివేర్వీవనఁ బట్టి విసరఁ

గీ॥ దమ్ములప్పుఁ జిల్క లొకతె వా - దరికిఁ జేర్ప
నుల్లమిగురొత్తఁ బన్నీరుఁ - జల్లె నొకతె
చెలులు ముందు బరాబరుల్ - సేయనంత
వలపు దొరతనమెచ్చ, 'రా - వణుఁడు' వచ్చె ౩౯

కం॥ అనరాని మాటలును జూ
డని చూపులుఁ దలఁపరాని - టకటొంకులు మా
యని మచ్చఁ గూర్చు చేఁతలు
మునుకొని 'రావణుఁడు'-సీత బ్రోలఁ బొనర్చెన్. ౪౦

గీ॥ 'రాము' నిల్లాలికీ తల - వ్రాఁతయేమి?
మోఁజకుని చేత సడిఁబడి - తీరవలసెఁ
దొల్లి చేసిన దోసంపుఁ - దొడుసు గడుసు
తప్పి చేనదెట్టి వారుఁ బొం - దవలెఁ దుదకు ౪౧

కం॥ తనలోఁ దాఁ దలపోయుచు
'హనుమ' యసోగంపు గుబురు - నందా యసరన్
గనుఁగొని మిన్నక నొకకొ
మ్మను మెయి వ్రాలిచి కడింది - మది దరికొనఁగన్.

గీ॥ అంత 'సీతమ్మ' తలవ్రాల్చి - యవుడుఁ గఱచి
కన్నుఁ గవ నీరు కాలువల్ - గట్టఁ బనవి
మట్టసమ్ముగఁ గూర్చుండి - మదిని 'రాము'
నెంచుచున్ 'రావణు'ని తోడ - నిట్టులనియె! ౪౩

శా॥ ఓరీ! రావణ! యేల ప్రేలెదవు మై -
యున్నంత నిత్తెమ్మె వే
సారుల్ పుట్టుచు గిట్టుచుండు నిదియే -
చాలా తిరమ్మంచుఁ బొ
ల్వారున్ సంతసమంచు మోఱకులు డా -
యం జూతురీ మైనుగం
బారా! నిత్తెమె? సత్తెమే! యెఱుఁగుమా -
వంతైన విన్నాణివై ౪౪

కం॥ నోరుఁ గలదంచు వాగెద
వూంక జేగమేమి తలఁచు - నో! యెఱుఁగమిచే
బేంజూఁడ వంచు నెంచును
వారక నీ తెలివి మన్ను - పాలయినదొకో? ౪౫

కం॥ 'రాముఁ'డన గడ్డిపోచఁగ
నీమది నెంచెదవె! యసర! - నిక్కమ్ముగ, జే
జే మొదటి దేవరగ మది
నేమకమున నెంచి కొలువ - నెగడు జేగమ్ముల్. ౪౬

గీ॥ కాయ గసురులు దినువాఁడుఁ - గానఁదిరుగు
వాఁడు నొక మానిసియటంచు - వలదు తలఁప
ముజ్జేగమ్ములఁ బుట్టించి - బొజ్జఁ బెంచు
నట్టి యీసరుఁడని నమ్ము - టంత మేలు ౪౭

కం॥ నానీడ నన్ను విడువని
పోణిమి నే'రాము' వీడి - పోదునె యిదియుం
గానని మోఱక! యింక నిపు
డేనియు నెఱుఁగంగఁ దగుసు-మీ! యెట్లైనన్. ౮౮

గీ॥ అకట! ననుఁబోలె నిఁక నెంద - ఆంధ్ర కెసరు
పెట్టితివా! వారి గోడు నిన్ - గట్టి కుడుపు
నిదియ నీపుట్టువునకుఁ బె - ల్లిదపుఁ దండి
నీరు గాలి మఱొండుఁ గ - న్పింప దింత ౮౯

గీ॥ అలతి వలపును గెలువలే - కన్నిజేగము
లేను గెలిచితి నని బింక - మూనదేల!
తెలివిఁ గల పెద్దవారల - వలనఁ దెలిసి
బ్రదుకు మిఁకనైన మఱి-బాగు - పడెద వనియు ౯౦

కం॥ గరుటామంతుఁడు నాగులఁ
బారిగొని కేలుపులబోన - మును గొనునటు న
న్నురవడిఁ గొను 'రాముఁడు' నిఁక
బరిమార్చున్ నిక్క మెఱుఁగ-వలె నికనైనన్. ౯౧

చం॥ వలపను కన్నుఁగుట్టి పరు -
వంబను గ్రుడ్డితనానఁ జూపుకో
పులుఁ జెడ నీజగంబెఱుక -
పోవిడి చెన్నటులై మెలంగ నీ

కలమిన మేలదేమి ? యస- -
మా ! విడుఁబున్నెము సున్నయామదిన్
గలుచేతనమ్ము నెత్తిపయి -
గంతులు పెట్టును బుట్టువే చెడున్. ౧౨

ఉ॥ నీవొక గడ్డిపోచవని -
నెమ్మది నమ్మెద నొడ్ల చేడెలన్.
గావర మొత్తి యెత్తుకొని -
గండడఁగం గలవాఁడ వెంతయున్
వావిరి పేరు ప్రెంపు సెడి -
పందవలెన్ బ్రదుకీద్వ లాబమే
రావణ ! యింకనేన్ వదల -
రా ! యిటువంటి చెనంటి చెయ్యులన్. ౧౩

కం॥ నీవొక పిడికెఁడు బూడిద
యై వేఁడినఁగాని నిన్ను - నరయుదునే ? నేఁ
జావయినఁ గోరుదును గా
నీ ! వెడఁగా ! యద్దుగు మట్టి-యేన్ జిక్కు-నొకో ? ౧౪

కం॥ పలుగాకి కూఁతలని యీ
కలగుండున్ గట్టి కుదుపఁ - గా మేలే ! మేల్
దలఁపుమ ! చెడు చెద్దమ్ములు
నిలుపుమ ! పున్నెమ్ముఁ బ్రమ్ము - నిజమిది యసరా !

గీ॥ బ్రదుకఁ దలఁచితివేని నీ - పాడుపనులఁ
గట్టిపెట్టి సరాసరి - పట్టుకొనుము
'రాము' నడుగుల నన్నిడి - యోము మనుము
కనికరము నీరువామి - నిక్కంపు సామి ! ౫౬

కం॥ అని తిరుగు పాటొనర్చుచు
నిను స్థాపించెదను గాని - నేఁడో ! తేపో ?
యనిఁ దాటిపండ్లు రాల్చిన
యనువునఁ బది తలలు డుల్చ - నననేల నిఁకన్. ౫౭

కం॥ అనుటయు తడవుగ రోసముఁ
బెనఁగొనఁ జికటారిఁ దీసి - బిరబిరఁ జేని నిక
దునిమెద నన నీ లోపల
మనవిని వినుఁడనుచు 'ధాన్య - మాలిని' వేఁడెన్. ౫౮

కం॥ నీ సొగసు నీచొకాటము
నీసోయగ మందమెంచి - నీఅంతు సుగం
బాసించి యెందఱో ! గల
రీసకితోఁ బోరదేల ? - యిఁక విడువుమయా ! ౫౯

కం॥ ఆమాటల మది నుబ్బుటఁ
దామఱలెన్ బొలసుదిండి - తక్కిన యసరల్
బ్రాముకొని చుట్టు నుండఁగ
బూమెలు పల్కాడి రలఁతి - బోదన లొలయన్. ౬౦

ఉ॥ అంతట 'సీత' 'రాముఁ' గొని –
యాడుఁచు నింతకుఁ రాడె యివ్విథం
బంత నెఱింగి పెన్వెతల –
నందియె కేనియు సంభ్రమీంది పె
న్వంతల పాలునై యిటకు –
వచ్చి యసిన్ దెగటార్చి 'రావణుణ్'
పొంతము తోడ నన్నుఁ గొని –
పోడె యయోధ్య కటంచు నెంచుచున్. ౬౧

గీ॥ ఇంతలో నొక్క వింత వి – న్పించెఁ 'ద్రిజట'
నాఁటి రేయిని గలను గా – నంగఁ బడియెఁ,
గళుకుఁ దమ్ముల నేలిన – కనుల వాఁడుఁ
గలువ పువ్వు తోరనముల చూ – పులుఁ గలాఁడు. ౬౨

గీ॥ కనికరపు జెల్లు తొలకరి – గలుగువాఁడు
చెందురునిఁ బోలు మోము ప – సందువాఁడు
వానకారు మొయిల్ బోని – మేని వాఁడు
పొడవు చేతుల వాఁడు రా – ముఁడనువాఁడు ౬౩

కం॥ కానఁబడి మంది దండడి
తో నీర్వామిఁ గడదాటి – తొందర లంకన్
బోనడఁచి చాలుకుత్తుక
వానిఁ దునుమాడి – 'సీత' వడిఁ గొనిపోయెన్. ౬౪

గీ॥ అమ్మ ! సీతమ్మ ! నీమగఁ - డడుగో ! వచ్చి
లంక నీటార్చి 'రావణు' - బింకమడఁచి
నిన్నుఁ గొనిపోవు, నీమాట - నిక్కమన్న
మ్రానిపై నున్న 'హనుమ' నెమ్మదిగ దిగియె, ౬౫

గీ॥ 'సీత' కును మ్రొక్కి రక్కెస - చేఁత లివ్వి
యంచు వంచేనమై వచ్చె - నంచు నెంచి
నమ్మకుండిన 'హనుమ' సీతమ్మతోడ
నానవాల్ సెప్పెదను విను - మంచుఁ బలికె ౬౬

సీ॥ అమ్మ ! రాముఁడు జింక - కై పోవ 'లక్ష్మణా !
యన నటనుండి ప - ద్యానను నాకు
టిలుఁజొచ్చి యటలేమి - నలజడి నడవులఁ
దెం దేఁప లటనటఁ - దిరిగి తిరిగి
ఋశ్యమూకముఁ జేరి - యావట విడిచిన
కొంగున గట్టు సొ - మ్ముంగడించి
నలువలంకులను క్రో - తుల వెల్లువలఁ బంపి,
నాచేత ముద్దుటుం - గ్రమ్ము నిచ్చె

గీ॥ నిదిగో ! యని వంగి చేతికం - దించి నంత
మాయదారుల మాట నమ్మకము లేక,
ఔదలను వంచి 'హనుమ'తో - ననియె నిట్టు
లొకటి యడిగెద బదులిమ్ము - యున్న పగిది ౬౭

కం॥ నా 'రాముఁ' డెట్టిఁడో! యే
తీరునుగలవాఁడో! సౌరు - తెఱఁగెట్టిదియో?
పేరిన గానమ్ము లెట్టివో!
యారయ 'లక్ష్మణు'ని సొబగు-లవి యెట్టివియో? ౧౮

కం॥ అనియడిగిన 'సీతకు' న
ల్లనివాఁడున్ బొడుగు చేతు-లాడున్ సొగసుం
దనముం గలవాఁడున్ గనుడో
యని దమ్ముల విరియు వాఁడి- కేమని పొగడన్. ౧౯

సీ॥ నీలి మబ్బుల డాలు - గోలుపుచ్చెఁగ జాలు
నిగ నిగ మెఱయు మై జిగిఁ గలాఁడుఁ
గనికరపుం జాలు - కఱవుఁ దీరిచి యేలు
తొవల నేలెడి కన్ను - దోయి వాఁడుఁ
బున్నమ చెందురుఁ - బురుణించు నెమ్మొగము
చిఱు నవ్వు వెన్నెలల్ - జిలుకు వాఁడు
నండఁ జేరిన వారి యక్కఱఁ దీర్చి సం
తసముఁ గూర్చెఁగ విల్లుఁ దాల్చు వాఁడు.

గీ॥ రక్కసుల నుక్కడంపఁ బేర్గన్నవాఁడు
బీదసాదల నేలి ఱం - పిల్లువాఁడు
చూచినంత నె! ముగిలి కా - ణాచికాండు
వేల్పులును మ్రొక్కఁదగిన పేర్వెలుఁగు వాఁడు. ౨౦

కం॥ బంగారు మిసిమి దిగదీ
యం గల మైచాయవాఁడు నన్నుయుడిగ మే,
పొంగారు మదిఁ గలాఁడున్
వెంగట 'లక్ష్మణుఁడు' రాము – నిం గనువాఁడున్. ౨౧

చం॥ 'అనుమను' నమ్మి 'రాము' నడి –
యాలము గుర్తెఱిఁగింప విన్కి మై
కనుకని యుంగ్రముం గని చొ –
కాటపుఁ దీపి తలంపు లెన్నియో
మునుకొని నెమ్మదిం బఱవ –
మోడుపుఁ గేలమరించి మ్రొక్కి దా
నిని బదిలించి ముద్దుఁ గొని –
నిక్కపుఁ బ్రేముడి నిట్లు వాకొనెన్ ౨౨

ఆ॥ వె॥ పెండ్లి నాఁడు కలిపి – విడిపోయి యీనాఁడు
మఱలఁ గలిపి బయలు – మెఱసి తరరె!
యెటుల నప్పుఁ దీర్తు – నియ్యెడ! నాముద్ద
టంచుఁ దీసి కనుల – కద్దుకొనియె ౨౩

గీ॥ అవల 'హనుమ'ను జూచి నీ – యంతవాఁడు
లేడు నీబాకిఁ దీర్పఁగా – లేను, నేను
'రాముఁ' డెప్పుడు వచ్చి పో – రామిఁ దీర్చు
నంచుఁ బలుమాఱు నడుగు 'సీతమ్మ'తోడ ౨౪

కం॥ అమ్మా! నీసెలవును గొని
క్రమ్మఱుమను 'రాముఁ' జేరఁగా నీసుద్దిన్
బిమ్మటమనవిని జేసెదఁ
బ్రమ్మిన పెనుబత్తిఁ దనర - 'రాము'ని తోడన్. ౨౪

ఉ॥ తీవర పాటుతో బయలు -
దేరి నినుం గొనివచ్చు మ్రుచ్చునున్
గావర మూచముట్టుగ న -
ణంచి నినున్ గొని పోఁగలందు సు
గ్రీవుఁడు గట్టి పట్టు దలఁ -
గీల్కొనె సందియ మింత లేదు నా
కేవిత మానవాలొకటి -
యిమ్మనఁ బ్రమ్మిన సంతసమ్మునన్. ౨౫

కం॥ తలమానిక మొసఁగుచు నా
తల రాముని యడుగు దమ్ముఁదవులుకొనన్ మ్రొ
క్కులు సెల్లించితి ననుమీ
వలఁ జెఱఁబడు వక్కిఁ జూడవలదా! యనుమా! ౨౬

గీ॥ 'లక్ష్మణు'నిఁ బలుమారు త - లంచి తెలియ
కాడినందుకుఁ బ్రాఁచితి - మందె ననుము
దానిఁ దలఁపక కాపాడఁ - దగు నటంచు
మఱి మఱియుఁ బల్కుమన్న ల - క్ష్మణుని తోడ ౨౭

మ॥ అనినన్ 'సీతకు' వంగి కేల్మోడుపు లె-
న్నైనన్ బురాయించి దీ
వనలందిమ్మని వేఁడి వీడుకొని పో-
వన్ ద్రోవలో హాసుతో
టను బన్నం బొనరింప రక్కసులు వెం-
టన్ వచ్చినన్ 'జంబుమా
లిని బోరన్ దునుమాడి 'యక్షయు'ని బ-
ల్మిం ద్రుంచి మొండొడ్డినన్. ౭౯

ఉ॥ అంత 'బ్రహాస్త్రఁ' డడ్డి యిటు-
లారడి చెయ్యాల నాటతోట యం
దంతటఁ బాడుచేసితివి-
యద్దిర ! నిన్నవఁడంపెఁ జేఁతలి
ట్లింతయుఁ జేయ నెవ్వఁడవొ !
యెట్లిటువచ్చితో ? యేరిబంటవో !
యింత నెఱుంగఁ గోర్కెఁ గల-
దిద్ది నిబద్ధిగఁజెప్పుమా ? బదుల్ ౮౦

గీ॥ 'హనుమ' యందురు పేరు 'రాము'నికి లెంక
గాలిచూలిని 'సీత' నక్కఱ కొలంది
వెదుక వచ్చితి నీకఁ జెద - గోదలుఁ బోదలు
లంకకును జేసికిద్ది వాలకమె. యనిన ౮౧

గీ॥ వీనిఁ మనతేని కడ నిలఁ - బెట్టు మనుచుఁ
బలికినఁ బ్రహస్తునకు బదుల్ _ వలుకకప్పుడ
తోడుకొని పోయి 'హనుమను' _ దొర, కనుఁగొని
చింత నిప్పు కనుల్ దెఱ _ చి యిటులనియె _ ౮౨

గీ॥ కోఁతిగా! యెవ్వఁడంపె నీ_కు దొర యెవఁడు?
యేమి పని కయి వచ్చితి; వేమి నెగ్గె?
నిన్నిపుడ చంప నీకు ది - క్కున్నదటర!
యొడలు కాపాడు కొనుమని _ యుఱిమి చూడ ౮౩

కం॥ నావిని గాలి కొమారుఁడు,
రావణ! నా పేరు _ 'హనుమ' రాముని బంటన్
నీ వివర మెఱుఁగ వచ్చితిఁ
గావలమును వీడి యింక _ గద్దియ దిగరా! ౮౪

సీ॥ మూఁడూళ్ళ నొకసారి _ ముమ్మరమ్ముగఁ గాల్చు
వినువాఁక మోపరి _ విల్లుఁద్రుంచెఁ
దొకనిఁ జుట్టి య _ ట్టాఁకఁ బెట్టిన 'వాలి'
నొక కోలతో వేసి _ యుక్కడంచె
ముయ్యేడు తేడులఁ - బుట మార్చు 'పరశురా
ముని గరువమ్మెల్లఁ _ బోనడంచె
'ఖరుఁడు' 'దూషణుఁడు' నీ_కయి పోరఁ బదునాల్గు
వేవురఁ జిటికలోఁ బీచమడఁచె

గీ॥ పిన్నతనమునఁ దబిసుల - జెన్నుమోమెఁ
దండ్రి యానతి నడవుల - దారిఁ బట్టి
నీవ కాదెల జగము లే-నియును నిలువ
నోటమిని లేని 'రాము'ని - దీటుఁ గలరె! ౧౫

గీ॥ నట్టడవి నొంటిదగు రాచె - పట్టి 'సీత'
దొద్ద సన్యాసి వేసాన - దొంగలించి
తెచ్చితివి మగతనమ్ములం - తియును లేక
దొంగ చాటు తనమ్మెంత - దోసమనిన ! ౧౬

చం॥ కనకన నిప్పురవ్వ లొలు -
కన్ కనుదోయిని బాఱఁ జూచి మం
కును టకటొంకు బొంకరిని -
క్రోఁతికిఁ దోకకు నూనె గుడ్డలన్
బెనిచి రగిల్చి పంపుఁడిఁక -
వేల్పులు గిల్పులుఁ బ్రోతురేమొ? యీ
తనిఁ గనుఁగొండటంచును, బ -
దాబదగా ముదలించి నంతటన్. ౧౭

చం॥ 'హనుమ'ని తోక యన్నటుల -
హన్మనితోకకు బట్ట చుట్టి ని
ప్పును రగిలించి నూనె యిడి -
ముక్కిడి రక్కసు లంత వీదులన్

గన్నుఁగొను దారి యియ్యఁదని -
కాలిన తోఁక నడింటి చూఱులో
గొనకొని ద్రిప్పి కప్పుచు ర -
గుల్కొనఁ జేసెను సందు గొందులున్. ౮౮

చం॥ అది! యిది! యంచుఁ బల్కు నగు -
నా! తగునా! నగరుల్ బదిం
బదిగను నూఱు నంతయును -
బగ్గము పాడొనరించి యెందు బె
ట్టిదమగు బూది కుప్పలుఁ బె -
ఠీల్మని ఊల్వగులంగ నివ్వెఱన్
గదురఁగ నెందుఁ గన్గొనినఁ -
గాల్పుల యేడ్పులుఁ గూడినంతటన్ ౮౯

చం॥ వెనుకకు వచ్చి యక్కడలి -
విన్నపముం బొనరించి 'రాము' హా
జ్ఞను దయివార మ్రొక్కి తను -
సల్పిన కారియమున్ దలంచి ఉ
వ్వనఁ జేను దెంచె నుర్వ్యాడిని -
బోవు దుమారము తీరు యుప్పర
మ్మునన 'హనుమంతుఁ' డాతనికి -
మోడ్పుకయిర్ జేతఁ గూర్చి రందఱున్. ౯౦

గీ॥ 'జాంబవంతుఁడు' మొదలగు - సకులు క్రోఁతు
లెల్ల 'మధువన' మును జేరి - కొల్లఁగొట్టి
తనివిఁ దీరంగఁ బండ్లెల్లఁ - దిని యుదుటున
నల్లనల్లనఁ 'గిష్కింధ' - కరిగి రంత ౬౧

కం॥ అందఱు నొకచో గుంపుగ
సందర ముప్పొంగు మాడ్కి - జేతపడి డెందం
బందున సంతస మిబ్బడిఁ
బొందుచు నా 'రాముఁ' జూడఁ-బోయిరి బత్తిన్. ౬౨

గద్దెము - ఆ॥ వె॥ అలఁతి వెలితి లేక - యంతట నీవయి
వెలుఁగులకును వెలుఁగుఁ - గలుగఁ జేసి
ముగితి కొఱకు బూత - ముల బొమ్మలాడింతు
వాటకాని సాటి - పూటకాపు. ౬౩



# రామకత

ఆఱవపాలు

## ( యుద్ధకాండము ) 1-వ భాగము.

కం॥ నీవున్నావని లేవని
యేవో ? సందియము లెన్నియేఁ గలిగి జగం
బావిలపాటున గోల్పడె
దేవర ! నీయునికదెట్లు ! డెలియఁగ వలెనో ? ౧

కం॥ 'సీతఁ'గల దచట 'లంకను'
బూతమ్ముల నడుమ వేల్పు - బోటి వలెఁ సం
గాతపుఁ దలమూనిక మిది
గో ! తెచ్చితి నాస నావి - కొఱకొఱ నుండెన్. ౨

కం॥ తిండిని నీరును నిద్దుర
నొండెఱుఁగక 'రామ'యనుచు - నును రోముకొనెన్
మొండి బ్రదుకీడ్చి యసరల
గండారులఁ బులుల లేడి - కైవడి నలఁగెఁ. 3

కం॥ ఇఁక కొన్ని గడెలు నినుఁ జూ
డక యునికిన్ బానముండు - టయ ! యరిది కటా !
ఒక కొన్ని నిముసములు ద
ప్పక పోవక మసల నేమి ? - పాటిలునో కదా ! ౪

కం॥ అనఁ దలమానికముం గై
కొని కనఁబడె నెన్నినాళ్ళ - కో! చెలి, నేఁజే
సిన దోసమేమి ? కంటికిఁ
గనఁబడ విన్నాళ్ళు నేఁడుఁ గనఁ బడితెటులో ౫

కం॥ పెను తలఁపు వెంటఁ దలఁపె
చ్చిన ముచ్చిరు రాముఁజూచి - చెడు తటి పోయెఁ,
గనుక నిఁక వగవఁ దగదని
మనవిని బొనరించి రచేటి - మంతిరులెల్లన్. ౬

కం॥ 'హనుమంతుఁ' డెల్ల కతలను
వినిచిన 'రాముం' డెలర్చి - వెంబడి వగపుం
గొనఁ బిమ్మట 'సుగ్రీవుఁడు'
కనుఁగొని యూరార్పఁ జాలి - కడ కిట్లనియెన్. ౭

కం॥ 'హనుమంతుఁ' డెంత వాఁడని
కొనియాడుదు నితఁడు సేయు - గొప్పగు మేల్ సె
ప్పనగునె ? సంద్రము దాటిన
మొనగాఁడితఁ డొకఁడుఁ దప్ప - బువినిం గలఁడే? ౮

గీ॥ ఇతఁడు నమ్మిన బంటు నా - కెంతయేని
నయిన దయినది యిఁక లంక - కరిగి 'సీతఁ'
దెచ్చుకొను టొప్పటంచుఁ దా - తీవరించి
జంపు తన మేలటంచు హెచ్చరిక సేయ. ౯

మ॥ అనినన్ 'రాము'ని తీవరంపు నుడి బి-
ట్టాలించి 'సుగ్రీవుఁ' డి
ట్లనియెన్ దేవర యాన మేరకిపుడే-
యైనన్ సరే లంకమీఁ
దను దండెత్తఁ గలాఁడఁ గాలరుల మం-
దల్ మందలున్ జేర్చి నె
క్కొని నేడెబ్బది రెండు వెల్లువల గ-
గ్గోలెత్త లంకన్ బజేల్. ౧౦

కం॥ మఱునాఁటి వేఁకువను మం
తిరులన్ బడవాళ్ళఁ బిలిచి - తెగబడి తేపే
దురమునకు వెడల నానతిఁ
బఱపుండని పలికితేడు - పయనం బయినన్. ౧౧

కం॥ మంతిరుల నసర తేడిటు
మంతనములు సేయు పొంటె - మాటాడెను దా
సొంతపనుల్ నెగ్గుట కది
యంతయు 'రాము'ని గుఱించి యఱమఱికకునై ౧౨

కం॥ కని విని తలఁపని పని నే
డొనగూడెఁ గనుఁడు క్రోతి - యొక్కఁడు నీర్వా
మినిదాటి 'లంకఁ' జొచ్చుట
యును, గాకసరలను బలిమి - నూటాడించెన్. ౧౩

గీ॥ లెంక యొక్కండె కాల్చె నీ - 'లంక' నెల్ల
'ఖరుఁడు' మున్నగు నుక్కర - క్కసులుసురులు
వదలి రిఁక నెన్ని కీడులో - వఱలె మీఁరు
దీని తుది మొదలెల్ల గుర్తింపవలయు ౧౩

గీ॥ క్రొత్త యెత్తుగడన్ దల - కొని మెలంగ
గెలుపు సిడమెత్తి దెసలాచి - నిలుప వలయుఁ
గానఁ దలపోసి మనుగడఁ - గడచేను వెర
వును గడింపుఁ డటంచు 'రా - వణుఁడు' పలుక ౧౪

కం॥ ఎనిమిది వలఁతుల ఱేఁడులు
నినుఁ గొలువఁగ 'నింద్రజిత్తు' నీకొడుకగుటన్
పెను సందియమా ? మఱియిటు
వెను బఱవఁగ నగునె ? యెదురు-బీరముఁ గలదా ?

కం॥ మానిసు లిరువురు క్రోఁతుల
తో నేతెంచినఁ గలంగి - తొందర పడనే
లా ! నిబ్బరపున్మదిఁ దో
డ్తో నుసురులుఁ బాయఁ జేయు-దుము గదబలిమిన్.

కం॥ ఇటు పెక్కు తెఱంగుల న
చ్చటి ప్రెగ్గడ లెల్లఁబలుకు - సంబర మింపై
పొటమరిలన్ 'రావణుఁ' డ
ప్పటపున్ బరవసము దిటవు-బలకాయించెన్. ౧౫

గీ॥ రచ్చనుండు 'విభీషణుం' డిచ్చకమ్ము
పెచ్చరిల్లుటఁ గని యిటు - ప్రెగ్గడులకుఁ
బలుక దరమమె! తెలిసి ద-బ్బఱలు వలుకఁ
గట్టి కుడుపదె! యెవరినేన్ - గలుచే దనము ౧౯

కం॥ తప్పులు మనయెడఁ గలిగియు
నొప్పగ జగడించుటిద్ది - యును నాయమె! నీ
తప్పొప్పు కొనియు నోమఁగఁ
దప్పక వేఁడు కొనుటెంతో - దరమం బన్నా! ౨౦

కం॥ అని పలికిన 'రావణుఁ' డ
గ్గని నేయిం బోయు చాయఁ - గింకిరి పాటుం
గొని 'కుంభకర్ణు' బిలిపిం
చిన వాఁడును నాయమరసి - చెప్పిన మీఁదన్ ౨౧

ఆ॥వె॥ చేదు కాయలాయెఁ - జెప్పిన మాటలు
'రావణు'నకుఁ బనికి - రానివాయె,
నని యెఱింగి తమ్ముఁ డౌదల నూపె నీ
యిచ్చ సేయు మనుచు - హెచ్చరించె. ౨౨

చం॥ అపుడు 'విభీషణుండు' సని
యన్న మొగమ్ముయి నాయమెంతో! నే
రుపు మెయిఁ బల్కినన్ వినవు -
రొమ్ము మదిం దలఁగింపఁ బోవు గో

రవుఁ జెయిదమ్ముల్ విడవు -
'రాముఁడు' దేవరయంచుఁ బల్క నీ
వెపుడయినన్ మదిన్ దలఁప -
వెడ్డతనమ్మిది సుమ్ము 'రావణా' ౨౩

ఉ॥ పెక్కు తెఱంగులిట్లు మది -
బీటలు వాఱు తలంపు లన్నకున్
మ్రొక్కుచుఁ దెల్పినన్ వినక -
మోఱకుఁడంతట గద్దె దూఁకి న
ల్దిక్కుల నార్చుచున్ గుదియఁ -
ద్రిప్పుచుఁ గెవ్వున, నవ్వి భీషణున్
ద్రొక్కుచు ఱొమ్ముపైఁ గినుక -
తోఁ బుసకొట్టుచుఁ గాలఁ దన్ననన్, ౨౪

గీ॥ అటఁ 'బ్రహస్తు'నిఁ బిలిచి వీఁడన్న నెదిరి
పరుసములు నాడెఁ గాననా - వలికి నెట్టుఁ
డంచు నానతి యిడిన వాఁ - డట్లొనర్చెఁ
గొలువును 'విభీషణుఁడు' వీడి - వెలికి వెలఁగె, ౨౫

గీ॥ తల్లి 'కైకసి'కీ మాట - లెల్లఁ జెప్ప
నామె 'విశ్రవసుండు' ము - న్నానతి నిడె
నన్ని రాబోవు కతలెల్ల - నాఁడె ననిన
దల్లి యానఁ గొడుకు 'రాము' - దరిని జేరె, ౨౬

మ॥ మదిలోనన్ దలపోసె 'రాము'
దరియన్ మన్నించునో? లేక బె
ట్టిదుఁడౌ 'రావణుఁ' దమ్ముఁ డంచు గినుకన్ -
డీల్పాటుఁ గావించునో
యెది యెట్లైనను 'రాముఁ' డీసరుఁడె తా -
నిర్జించునే? ప్రేముడిన్
గదురన్ రమ్మని చేరఁ జీరి యెదలోఁ -
గాపాడఁడే! చూడఁడే! ౨౭

గీ॥ క్రోఁతులార! యనుంగు సం - గాతులార!
నన్నుఁ జేకొనుఁడయ్య! మా - యన్న చేతఁ
ద్రోపువడి నేను 'రాముఁ' జే - రుగడ కొఱకు
గాచినాఁడను దెసలేక - వేచినాఁడ ౨౮

కం॥ పేరు 'విభీషణుఁడ'ను జెలి
కారమ్మున వచ్చినాఁడఁ - గాని యొకింతేన్
నేరను బగఁ బలుకుండ్రఁక
మీ 'రాముని' తోడ మేలి - మిన్ గయిసేయన్. ౨౯

గీ॥ అనిన వెనువెంటఁ గొందఱి - య్యదియు దొంగ
వేసమని దోసమెంతో! క - వ్వింపఁ గొంద
ఱొడయనికి విన్నవింత మె-య్యెడల మంచి
దంచు 'రాము'నితోఁ - జెప్పి - నంత గొంత ౩౦

కం॥ వినినది తడవుగఁ దటుకునఁ
జెనుఁడు 'విభీషణు'ని తోడఁ - జెను దెండని ప
ల్కిన 'రాము' నాన నొక తి
మ్మన బోయిఁ 'విభీషణు' సు-మాళింపు మెదన్. 3౧

గీ॥ 'రాము' నానతి యూయెను - రమ్మటంచు
సుగముతో రాకఁ గోరి ప-ల్కఁగ 'విభీష
ణుండు' మెల్లఁగఁ జేరి క-న్నులుఁజెమర్ప
నేలఁ జాఁగిలఁబడి చెంగ-నాలు చేసి. 3౨

కం॥ బత్తిమెయి 'రాము' నడుగుల
నొత్తుచుఁ గను లద్దుకొనుచు - నొసపరి నుడి బి
ట్టెత్తరమున బలికిన గని
యొత్తిలి 'రాముండు' వలికె-నూఱట పలుకుల్. 33

కం॥ చేరుగడ యంచుఁ గోరిన
వారినిఁ బ్రోచుటయు రాచ - పాడి సుమా! నీ
వారీ యందఱుఁ బెఱ లిట
లేరని మది నెఱపుఁదక్కి - లెస్సగ మనుమీం! 3౪

కం॥ అని దీవెన ప్రాల్వోసిన
పెను సంబర మంది యా 'వి-భీషణుఁ' డెంతోఁ
జెనవుగ 'రాముని కడనుం
డెను మంతిరి వోలె నెంత - నేస్తమమరెనో? 3౫

కం॥ ఇది యిటులుండఁగ 'సుగ్రీ -
వు' దరికి 'రావణుఁ'డు బంపెఁ - బొంపిరివో నె
మ్మది 'రాయబారి' 'శుకునిన్'
జద గొద మది గుదురు ఫాటుఁ జెందని కతనన్. 3౭

గీ॥ 'వాలి' కొమరుండు "నంగదు" - పాలికరిగి
'శుకుఁడు' 'రావణుఁ' డిట్లు ప-లుకుమటంచు
మోడ్పుఁ గేలమరించి ము-న్నుందు నిలిచి
పలికెఁ గర్జమ్ము తీరు చొ-ప్పడు తెలుంగు 3౮

ఉ॥ వాలికి నాకు నే స్తమొక -
పట్టున గిట్టుటఁ బట్టి నీవు నా
పాలి సకుండ వింకఁ బగ -
వారగు మానిసు లేడ ? చెల్మికిన్
జాలరు, 'రాము'నిన్ విడిచి -
చేయ్వున కన్ గనుమట్లుఁ గానిచోఁ
పీలగు నొక్క- 'లంకఁ' జొర -
వెన్నుఁడు బమ్మయు నీసరుండు నేన్. 3౯

ఉ॥ ఇట్టులు జెప్పి పంపె నని -
యెట్టెదురన్ 'శుకుఁ'డాడఁ గ్రోఁతు లి
ట్టట్టని పట్టి కొట్టి వెలిపందఁగఁ
జేసిన 'రాయబారి' ని

ట్టట్లొనరించు టేమి ? పరువంబని
'రాముని' మొఱ్ఱ వెట్టినఁ
బట్టుగ 'రాము' నాన విడు-
వంబడఁ గ్రోతుల ఱేని కిట్లనున్. ౩౯

క౦॥ 'రావణుఁ' డంపఁగ 'సుగ్రీ
వా! వచ్చితి' నంచు రాయ-బారము విని 'సు-
గ్రీవుఁడు' బదులిట్లనె ? మీ
'రావణు'తో ననుమటంచు - రాజీ - మాటల్ ౪౦

మ॥ తొలుతన్ 'సీతను' దెచ్చి 'రాము' నడుగున్-
దోయిఁ జోహార్లిచ్చి య
గ్గలపుం బొందిక నప్పగించు నెడ లం-
కన్ దాటి మీఱేనితోఁ
గలనఁ గందు మగంటిమిన్ నెఱపి చే-
క్కన్ బోర రానేల ? నీ
వెలమిన్ బల్కుమ నాదు మాట లని యెం-
తే 'రాముఁ' డోముఁ దుదిన్ ౪౧

క౦॥ అని చెప్పినంత - సుగ్రీ-
వుని మాటలఁ బట్టి 'శుకుఁడు' - బుఱ్ఱునఁ జెని 'రా-
వణు'తో నున్నది యున్న
ట్లనియెన్ ఱేడలుకఁ దొలఁకి-నటమట పడియెన్. ౪౨

కం॥ ఇది యిటు లుండఁగ 'రాముఁడు'
మది దవ్వ తలంపొకండు - మల్లామడిమై
తుదిఁ దీర్మానించుకొనెన్
బదపడి తాఁ జేయఁ బూను - పని నెగ్గింపన్ ౪౩

ఆ॥వె॥ దవ్వ దగ్గఱనక - తరలించుకొని తెచ్చి
సంద్రమందు వేయు - చుంద్రు గాని
కోట్ల కొలఁది క్రోఁతి గుంపు పనుల్ తుది
బూది సేయు జెన్న - ముగను మాట ౪౪

కం॥ కడకేమి తెచ్చి వేసిన
బడిబడి దిగమ్రింగ సాగె - బలు చేఁపలు బ
ల్విడి 'రావణు' కట్టడి న
ట్టెడ నెగ్గనదెట్టు లటమ - టింపాయెఁ దుదిన్ ౪౫

మ॥ ఎదియో! గొప్ప కడంకఁ దీర్చుకొఱకెం-తే
దబ్బ సెజ్జెక్ బరుం
డఁ దలంపుం గొని నిట్టుపాసమున ను -
డ్డాడించియున్ సంద్రమ
య్యాదనం దించుక మిన్న కున్న మదియుం -
దల్కన్ బురాయింప బె
ల్లిదపుక్ రోసము పొసరింప నిటుప -
ల్కెన్ 'రాముఁ' డుంకింపుచున్. ౪౬

ఉ॥ విల్లి దిగో! యలుంగులవె -
వేగిరమే యిటు తెమ్ము, సంద్రపుం
బ్రుళ్ళడఁగింతు నెంతకును -
దోరపుఁ దాలిమిఁ జూపినంత నం
పిల్లి పరాయి వానివలె -
వెంబరపిత్తుగఁ జూడసాగె నా
బల్లిద మెట్టిదో? యెఱుక -
పడ్డపుడేని నిజ మ్మెఱింగెడున్. ౪౭

గీ॥ మెత్తగా నున్నఁ బందయు - మొత్తఁజూచు
నన్న సామెత బలె నోర్మి - నడఁగి యుండ
లెక్క చేయఁడు విల్లు నే! - డెక్కు వెట్టి
పొగరడంచెద నేఱు లేఁ - బెగడిపాఱ. ౪౮

మ॥ అనినన్ వెంటనె విల్లు నమ్ము లివిగో -
యన్నా! యటంచీయఁ దో
డనె, యల్లెన్ సవరించి యగ్గి చిలుకల్ -
ఠక్కంచు మ్రోయించి వే
సిన నల్దిక్కుల నిప్పు రవ్వ లురియన్ -
జేజే హాసాదంచు మే
లోకని నల్లెట్టెదురన్ నిలంబడియు
మ్రొక్కుల్ గూర్చి సంద్రంబనెన్. ౪౯

మ॥ కడలిం గల్గిన నెల్ల బూతములు సీ -
కాకొండెఁ గంగారునన్
జెడియెన్ బాఁప జేగమ్ము దాని కిరవై -
చెన్నొందు తామేలు డీ
ల్పడి తార్మారయి క్రిందు మీఁదు తిరిగెన్ -
బ్రాఁపింత లేకున్కి బి
ట్టుడికెన్ నీరు, సెగల్ పొగల్ మిగుల
నెంతోఁ జిచ్చు దేల్పాటునన్. ౫౦

శా॥ నీపైఁ గట్టెద నట్టెడన్ నిలుపుమె -
న్నో వేసినన్ మోసి నీ
మూపుం బెట్టిన యట్టు తేలికగ 'రా -
ముం'డన్నఁ బ్రాయేలునుర్
మీపల్కుం దోలిపల్కు తీరు విని నె -
మ్మిం గర్జముం గూర్తు నన్
గాపాడంగదె! తొంటి నేర ముడుపం -
గారాదె! యోనా దొరా! ౫౧

గీ॥ అట్టెడను 'విశ్వకర్మ'కు - ననుఁగు కొడుకు
'నలుని' చేతను గట్టింప - వలయు - నెగ్గు
నంచుఁ గలుముల జవరాలి - యబ్బ పలికె
బత్తి చిగురెత్తు డెందంపు - టెత్తరమున- ౫౨

కం॥ నాపయిఁ గట్టిన వంతెన
యేపయిఁ లంకకును బోవ - నేర్పఱతును మీ
కేపాటి కీడు మూడదు
పోపొమ్మని సెలవొసంగఁ - బోదు నటన్నన్. ౫౩

ఉ॥ నావిని యియ్యకోల్వ డసి -
నన్ 'రతనమ్ములపంట' 'రాముఁడున్'
దీవెన లిచ్చి పంపెను బదింబదిగా
మల ద్రిమ్మరీంద్ర - సు
గ్రీవుఁడు హెచ్చరించి యని -
కిన్ గదలించిన నీటి కుప్పకున్
గ్రేవ నొకింత నిల్చి గిడి -
గిళ్ళుఁ బొనర్చి తలంచి దేవరన్. ౫౪

శా॥ ఱాలున్ ఱప్పలుఁ జెట్టు గుట్టలును సం -
ద్రంబందు నువ్వెత్తు కెం
గేలన్ మొత్తము నెత్తి మొత్తి ననుగా -
నీ! పెద్ద తెప్పల్వలెన్
దేలాడన్ గదలాడ సాగె నటుపైఁ -
దెందేఁపలై క్రోఁతుల
వ్వాలిన్ జెంపిన జోదు నానఁ గొని పో -
వం బూని నారయ్యెడన్. ౫౫

క౦॥ తలఁపునఁ దోఁచిన యవి చే
తుల కందిన యవియుఁ గనుల - తోఁ గనునవియున్
వలఁగొని కొని ప్రాయేఱునఁ
జిలాపలన్ విసరి రెల్ల - చెట్టుంబట్టుల్ - ౫౬

క౦॥ తెందెప్పలుగా విసరిన
సందరమున జెట్టు పుట్ట - చెట్టు లవెల్లన్
గెందమ్ముల కొలనుం బలె
నందముగాఁ జూపఱులకు - నగపడె మిగులన్. ౫౭

క౦॥ తలగాము వదలు చేందురు
వలెఁ గసటును బాయు - చాగి - వలెఁ గడలిని గ్రోఁ
తుల వెల్లువ దాటించెను
బళిరా! 'సుగ్రీవుఁ' నాన - బల్లిదము? కదా! ౫౮

క౦॥ చెట్టుం ద్రిమ్మరులను గని
పెట్టుటకై 'రావణుండు' వేగులఁ బంపెన్
పట్టుగ 'శుక - సారణు' లా
గుట్టుం దెలిసికొనఁ జేరఁ - గూరిరి కడలిన్. ౫౯

క౦॥ అటమట వేసముఁ గొని తట
పట మలద్రిమ్మరులఁ జేరి - వారల కిటుక
ప్పట మెఱుఁగు తఱి 'విభీషణుఁ'
డటుఁగని 'రాము' కడకనిపె - నచ్చెరు వెచ్చెన్. ౬౦

కం॥ 'రావణుఁ' డంపిన వేగుల
మావితమున బట్టి తెచ్చి - రే నేరములన్
గావింప మనుచు వేఁడినఁ
బ్రావ మదిన్ 'రాముఁ'డోమి పంపెను వారిన్ ౬౧

కం॥ పగవాఁడొకచోఁ జిక్కిన
తెగ నఱుకక విడచుటెంత - తేగము 'రాముం'
డగచాట్లఁ బొందియునుదను
తెగటార్చెడి వారిఁ బ్రోచి - తీరెను బళిరా ౬౨

కం॥ విడిచినదే చాలని ప
ర్విడి రూపిరిఁబీల్చుటకును - వెఱపడి 'లంకఁ'
జెడి బ్రదికితిమని చేరిరి
యొడయుని కడ నిల్లు పల్కి - రువ్వెత్తు మదిఁ, ౬౩

గీ॥ సామి! మేమేమి చెప్పగా - లేము 'రాము'
బరవసమ్మున నెగఁబెట్టు - పసిఁడిగట్టు
కనికరంపు బిడారు చా-గపుఁగొటారు
తాలిమికిఁ దావు మంచి గొ-నాల ప్రోవు- ౬౪

కం॥ సత సంద్రమ్ముల నొకటిగ
జతపడి ముబ్బడి నొనర్చ - సరియగు మదికిన్
గుతిలపడు దండుఁగనఁ బో
రితమున నవ్వాని గెల్తు - రే! వేలుపులేన్ ౬౫

కం॥ లెక్కింప వీలుపడదా
పెక్కువ యెకిరింత గుంపు-పెంపుం దెంపుర్
నిక్క మెటుబల్కుదుము, దల
తిక్కయి మదిఁదప్పి లెక్కఁ దేల్చుట కగునా? ౬౬

కం॥ అని పలికిన విని 'రావణుఁ
డనె' వేగులతోడ మీర-లా పగతుని నె
క్కొని కొండాడుదు రిఁకఁబోం
డని తిట్టి 'మహోదరున్' న-య్యమ్మున బిలిచెన్ ౬౭

కం॥ జెరిగిన వేగుల కతలుం
బరికింపఁగఁ బగఱఁ బొగడు-వారై రి యిఁకన్
సరియైన కోటికానిని
సరగున గొని తెమ్ము నీప-సన్ గనుఁగొందుర్. ౬౮

కం॥ అన 'శార్దూలుం' డను వే
గును దోడ్కొని వచ్చెఁ గొలువు-కూటముఁ జేరన్
గనుఁ గొని రావణుఁ డిట్లని
యెను' క్రోఁతుల దండ దెంతో - యెఱిఁగి మఱలుమ

కం॥ తోరఁబోయి యిచోట నున్నటు
సరగున రమ్మంచుఁ బలికి - జేతనపడెన్ దా
మఱు కోత్తల కగ్గంబయి
కరఁగిన 'రావణుఁడు' 'సీత'-కై పయనించెన్. ౭౦

గీ॥ ఏలుబడి మంత్రనమ్ము లెన్నొ నెఱుంగుఁ
గాని వలకాని గుట్టుఁదప్పి కడవలేదు
'రావణుని' కెన్ని నేర్పు లేర్పడిన నేమి?
బూదిలో సేయు పన్నీరు పోల్కిఁ గాదె! ౭౮

ఉ॥ క్రోఁతుల మూఁకతో నెదిరి-
కోల్పొనరించుట 'రాముఁ' జంపియా
క్రోఁతుల జేనిఁ ద్రుంచి మఱి-
కొమ్మ నేకమ్ముల నొంప 'లక్ష్మణుం
డా' తలఁబాఱె సంద్రమున-
కావలఁ జేరఁగఁ బోయి మున్గెనో?
సీత! యిఁకేటి 'రాముఁ'డిఁకఁ-
జేకొనుమా యను కాఱు కూఁతలన్. ౭౯

మ॥ విలునమ్ముల్ వలకేల 'రాము' సిరమున్-
వేఱొక్కటన్ మాయ చేఁ
తలఁ గప్పించి యసోగమందుఁ గల 'సీ-
తన్' జూడ నేతెంచె మొ
క్కలుఁడా రక్కసుఁడద్ది 'సీత' గని చీ
కాకొంది దబ్బాటునన్
దలఁకన్, నేఁడని 'రాము'నిం గెలిచితిన్-
గన్గొండిదే మొండెమున్, ౭౩

కం॥ అని వెఱపుఁ బఱపు రవళిని
బెను రక్కసుఁ డఱవ - 'సీత' - వెఱఁగొంది కనుం
గొనల జడివానఁ గురియఁగఁ
బొనుపడి యేడుపులును బెడ - బొబ్బలు వెట్టన్. ౭౪

శా॥ ఓసామీ! కడ తేరినావె!
ననునీమాటార్పకెట్లేగితో?
కౌసల్యత మెటుల్ వగం బొగులునో?
కైకమ్మ యుప్పొంగులే
కాసున్ జేయని పానమేటికిదె!
నిన్ - గాంచంగ నేవత్తుఁ బే
రాసంచున్ మను బ్రుంగు 'రాము'తల డా
యం జేరి బిట్టేడ్చుచున్ ౭౫

కం॥ తల మోదుకొనుచు వేసలి
చిలాపలగఁ గనుల నీరు - చేరల దిగ దూఁ
కలి యలఁదురి వందురి బి
ట్టలసి సొలసి వ్రస్సి క్రుస్సి-యలజడి పడినన్. ౭౬

కం॥ విల్లమ్ముల్లుఁ దల మొండెము
లెల్ల కనంబడక పోవు - కెఱఁగి వెఱపు ఱం
పిల్లిన బిమ్మటి 'సీత'కు
నల్లన నెఱిఁగించె 'సరమ' యట బూటకముల్. ౭౭

కం॥ ఇది రక్కస మాయలు న
మ్మఁ దగదు 'సీతమ్మ!' యేల - మది చెడి వగలన్
బొందలాడ వలవదని నె
మ్మది నచ్చిన తీరుఁ జెప్పి - మచ్చికఁ గూర్చెన్. ౭౮

చం॥ కడలికిఁ బిల్ల కాల్వకు నె
కా - యెకి నంతరు లెంతయుండు 'రా
ముఁ డసర యిర్వగట్టులగుఁబో!
యివి మాయలటంచుఁ బల్కి బి
ట్టుడుకుచు 'సీత' యా'సరమ' -
కొక్కడ రక్కస మాయలన్ని యే
ర్పడఁ గని రమ్మటన్న నది -
గ్రక్కున బోయి యెఱింగి చెప్పినన్ ౭౯

కం॥ మదిఁ గుదురుపాటుఁ గొని యే
చిదగొదఁ గాసంత లేక - చెదరిన గుండెన్
బదనిచ్చి 'రామ' మంత్రర
ముదిలకొనన్ మాఱు మ్రోయుచుండెను జెవులన్.

కం॥ జడివాన కురిసి వెలిసిన
వడువున గన్నీరు నిలిచె - వడఁకు మెయిన్ గ
న్పడెఁ గుదిరిక, నెమ్మదిఁ గో
ల్పడి సుడివడి యడలుచుండె - వాడుక మేరన్. ౮౧

కం॥ వేగుల తోడఁ 'బ్రహస్తుఁడు'
రాగానే దాటు కాన _ రావణుఁడిడెఁ దో
డ్తోఁ గదలి మురమొనర్పఁగ _
జాగు నొనర్ప వలదంచు _ సడి సన్న నిడెన్ ౮౨

కం॥ అట్టి యెడ 'మాల్యవంతుఁడు'
గట్టి తలంపూని యితవుఁ _ గై సేయు మదిన్
బట్టుదలిం గొని 'రావణు'
నెట్టెదురన్ జేరి మ్రొక్కి _ యిట్లాడె; దొరా? ౮౩

కం॥ తన సత్తి యెదిరి బలుపును
గనుఁగొని జెగడింప మేలుఁ _ గలుగును గాదే
నొనగూడదు గెలుపిది తెలి
సిన యొళవరి దెసల నసముఁ _ జేకొనుటసదే! ౮౪

కం॥ నీసొమ్ములు నీకెటు ల
ట్లే సుమి! పెఱవారి వారి_యిమ్మగు సొమ్ముల్
వీసమ్మోని గడింపమి
దోసమ్మగు నిందు నందుఁ దోఁపవు సుగముల్. ౮౫

సీ॥ ఎల్ల విద్దెల నేరిచి _ యెల్ల నేమ
కముల నడవడి సారిద్దిమై _ కలిగె నేని
వాని కెందు నలంతి లో _ టేనిరాదు
యిదియు గుర్తింప వలెఁ జుమ్మ! యేలుబడిని ౮౬

కం॥ దరమము సెడె నీవలనన్
దరమం బ్బొట్టుబైనఁ బెంపఁ - దగు నా 'రాముం'
డరయఁగఁ బుట్టుట యిందుల
కొఱకే; యిఁకనైన వాని - గుర్తెఱుఁగఁ దగున్. ౮౭

కం॥ అని తానేర్చిన నాయము
లను బూసం గ్రుచ్చినట్టు - లం బలికిన 'రా
వణుఁడు' విని వినని యనువున
బనిగొని కూర్చుండె 'మాల్య-వంతుఁడు' వెడలెన్. ౮౮

గీ॥ ఆ 'విభీషణు' ప్రెగ్గడ - లందెబందె
లగుచు 'రాము'ని కడకేగి - మిగులఁ బొగడి
'రావణుఁడు' మోహరించి దు - రమ్మొనర్ప
వచ్చునని హెచ్చరించి ర-వ్వలకుఁ జనిరి ౮౯

కం॥ చేవమెయి 'రావణుఁడు' 'సు -
గ్రీవుని లోఁగుట్టెఱింగి - క్రేఁటుంగొని కన్
జేవురుఁ గొలఁకులఁ గినుకన్
గ్రేవలఁ బ్రాపింప వచ్చెఁ - గ్రేడించు మదిన్. ౯౦

కం॥ హోరాహోరిగ నెసలికఁ
బోరిరి తమ బలుపు నిలుపుఁ బొంకము బింకం
బేరాళము నేరిమితన
మారయ బెబ్బులులవోలె - నార్పాటమునన్. ౯౧

ఆ। వె॥ అలసి సొలసి సొమ్మ_సిలి యిమ్ముఁదప్పి కం
దువ యడంగి క్రుంగి _ త్రుంగి బ్రుంగి
మొదటినాఁటి బవర_మున వీఁడుఁ జేరిరి
వేర మెత్తు మది హుషారు తోడ ౯౨

గీ॥ 'అంగదు'ని జేరఁజీరి నెయ్యమున 'రాముఁ'
డాడె 'రావణు'తో నిట్టు _ లాడు మనుచు
రచ్చఁ జేచ్చుటో! యిఁక బుద్ది _ వచ్చెననుచు
'సీత' నిచ్చుటో! యేయొండు _ సేయవలయు ౯౩

కం॥ అన వినువీదికిఁ జేని చే
ప్పున 'రావణు' కొలువుకూట _ మున వ్రాలి తటా
లున నొక పలుకాడెను 'రా
వణ' నేవచ్చితిని 'రాయ _ బారము' సలుపన్. ౯౪

మ॥ నలు సంద్రంబులతోఁకఁ జుట్టి నిను వె
న్నాటున్ గగుర్పాటుమై
వెలలం ద్రిప్పిన జోదు వాలి కొడుకన్ _
బేరంగదుండంద్రు నీ
కొలువుం జొచ్చితి రచ్చ కిచ్చెపదుటో _
కొండాడి మా'రాము' హా
జ్జల 'సీత'మ్మను దెచ్చి పెట్టి మనవిన్ _
సైరింపఁగా వేఁడెదో? ౯౫

కం॥ ఏ యొకటి చెప్పు మిప్పుడ
నాయము గుర్తించి చేసి - నన్ దేవర ! మేల్
సేయును నీతో 'రాముం'
డీయనువున జెప్పుమంచు - నిటు ముద లిడియెన్. ౯౬

మ॥ కడఁకన్ బోరిత మాండి చచ్చుటో !
యటుల్ - కాదేని నాతప్పు లి
ప్పుడ సైరింపుము బుద్ధి వచ్చెనని నా -
ముందుంచి సీతన్ గడున్
గిడిగిళ్ళున్ బొనరించుటో ? యొకటి కో -
ర్కిన్ దీర్చు కొమ్మంచు బ
ల్విడి మాటాడుట లేక పల్కుమని చె -
ప్పెన్ 'రాముఁ' డో 'రావణా!' ౯౭

కం॥ ఆమాటన వాని పయిన్
మోమోటము మాని కస్సు బుస్సని కినుకన్
మోమంత కన్నులయి, యా
కామాటపు రక్కసుఁడు బగ బగ రవాళిన్ ౯౮

గీ॥ పండ్లుఁ బటఁపటఁ గొఱికి యుప్పరము వగుల
నఱచి యఱచేతు లొండొండ నప్పళించి
పైకి దూఁకి గబాలున పంతగించి
కోఁతిగా ! నింత కెంత వాకొంటి వౌర ! ౯౯

చం॥ ఒకటికి రెండు సార్లు తని -
కొప్పమిఁ దెల్పుచు రాయబారి సేఁ
తకు నొక లోటు రాకుని క-
దాటున 'రాము'ని డగ్గఱించి వా
రికిఁ గల పోలుపొందు వివ-
రించె నెకాయెకి గుంపుఁగట్టి పో
రికిఁ జేతఁగూర్చె రక్కసులు -
తెచ్చిన కింకిరి పాటు వాటిలన్. ౧౦౦

చం॥ గలిబిలి దూఁకి బాకులును -
గత్తులు కోలలు దోఁటె లీటెలున్
బలు నలుగుల్ కటారులును -
బల్లెములున్ జికటారులున్ గుదెల్
వలసిన వెల్లఁ దీసికొని,
వచ్చిరి రచ్చకు హెచ్చు జోదులా
యలవు చెలమ్ము ముబ్బడిగ -
నమ్మల ద్రిమ్మరు లుమ్మలించుచున్. ౧౦౧

కం॥ ఓరంత ప్రొద్దొకింతయు
తీరుబడియు లేక పోరి తెగ తెంపు మదిన్
నూరులు వేల్ కాలరులున్
పాఱిరి జెముప్రోలి విందు - బంతిన్ గుడువన్. ౧౦౨

గీ॥ దొమ్మి బవరమ్ము జేరపి తో-డ్తోడఁ నింద్ర-
జిత్తు, మాయలకాఁడయి చేసెఁబోటు
తెట్టగిలి గుట్టగుట్టలై - మట్టుఁ బెట్టఁ
బడిన క్రోఁతులఁగని లక్ష్మ-ణుఁడుఁ గినిసిన ౧౦౩

గీ॥ ఓరిమిం జెప్పి రెల్లరా - పోరునందఁ
బాఁప టలుఁగుల బందాల - బన్నవడిరి
మైమఱపుఁ జూచి యుసురులు మ్రందె ననుచు
'నింద్రజిత్తు' తనంతట - నింటికేగి, ౧౦౪

ఉ॥ పాఁప టలుంగు వేసి పగ -
వారిని జంపి తటంచు 'నింద్రజి-
త్తా'పయిఁ దండ్రితో ననిన -
యప్పుడెలర్చి బిరాన వెంక నో
కూఁకపున బంపి యా'త్రిజట' యొద్దకు వే
బిలిపించి చెప్పె పే
రోపిక లేక 'సీతఁ' గాని -
యోటమిఁ జాటిన వారిఁ జూపుమా ౧౦౫

కం॥ అడియాస 'రాము' పై నిడి
నెడమడుగు నెడంద డిండి - యెడయికఁ గాని ప్రే
ముడి ననుఁ గాను 'సీత'ను వెం
బడిఁ గాని 'రాముఁ' జూపు-మా! 'త్రిజట' యనన్.

కం॥ ఈ నెవమున 'రాము'ని నెటు
లైనను జూడ నగు నంచు_నా_'రావణు' బి
ట్టానతి మేరకు 'సీత'ను
బూనికఁ గొనిపోయెఁ 'ద్రిజట' పొలుపారు మదిన్. ౧౦౭

చం॥ 'త్రిజట'యు 'సీతఁ' జేరి_యనిఁ_
ద్రెళ్ళిన 'రాము'నిఁ జూడుమంచు న
క్కజముగఁ బల్కి_ తీసిగొని_
గ్రక్కున బోయి కనుం గొనంగ నే
గజిబిజియై యలందురి వ_
కావకలైన మదిన్ వనారిలెన్
నిజెముగఁ ద్రెళ్ళ లేదనియె_
నెమ్మది నెంచె వెలుంగులీనుటన్. ౧౦౮

గీ॥ అనద లెక్కన వినుబండి_ చేనదు ముందు
సొమ్మసిలి నేల వ్రాలిరి – దిమ్మతిరిగి
గాన నూపిరి యాడు చు_న్నయది యనుచు
నెమ్మదిని గూర్చె 'సీత'కు_నమ్మకమ్ము ౧౦౯

సీ॥ ఉరవడి వినువీధి_పఱతెంచు కెంజడల్_
వదలి చూపలఁ జెదరు చుండ
పటికంపు దండ ల_ప్పటపు మెఱుంగులఁ
వెన్నలఁ గలిగి క_న్విందొనర్ప

నలకన కావిబొం_తల వెల్గు వలఁ కులఁ
సంజె కెం_జాయ దిసంతుఁ గొట్ట
వలకేలఁ 'గచ్ఛపి' పసిఁడి జిగా తేజఁ
మల|దిమ్మరులకు నె_మ్మది నెలర్ప

గీ॥ హరి! హరి! యను రవళి సందరపు టలల
సందడిని మందె మేలము _ దండడింప
'రాముఁ' గనుఁగొను పేరాస _ |ప్రేముడింపఁ
దీరుబడిఁ జేసి కొని వచ్చె _ 'నారదుండు'_ ౧౮౫

కం॥ గారవమునఁ దగు పూజల
'నారదుఁ' గొనియాడి కొలిచి-నన్ గని యుత్తిన్
బేరుకొనిఁ దొల్లి నీకెస
లారిన 'గరుటాల వాని _ దగు సాయమునన్. ౧౮౬

మత్తకోకిల॥ పాఁప బందన లూడుఁ గావున _
వైళమే తలపోసినన్
|దోపడున్ సిలుఁగుల్ హుటాహుటిఁ_
దోన మార్తురఁ బోరిలో
దూఁపటిల్లఁగ సేయ వీలని _
తొందరించిన 'రాముఁ' డా
పాఁప మేఁపరి రాకఁ గోరిన _
వచ్చిమున్ నెఱవేర్చినన్ ౧౮౭

కం॥ ప్రొద్దు పొడ తెంచు నెడ నివ
మెద్దెసకో పోవు శేవ - నీబందనముల్
తద్ద విడి పోయి యిరువుర
ముద్దుమొగమ్ములను నవ్వు-మొలకలు మొలిచెన్ ౧౩

కం॥ గాలికగు దూదిపింజల
పోలికఁ దెలిమోము పక్కి - పొడవు గజులపెన్
గాలికిఁ జెట్టుకుఁ బుట్టకుఁ
దూలిరి నాగులకు దిక్కుఁ - దోఁపక తోఁత్రో ౧౪

కం॥ వేగుల వలనన్ విని యా
జోగులెటుల తేరిరిద్ది - చోద్దంబని యెం
తే గరువ ముడిగి మై మై
మూగిరి మఱలన్ దురమ్ముఁ - బొనరించుటకై ౧౫

కం॥ ఉప్పరిగ నెక్కి రక్కసు
లప్పరువపు టసదుఁ జూచి-యబ్బురపడి పే
రెప్పగిదఁ జెత్తురని తలఁ
పొప్పమిఁ బలుమారు పలుకు-లొనరుపడఁగన్. ౧౬

గీ॥ పెక్కు ముక్కడి రక్కసు - లుక్కుదక్కి
మడిసిరి 'యకంపనుండుఁ' ధూ-మ్రాక్షుఁ డవల
'నంగదు'ని చే 'మహాకాయుఁ' దఁగడఁ బడె
'నీలుఁడు' ప్రహస్తునిం జంపి - నెగ్గెఁ బోర ౧౭

కం॥ పేరుఁగల వార దెప్పుడో ?
పేరూరును జెప్పకుండ - విడిచి రుసురులన్
నేరిచి బ్రదుకుట మేలని
పేరుకొనఁగ నాలిమాట - పెడ చెవిఁ బెట్టెన్. ౧౧౭

చం॥ వలఁకుల తేండ్లఁ బోనడఁచి -
వాసికి నెక్కిన నేను క్రోఁతిమూఁ
కలుఁ గల 'రాము' వేఁడుకొనఁ -
గా మదిఁ బుట్టదు వేల్పు తేదు నా
బలిమి గడించునొక్కొ! తల -
వ్రాఁత యదెట్లటులో నిజమ్మ! నే
కలన నొకింత పీడుదు నె!
క్రచ్చఱ 'రాముని' జంపి తీరుదున్. ౧౧౯

కం॥ వెఱవకు 'మండోదరి' యని
వెఱవేర్పడి పలికి మఱలి - వెనుకకుఁ బంపన్
బురికొలిపె నామె యీగడు
సరి మాటను దాటలేక - చేనెఁ దనదారిన్. ౧౨౦

కం॥ ఎక్కటి కయ్యా మొనర్పఁగ
రక్కసు తేడనికి వెడలె - 'రాము'ని బంటౌ
యుక్కు మొనగాని 'హనుమను'
గ్రిక్కిఱిసి పెనంగొనంగఁ - గ్రేటునఁ బిలిచెన్. ౧౨౧

సీ॥ తోక జాడించి పొడవు చే-తులు విదిర్చి
మూతి బిగియించి వెడఁద ఱొ-మ్ము విదిలించి
అప్పళించుచుఁ జేతు ల-య్యారె! రమ్మ
టంచు 'రావణు' పైఁబడి-కొంచెపఱచె! ౧౨౨

సీ॥ వీఁడుగద! యింత చేసె నన్ వేఁడిపలుకు
వాడి పిడికిట పోటుల - ప్రక్కలింపఁ
గాళ్ళ వ్రేళ్ళను గోళ్ళను - కంప తోడుగు.
వడువు బెనఁగొని అక్కె నా - పాలసు నట! ౧౨౩

సీ॥ ఇంతలో 'లక్ష్మణుండుఁ'దా - నెదిరి యెడఁదఁ
బిదిలి ప్రిదిలి రోసంపుఁ - గుదురు కదలి
గోరమగు పోరుఁగావించి - కుతిల పడఁగఁ
జేసి 'రావణుఁ' డచ్చోటు - వాసి చనిన ౧౨౪

ఆ॥వె॥ 'రాముఁ' డెదిరి మొదట - 'రావణు'తో నని
సేయు టుడిగి యిట్లు - సెప్పఁ దొడఁగె
రావణా! జగమ్ము - లే, వచ్చి యడ్డిన
చావుఁదప్ప బ్రదుక లేవు నిజము ౧౨౫

కం॥ ఈరసమున నారసమును
బేరెము వాఱంగ నేసి-పెలుచం బయిపై
పేరలుగులు విడిచిన నవి
దూరి యెదన్ 'రావణుండు' దొట్రిల పడియెన్ ౧౨౬

ఉ॥ అన్నిటి కన్ని మూజేడఁగ-
నంతఁ జివుక్కున లేచి యెంచె నేఁ
డన్నల! యెన్నియో? పెనఁగు-
లాట లొనర్చితి నెందఱెందఱో
నున్నతపున్ సరమ్ములెద -
నూడిరి గాని యిదేమొ? 'రాము'చే
కొన్న-లకోరి వాఁడిమి కొ -
కొండెన గాదెటు పోల్చి చూచిరన్. ౧౨౭

గీ॥ సేగిఁ బొందితి విలుసేరి - సేదఁదీరి
రమ్ము బవరమ్మున కటంచు 'రాము'ఁ డనిన
వినుకలిన్ 'రావణుఁడు' పోయె - వీటికపుడ
'కుంభకర్ణు'ని నిదుర మేల్కొలుప నెంచి ౧౨౮

గీ॥ రక్కసులఁ గొంత మంది నుక్కరుల మిగులఁ
బంచి నిద్దుర లేప నాసించి నంత
'కుంభకర్ణుఁడు' లేవఁ గక్కుఱితిఁ దెలిపి
'సీతఁ' దెచ్చిన యది మొదల్ - సెప్పినంత- ౧౨౯

గీ॥ కొమ్మ ద్రిమ్మరులను జేతఁగూడి వచ్చె
'రాముఁ' డసికింక పిల్గాక - 'రావణుండు'
నిన్ను మేల్కొల్పి తోడుకొని తొరఁ తొరగ
రమ్మటంచాన సుమి యని - రక్కసులన! ౧౩౦

ఉ॥ వెంటనె ! 'కుంభకర్ణు' డిది -
విఁగడప్పుం బని యం చెఱింగి లో
నంటిన నిర్వ్యాజన్ దలఁపు -
లన్నకుఁ జెప్పఁ గడంగి పోయి వా
ల్గంటిని 'సీతఁ' నెందు కొఱ
కై యిటుఁ దెచ్చితి తప్పటంచు ము
క్కంటికి జోడు 'రాముఁ'డని
కచ్చితప్పుం బలుకాడి నంతటన్ ౧౩౧

కం॥ చెడి పోవు వార లెన్నఁడుఁ
బెడ బుద్ధులుఁ గాక ! మంచి - విందురె ? దివ్యన్
గోడి గబ్బు మూరుకొన వీ
ల్వడ నటు బ్రదుకాస లేని - వానికి పోలెన్. ౧౩౨

మ॥ ఎటు లేక దమ్మున్ని 'కుంభకర్ణు' నితవెం -
తేఁ దోసిరాజాట మి
క్కుటమౌ బేటముఁ జాటి లోఁగొని యనిన్ -
గోల్కొంటకై లేపి పం
పుట కాసించినఁ రావణుం డటుల త -
ప్పుందారిఁ ద్రొక్కించి య
క్కటికం బించుక లేక 'రాము' నెదురక -
గయ్యానికిం బంపినక ౧౩౩

ఆ।వె॥ కుండ చెవుల వాఁడు – గొప్ప బొజ్జఁ గలాఁడు
మంపు నిదుర కాఁడు – మత్తి కాఁడు
నేన్ను బలిమి వాఁడు – నేతెంచెఁ బోటున
కుదుటు కలిమి చెలిమిఁ – బొదలు చుండ !   ౧౩౪

మ॥ మదిలో 'రాము'ని యందు బత్తి మెఱయన్ –
మల్లాటఁ బోటొగ్గి క
ట్టెదురన్ డీకొని మోహరించె నపుడెం –
తేఁ జూచి 'రాముం' డహో
గుండె తాల్పుంబలె వచ్చు వాని కెదురై –
క్రొవ్వాఁడి తూపుల్ పదిం
బదిగా నేసిన నీడఁ బోక తుమురై –
ప్రయ్యెఁ బదుల్ వేసినన్.   ౧౩౫

ఉ॥ ఆఁకలిఁ గొన్న సింగమటు –
లామెస రేగి తటానఁ బైపయిం
దూఁకినఁ జిత్తు జెల్లువలెఁ
దూపులు వేసిన హుంకరించి య
ట్టాఁక నెదిర్చి నిల్చిన బి –
రాన లకోరి నొకండుఁ దీసి పె
న్వ్రేఁక నదల్చి వేసిన ఖ –
ణేల్లని దిక్కులుఁ బిక్కటిల్లఁగన్.   ౧౩౬

కం॥ వానికి బదులట్టిపి యెం
తో నిబ్బర మబ్బి వేయు - చుండిన యెడఁ దో
డ్తో నూరు తునియలై పడ
బోణీగా విడిచెఁ గ్రొత్త - ములుకు బిరానన్. ౧౩౭

కం॥ ఓహారి సాహారిగా హో
రా హోరి పెనంగి కడకు - రామునిచే హే
మాహేమి 'కుంభకర్ణుం'
డాహా! యుసురెడలి బవర-మందే పడియెన్. ౧౩౮

కం॥ 'దేవాంతకుఁడు' 'నరాంతకుఁ'
డా వెనుకన్ వచ్చి రటమ - హాపార్శ్వుం
డా వెంబడి 'నతికాయుఁడు'
ప్రోవయి పొలదిండ్లు పెద్ద - ముట్టడిఁ జేయన్. ౧౩౯

గీ॥ 'హనుమ'చే మువ్గు ఱింక'ల - క్ష్మణుని చేతఁ
జెచ్చె 'నతికాయుఁ' డవల ల - క్ష్మణుని మీఁది
కింద్రజిత్తెగుదెంచె దీ-టెన్న రాని
మాయ వేసాల రెండవ - మాటు నసికి ౧౪౦

గీ॥ కోర్కు లొడఁగూడ బమ్మ చే-కొన్న బలిమి
కతన గరువమ్ము పొంది ర-క్కసుల జోదు
'లక్ష్మణు'ని యందు నలవు చే-లమ్ముఁ జూపి
సొమ్మ పడఁజేసె జెంట క-య్యమ్ము నంద. ౧౪౧

కం॥ నాఁటి దురమ్మును గడవఁగఁ
బోటరులుం జాల రంత-పోటు మగటిమిన్
మేటిల్లె 'నింద్రజిత్తున'
కాటక్కరి చెయ్వి లోరుల-కగ్గంబగునా! ౧౪౨

కం॥ మల్లద్రిమ్మరులం దొక్కఁడు
వెలికిఁ గలికమున కైన - వెదుకఁ గనఁబడం
డలపున సొలపున గొలుపున
పలపలనై తలఁపు వెంటఁ-బరువెత్తి రటన్. ౧౪౩

గీ॥ చేయఁ దగు పని యిపుడెట్లు-సేయ నగున
టంచుఁ బెద్దలు మంతన-మాడి నిచ్చె
యించి రొక 'హనుమంతుఁడే' - యీపని నెఱ
వేర్పఁ గలఁడని యేర్పాటు-తీర్పుఁజేసి- ౧౪౪

కం॥ 'హనుమంతుని' గొనియాడఁగ
వినిజివ్వన నెగిరి మొగులు విరిపొద దాటం
గను మందుతీవెకొండం
గని యడిగిన నద్ది యద్దు - గా మోటుకొనెన్. ౧౪౫

ఆ॥వె॥ 'కరణు'లున్న గట్టుఁ - గదలించు కొనివచ్చి
పఱుగువాఱి తెల్ల - వారు సరికి
'హనుము' తెచ్చి యిచ్చె - నంద ఱేకతమున
సంతసించి యుబ్బి - గంతు లిడఁగ- ౧౪౬

ఆ॥ వె॥ గాలిచూలి తెచ్చు - గట్టుపై గాలికిఁ
జొక్కు గిక్కు దక్కి నిక్కి తక్కు
పనులు సేయఁ గడఁగి-రనువున 'లక్ష్మణుఁ'
మేన మేలుఁగూరి, మిండఁడయ్యె - ౧౪౭

ఉ॥ ఆపయిఁ బైపయిన్ దగిలి -
రక్కరమై పొలదిండ్లు పోరఁ దెం
దేపలు చెట్టుపట్టుల న-
దేపనిగాఁ బొలియింపఁ గ్రోఁతు లో
కొప్పున జుట్టుఁబట్టి తల -
లూపుచుఁ గాలను చేత మొత్తుచున్
గోఫున దూఁకి పోరి సెల -
గో! సెలగో! యని బొబ్బ లెట్టుచున్. ౧౪౮

కం॥ వచ్చిన వారి మిగుల్పక
పచ్చడి మెదకులుగఁ బంచ - బంగాళముగా
బచ్చెముపాడుగ నసిలో
విచ్చలవిడి గెడపి రపుడ-విరివిగఁ బగఱన్. ౧౪౯

కం॥ బలియురు 'కుంభ - నికుంభులు'
పొలిసిరి 'సుగ్రీవు' చేత - బుజెముల సత్తుం
గల 'హానుమ' చేతఁదక్కిన
పొలదిండులు రాముచేతఁబోడ వడఁగి రహా! ౧౫౦

మ॥ జగముల్ గ్రుంగు తటిన్ జెముం డెటుల కన్ -
సారింప వీల్గాక బి
ట్టగు తేజంగొని 'యింద్రజిత్తు' యనిసే
యన్ వచ్చెఁ దిమ్మన్నలే
వగ నిల్పోపక పాఱిపోక వెఱఁగూ -
ర్పన్ దొట్టి పెన్ సోఁకుమూఁ
క గుమిన్ దాఁకి బుజెమ్ము తీట దులుపం -
గాఁ గోరి యుద్దాడుచున్. ౧౪౧

ఉ॥ అంతట 'లక్ష్మణుం -
డెదిరి యాదరబాదర విల్లునెత్తి కే
రింతలతో లకోరిఁ గొని -
ఱిచ్చవడన్ మది నాటినన్ బరా
కింతయు లేక తోడనె స-
యింపఁగ రాక కలంగి బ్రుంగి నూ
రింతలు వాఁడి ముల్కులెల
యించి తటాలున దగ్గఱించినన్, ౧౪౨

కం॥ మలపట్టు 'లింద్రజిత్తును'
గలనన్ గరవాఁడి తూపు - గములేసిన ని
చ్చలమున నెదురొడ్డి చూ
పలఁ దల కొక దారిఁ బట్టి - పర్విరి పెలుచేన్. ౧౪౩

కం॥ దారిబడి వెడలు వడువున
బోరితమున నెదుర జోదుఁబోడ గన నటుల
వ్వారిగఁ గ్రోఁతులఁ జెంపెను
దూరుం దుండెములుగాఁగఁ-దోడ్తో నసరల్   ౧౫౪

కం॥ అత్తఱి నెక్కటి కయ్యపు
టొత్తిడి నొండొరులు పోరి-రువ్వెత్తున వా
రొత్తరపు బలిమి నంపఱ
చిత్తడి మునిఁగిన తెఱలగు-చీకాకయినన్.   ౧౫౫

గీ॥ 'లక్ష్మణుం' - డింద్రజిత్తు'ను - లావు కలిమి
పోటు సరిదీటుగాఁ జాట-నోటు పడిన
వాఁడొకండును లేమ నా-బవర మెల్ల
వల్లకాడాయె-నెత్తురు-బఱదలాయె   ౧౫౬

కం॥ ఆ 'యింద్రజిత్తు' పెక్కగు
నాయిదముల తోడఁ గూడి - యరదమ్ము పయిన్
ఆయిత్తంబయి దురమును
జేయ బయల్మెఱసెఁ బగఱఁ - జెండాడంగన్.   ౧౫౭

కం॥ అది మూఁడవ నాఁటి దుర
మ్మదిరో! యని పగతులెల్ల - రబ్రంపఁడగా
ముదిజొన్న కోయు నటు పగ
నుదిల కొనన్ బగఱ నెల్ల - నూటాడించెన్.   ౧౫౮

కం॥ వెఱఁ గొలుపు 'నింద్రజిత్తుని'
బరవసమును జూచి గుండె - బ్రద్దలగుడు ని
బ్బర మబ్బక కొండలకును
బరువు లిడిరి యేమిచెప్ప - వలె! దిమ్మొన్నల్ ౧౫౯

ఆ॥వె॥ త్రోవ వెంట గెల్వు - తోఁ గూడి పయ్యెర
కుఱ్ఱవోలె నట్టు - గొట్టులేక
పట్టినదియు నుదిరి పసిఁడియై చేముట్టి
నట్టిదెల్ల ముత్తె - మై తనర్చె ౧౬౦

ఉ॥ మాయల 'యింద్రజిత్తు,' మఱుమాయలఁ
జేయుచు 'సీతఁ' బోలు రూ
పే యమరించి పట్టుకొని -
యేత్తెఱ 'రాము' నెడాట మందు హా!
హా! యని కాలు కూఁతలిడి -
యందఱు నివ్వెఱఁ జూచుచుండఁ గో
కో! యని గొంతుఁగోసె నటఁ -
క్రోఁతులు హాయని పిచ్చలింపఁగన్. ౧౬౧

మ॥ 'హానుమంతుం'డది చూచి బెగ్గడిలి హా!
హా! యంచు వాపోయి, రా
మునికిం జెప్పిన పెన్వగం బొగిలి యో-
ర్పున్ వీడి బిట్టేడ్చె, ల

క్ష్మణుఁ' డున్ దోడనె 'సీత'కుం గలుగు క్రా-
కన్ విన్కి- సైరింప లే
కను దోర్లాడెను 'రాము' నద్దుకవ సో
కన్ మేను బెన్ వంతలన్ ౧౬౨

కం॥ అట్టితఱిన్ 'రాముం' డిటు
లిట్టులపున్ మదిఁ దలంచి - నెవ్వఁడు నెవ్వన్
దట్టాడు వాఁడు వేసవి
పట్టుల నేరులటు క్రుస్సి - వ్రస్సి యడంగున్. ౧౬౩

కం॥ ఏలుబడి పోయి యడవుల
పాలయి ప్రోయాలు పెఱుకు-వసపడియుసురుల్
గోలువడఁ జూచి మిన్నక
గోలవలెన్ బ్రదుక వలసెఁ-గోస కేమందున్ ౧౬౪

కం॥ అని పెక్కు తెఱంగులఁ గుం
దును బొంద 'విభీషణుండుఁ-దోడ్తో 'రాముం'
గని 'మాయ - సీతఁ' దెగటా
ర్చె నటంచు నిజమ్ముఁ దెలిసి-చెచ్చెరఁ బలికెన్. ౧౬౫

కం॥ ముప్పొక్కటి రానున్నది
చెప్పునను 'నికుంభిల' యను - జన్నము సేయన్
జొప్పడెను 'మేఘనాదుఁడు'
తప్పక యద్దాని మాన్పఁ - దగు నెట్లయినన్. ౧౬౬

కం॥ అది నెఱవేరిన వానిఁ
మొదలార్పన్ నీక గాదు – ముమ్మొనవేల్పుం
దుదిదాఁక నోర్వఁ డియ్యెడఁ
గదల వలయు వ్రేల్చి నెట్లొ – కడ తేర్పంగన్. ౧౬౭

మ॥ అనినన్ దోడనె, 'లక్ష్మణుండు' చెనెఁ గ–
య్యాం బన్నఁ గాల్దువ్వి ఆ
వ్వన నీలుఁ గవయుఁ సుషేణు హనుమన్–
బోరాడ సాయమ్ముఁ దో
డ్కొని జన్నం బొనరించు తావునకుఁ దో –
డ్తోఁ బోటుఁ బాటింప ర
మ్మని పిల్వన్ విని మేఘనాదుఁ డెటుసే –
యన్ లేక పోరాడినన్. ౧౬౮

గీ॥ కంటి కగపడు వారి ము–క్కలుగ నఱకి
దారి కడ్డిన వారి బి–ద్దమ్మొనర్చి
బెట్టిదర్చిన వారిఱం – పిల్లఁ దునిమి
దురములో నింద్రజిత్తుమా – ర్తుర నడంచె ౧౬౯

గీ॥ 'లక్ష్మణుఁడు – మేఘనాదుఁడు – లావు కలిమి
బలిమి పోరాడి పోరాడి – యెలమి దక్కి–
కొమ్మ ద్రిమ్మరు లెల్లఱుఁ – గోలువడఁగఁ
జేసి తుది 'లక్ష్మణుని చేతఁ – జిక్కువడియె, ౧౭౦

కం॥ పిడుగుల జేడివానం బలె
నెడపక విడివడక తోడుగు - లినుమడి విడువన్
గెడగూడె గెల్పు 'లక్ష్మణుఁ'
డడరెన్ మఱి 'యింద్రజిత్తు'-నడఁగెన్ ముడిగెన్. ౧౭౧

ఆ॥వె॥ పగఱ గుండెగాల-మగు 'మేఘనాదు' చా
వునకు 'రావణుండు' - మూలముట్టు
వనట 'జిలికి గుండె-పగిలి చేచ్చిన యంత
పాటుఁబడియెఁ బెద్ద - లోటు వడియె. ౧౭౨

చం॥ కొడుకిటు చేచ్చినంతట
ది - గుల్వడి యక్కసుఁ బట్టలేక ప
ర్వడి మును 'సీతఁ' జంపినది
పెల్లగు బొంకగుఁ గాని నేఁడిదే
మడియఁగఁ జేసెదంచు మది -
మాలిమి మేలిమి మాలి తూలుచున్
విడివడు తూపు వోలెఁ గను -
వేమరునన్ బయలావు లించుచున్. ౧౭౩

మ॥ వలకేలన్ బిడిబాకుఁ గైకొని యటే -
పర్వెత్తు విడ్డూరపున్
బాలదిండిం గని 'సీత' నేలకొరగెన్ -
మున్ముందు నీవిట్లె ని

చ్చెలు నేలన్ బొరలాడు దంచు తలఁపున్-
సారింప రోసమ్మురా
పాలయక్షి గట్టెదురం గనంబడియె నెం-
తో ! గోరవుం జేతలన్. ౧౭౪

కం॥ ఇటుఁదలఁచె 'సీత' యిచ్చ్చట
నటమట పడి కడవ రాని - యంగదఁ బడిమ్రు
గ్గుట కంటె నితనిచేఁ జే
చ్చుట యెంతయొ ? మేలటంచు-సుడి బడి తలఁచెన్.

కం॥ ఇఁగ రాఁగల పుట్టువునం
దగు పోటు మగఁడు 'రాముఁ - డని నెమ్మదిలోఁ
దగు విసువాసమ్మున బి
ట్టుగ సొమ్మం దగిలి యిటున - టుల్ కదలకయే ౧౭౫

మ॥ పడియుండం గని చుట్టు రక్కసలు పెన్-
వంతన్ బురాయింప నే
కడిమిన్ వీడ్వడి 'రావణుండె' యెదురం-
గా సత్తి లేమిన్ గదుం
గడు నొవ్వందుటచే 'సుపార్శ్వుఁ' డెదురన్ -
గన్గొంట వెన్వెంటనే
యడిగెన్ 'రావణు' తోడ, జోదు లిటుసే -
యన్ న్యాయమే నావుఁడున్ ౧౭౬

చం॥ కొడు కనిఁ జచ్చెనంచు నిటు-
గోలను జెంపఁగఁ దెంపుఁ బూను చె
య్యెడలను జూడఁ గ్రొమ్మగటి-
మేఁ గలదేని దురమ్మొనర్చి నీ
కొడుకును జంపువానిఁ దలఁ-
గోయుము సేయుము బీరపుం బనుల్
వెడగయి యిట్టి సేతఁ దలపెట్టిన
నిన్ను జగమ్ము మెచ్చునే? ౧౬౮

చం॥ బరవస ముండెనేనిఁ బగ-
వాని పయిం జెయిచేసి కొమ్ము నే
ర్పెఱఁ బగఁదీర్చు కొమ్మటుల-
తేకువ పోకడఁ బెట్టి యూఱకే
పిఱికి తనాన నాంధ్రఁ దల-
బీకన కాయలు సేయ నాయమే
బిరుదు మగల్ సయింప రిది-
పీడుటఁ పాడి యటంచుఁ బల్కినన్. ౧౬౯

ఆ॥వె॥ తెలిని తెప్పటిల్లి - తెఱపిలో మఱపేది
యింటిదారిఁ బట్టి - కంటగించు
నెడఁదఁ దొంటి పౌజు - నిట్లని బాసాడె
బెట్టిదంపు టాన - పట్టుఁబట్టి ౧౭౦

ఉ॥ పోయిన దెల్లఁబోయె నిఁకఁ -
బోటరి మేటుల తొంటి దండు వా
రియెడ దొడ్డసత్తిఁ గను -
పించి చెలమ్మను మించి క్రొఁతులన్
బాయని 'రామ-లక్ష్మణుల'
బల్మి మెయిన్ దెగటార్చి రండు మీ
మీ యుఱవున్ గడించుకొని -
మేలిమి తాలిమిఁ జూపి పోరుఁడీ ౧౮౧

ఆ॥వె॥ అసర తేని యాన - యయినంతటఁ దమంత
మూల లక్క-రెల్ల - బుజేము లొక్క-
మూఁడు నగుచుఁ జేనిరి - పోటున కెగబడి
దొమ్మి పోర వారు - క్రుమ్ములాడ ! ౧౮౨

కం॥ ఇరువాగు లిట్టు లెడపక
పిరుదివియక మగతనమ్ము - పెంపెనసి సరా
సరి ముందున కుఱుకుచు వీ
సర వోవక నడుముఁ గట్టి- జేగడ మొనర్పన్. ౧౮౩

ఉ॥ 'రాము'ని యుంపకోల సెక -
రాఁజుకొనన్ మును 'లంక' నద్దెసల్
బ్రామి మిడుంగురుల్ సెదర -
బల్విడి వోలె సెగల్ పొగల్ రగు

లోఁ మునుముట్ట నంతిపురి-
గోలలు పగ్వాలు వెట్ట జోదుల
ప్డే మెయి దిక్కుఁ దోఁప కెదు-
రెక్కిరి వాగుల మీనులంబలెన్. ౧౮౪

సీ॥ క్రోఁతి తేండ్ల చేతి - గ్రుద్దులాటకు లోఁగి
మూల సోఁకు మూఁక - ముచ్చ్వముడిగె
కడకు బ్రదుకువారుఁ - గాళ్ళకు బుద్దిని
సెప్పినారు దారిఁ - దప్పినారు. ౧౮౫

గద్దెము - కం॥ తిగ కంటి వేసమున. నీ
జేగ ముబ్బునడంచు పనికిఁ - జాలిన నునికిన్
దగఁ జేయ వెన్నుఁ డున్నాఁ
డిఁగ నీయానతియె నెగ్గు - నెన్నండుఁ బబూఁ. ౧౮౬



# రామ కథ

ఆ ఱవ పా లు

( యుద్ధకాండము ) 2-వ భాగము.

కం॥ బూతముల కెల్లఁ దల్లివి
వైె తఁ పిన కనికరమ్ము - నలఘియె - పొగడన్
నీతీరుఁ బోల్ప నీవగుఁ
గాత! మఱొండేది? ముజ్జె - గమ్ముల వెదుకన్ - ౧

కం॥ లంకం గలిగిన 'రావణు'
లెంకలు నంతిపురి సకులు - లెస్సగ 'రామున్'
బొంకము బింకము నెఱిఁగిరి
యింకన్ జేయునది లేక-యెంయిదిరి మదులన్. ౨

సీ॥ మలలే కదలివచ్చు - మాడ్కి నేన్గుల తోడఁ
దిమురార్పఁ దగు నర_దముల తోడ
నడకొండలను బోలు విడి కాలరుల తోడ
పయ్యెర కెన వారు - వముల తోడ
మాయురే! యనిపించు - నాయి దమ్ముల తోడ
నిమ్మైన పసిఁడి టె_క్కెమ్ము తోడ
గాలికి ఱెపఱెపఁ గదలు జెండా తోడఁ
దఱుచగు బలు వాయి - దముల తోడ

గీ॥ రతనములఁ జెక్కు బంగారు - రవణములను
గలిగి మాఱట జెముఁడనఁగా వెలుంగు
పెక్కు రాణువ సిబ్బంది - పిక్కటిల్ల
రట్టు కలగుండు పడ వచ్చె - రావణుండు. 3

సీ॥ బమ్మ గ్రుడ్డులు నొక్క - పరి ముద్దగాఁ దేర్చి
దిగ్రమింగు గుదెతాల్పు - నగడు పఱచి
ముజ్జగమ్ముల మూల - ముట్టుగాఁ బడఁగొట్టు
తిగ కంటి వేల్పును - దెగడఁ జాలి
పానల యుసురు లప్పస మాకళింపఁగ
సత్తిఁ జేకొను మిత్తిఁ - జేవుకఁ జేసి
'దక్షుని' జన్నమం - తయు బన్న మొనరించు
'వీరభద్రుని' బల్మి - వింగడించి

గీ॥ జెగము సంగిట ముల్లయి - సాదువులకు
గుండెగాలమ్ముఁ బోలి క్రొం - గ్రొత్త వెఱపుఁ
గొలుపు మెయిఁ బూని తలపించు - బలుపుఁ గలిగి
రాణువను గూడి చేనుదెంచె - 'రావణుండు' ౪

కం॥ రెండవమా అనిఁజేయఁగ
గండర గండఁడు జేగాము - గంటిమి వచ్చెన్
రెండవ పెతరులసామి యు
తండన 'రావణుఁడు' 'రాము'-దరియం జొచ్చెన్. ౫

గీ॥ ఒండొరుల కఱకు చూపు లొండొండఁ దాఁకి
వాలు టంపఱ కంటెఁ గ్రొ-వ్వాఁడిఁ గూర్చి
చూపులా! తూపులా! యేవి! యెప్పుమీరి
ముందు ముందున నెమ్మేన - సందడించె ౬

కం॥ వేసిన యలుఁగులు పొదిలోఁ
దీసిన ములుకులు మదింపుఁ దెంపుం బెంపున్
వీసర వోవక 'రావణు'
దూసి చేసెన్ వాన ముసురు దోఁచిన తేవన్ ౭

ఆ॥వె॥ గాలివాన తీరు-కంటికిఁ దోఁపక
తీరుబాటు లేక - తెఱపిఁ గనక
విడుచు కోలలకును - వెడలు.లకోరుల
కలఁతి సందుఁబోక - కలను నిండె ౮

కం॥ రక్కస గుంపులు 'రాముని'
దిక్కై చేఁతలును దక్కి - దిక్క- మొగములన్
జిక్క- నిలుచుండి చూచుట
ఱెక్కలు దెగుపక్కు- లట్లు - ఱిచ్చ పడి రటన్ ౯

గీ॥ 'రామ' రావణు లిరువురా-రటము తోడ
కయ్యమొనరించి రెవ్వరుఁ-గాని మిగులు
లేక, యవ్వెడఁ గ్రోఁతుల-మూఁకఱేని
తోఁ "విరూపాక్షుఁ" డెదిరించి- చావుఁగొనియె- ౧౦

గీ॥ అవల 'సున్మ త్తు' జేసునింటె_కంపె బలియుఁ
డంగదుం డుద్దవిడి రేఁగి_యా_సుపార్శ్వుఁ
దిరిగిరానట్టి చోటికో_త్తరపు సత్తిఁ
జూపి పంపెను పగవారుఁ - జోద్దెమంద ౧౧

కం॥ కని విని యెఱుఁగని తలఁపున
కనువు పడని పోటూనర్ప_ నబ్రంపడి మిం
టను వేల్పు లరసి యచ్చెరు
వునఁ గన్గవ మూయ లేక - పోయిరి మిగులన్ ౧౨

ఉ॥ 'రాము'నిఁ జిచ్చు టంపఱకు_
రక్కస మూఁకలు గచ్చులిచ్చుగాఁ
దీమస మేది, పాటి రొక_
దిక్కని చెప్ప వసమ్మె గొట్టెలై
వేఘరు 'రావణుం' డెదిరి_
బీరము మీరి పదేసి తూపులా
'రాము'ని మేనిపైఁ బఱప -
'రాముఁ' డటుల్ పదునైదు వేసినన్. ౧౩

ఉ॥ కింకిరి పాటు నాటి మది_
కిన్ గొదలేని చేలమ్ముఁ గ్రమ్మయి
ట్టింకులు నింకఁ గ్రోతి పదు -
పెల్ల దురమ్ముఁ దరమ్ముఁ గాక పె

న్వంకలు వాగులన్ బడిరి -
నద్దెసలంటుచు గట్టు ద్రిమ్మరుల్
సంకెలఁ దాలుకొన్నటు ప -
సన్ దిగజారిరి వీడి రోరిమిన్. ౧౪

ఉ॥ అంతట 'రావణుండు' పెర-
వారసి 'లక్ష్మణు' పైన నిండులా
వంతయుఁ జూపి 'సత్తి' విడె -
నయ్యది క్రోఁతులమూఁక సోకి యిం
తింతలు సేసి దూసికొని -
యేడ్తెఱఁ లక్ష్మణు, ఱొమ్ము నాటినన్
మంతున కెక్కు పోటరి! య -
మాంతము బిమ్మిటి నేల వ్రాలినన్. ౧౫

కం॥ అదిగని 'రాముం' డీసున
బదరి యలుంగు పయి నలుగుఁ - బఱపిన జిచ్చున్
జదలదర వెంట నంటిన
బెదరి చేనెఁ 'రావణుండు' వెఱపుం గొలుపన్. ౧౬

గీ॥ నలువలంకుల నెప్పుడే - వ్వలను గనిన
'రాము' రూపును దేజుఁ గూ - ర్పఁబడు నంప
గముల పోటులుఁ దప్ప నొ - క్కటియుఁ గాని
కంటికిం గానఁడయ్యె ర - క్కసున కపుడ ౧౭

కం॥ ఎన్నో బవరమ్ములఁ బే
రెన్నికఁ గలనేను చూడ – నీమగటిమి నీ
క్రొన్నారసంపు వాఁడిమి
నన్నల! మెట్లోర్చు వాఁడ – నని వెను దిరిగెన్. ౧౮

కం॥ 'రావణు' సకి – 'మండోదరి'
యావెత గుర్తించి యేమి – యైనం బలుకం
గా వెర వారసి పోయెను
బ్రావగదా! సకియ ప్రెగడ–వలె మగని పనిన్. ౧౯

సీ॥ అట్టి తఱి మెల్ల మెల్లన – నండ దండఁ
జేరి 'మండోదరి' యితమ్ముఁ – జెప్పఁ బూని
డాఁగి దండము బెట్టి హా – చ్ఛురికఁ దొట్టి
మగఁడు 'రావణున'కు దర – మములు వలికె ౨౦

కం॥ బేలవయి గోలవలె నిపు
డాలము విడి తలఁపు లుడిగి 'యటు నిటు బోదం
బోలె మెలంగితి విట మగ
నాలిని గొని తెచ్చు నాఁటి – కది తలఁ పవొకో? ౨౧

చం॥ పెఱ సకులన్ గనన్ గసటు –
పెంచుననన్ గొని తెచ్చు దోసముం
బఱఁగిన నీకదెవ్వ రెటు –
బల్కిన నూఁకొను కైన లేని యొ

త్తరమగు మోఱకంపు టెడఁదర్
విడఁజాలవు తొంటి పుట్టువం
దొరసిన కర్జపుం బలఁకు –
లూరక పోవునె! పొందుఁ బాయునే? ౨౨

కం॥ జగమున నిను గెలువఁగ లే
క, గరాసులు వైరి వేల్పు – గము లట్టేఁడ వీ
వగ దిగులుఁ దగిలి రుసి బలె
వగ చెడి యిట్లుంట నగరె? పగతులు సామీ ౨౩

కం॥ 'రాముం' డీసరుఁడే యని
వేమారుం బలుక లేదె! వెఱపుఁ గొనక యా
సామి సకిఁ దెచ్చితివి, యి
మ్మా! మఱల నటంచుఁ బల్క – నా! పలుతడవుల్. ౨౪

సీ॥ కాని పని యంచుఁ జెప్పిన – వాని నెల్ల
గాలఁదాఁచితి వవియిప్డు – కట్టికుడిపె
దొసఁగు తెకతేర వదలునా! తోడుసుఁ 'గూర్చుఁ'
గాని తటి నిత వేని యు – క్కఱను రాదు– ౨౫

కం॥ పలుమరు నీకడ దరమ
మ్ములు చెవిటికిఁ జెప్పినట్లు – బొందొడ గూర్పం
బలికియు వినమిని లాబము
పొలయక వితయయ్యెఁ గర్జ–ములుఁ బొనుగు పడెన్.

ఆ॥ వె॥ పగఱఁ జెంపు టొండెఁ—బగఱ చేఁ జచ్చుట
యొండె గాక ! బీరముడిగి మూల
ముడిగి యసద వోలె – నడఁగారు టిది యెల్లఁ
దొల్లి యసము గోట – గిల్లు టగును ౨౭

చం॥ అని యిటు పెక్కు వక్కణము –
లాడిన మాటిడ లేక మోముఁద్రి
ప్పి, నగరి లోని కేగి గెలు –
పే, తల పోసి తిరమ్ము డెందమం
దెనసిన సిగ్గు దట్టమయి, –
యెట్లయినన్ దనలావు కల్మి గె
ల్పును గొని రాక మాననని –
పొంపెసలారు తలంపు పెంపునన్ ౨౮

ఆ॥ వె॥ వానకారు మొయిలు—లో నొక్క తఱి నిక్క
మెఱపు వోలె రోస – ముర వడించి
యున్న బలిమి కంటె – నువ్వెత్తు పగఁ గొని
'రాము' నెదుర వచ్చె – 'రావణుండు' ౨౯

కం॥ 'రావణు'ని వింట వదలం
గా వెడలిన 'సత్తి' వలనఁ – గలనం బడియెఁ
లావు చెడి 'లక్ష్మణుండర
చావుం గని 'రాముఁ' డవల–జెడిసి యిటు లనెన్ ౩౦

కం॥ అడవుల నిడుమలఁ బడయుట
బడలుదునా? యాలి వీడి _ వగ చెదనా? త
మ్ముఁడు సౌమ్యసిలఁ గనుంగొని
సుడియుదునా? దిక్కు లేక _ స్రుక్కుట దక్కెన్. 3౧

ఆ॥ వె॥ ప్రొద్దు వంగడంపుఁ బుట్టువు నేఁడిట్టు
చేవఁ దఱిఁగి కలనఁ_ జిక్కుఁ బడియె
యిప్పుడేది? వెరవా! యెయ్యది తెరువెట్లు?
సేయువాఁడ మేలు_సేయు నెవఁడు? 3౨

కం॥ అని వనరి దవ్వు తలఁపుం
గొని స్రోఁతుల తేనిఁ జూచి_కొసకొక యుక్తిన్
విన వలతు ననిన 'రాముని'
కనె ముదుసలి_జాంబవంతుఁ_డనువగు పలుకుల్. 33

కం॥ కలఁడుఁ గదా! 'హనుమంతుఁడు'
బలియుం డవ్వాని వలనఁ బని నెఱవేరున్
వెలలింపు మచేట 'కరణులుఁ'
గల మలకును బోయి వానిఁ గైగొని తేరన్. ౩౪

కం॥ నావిని 'రాముఁడు' 'హనుమను'
రావించి కడంకఁ దెలిపి_రమ్మా! తొరగా
దేవలయుఁ 'గరణులను' బొ
మ్మా వేవినదాఁక మసలు_టది కూడ దనన్. 3౫

మ॥ అడుగుల్ దోఁయి కుదించి నేల యను దూ-
యన్ మోపి కుప్పించి తా
మెడనిక్కించి మొగమ్ము నెత్తి నిడుపై -
మెండై నిగారించి పెన్
సుడులం ద్రిప్పెడి తోకయాకసముక -
చ్చుల్ హెచ్చఁబర్వెత్తెన
క్కడ వారందఱు సంబరంపు టెడఁదన్
గన్వొందుమై చూడఁగన్ ౩౬

కం॥ అనుమంతుఁ డెగురు నప్పుడ
కనఁబడె మఱు నిముస మందుఁ గంటికి నలుస
ట్టునయినఁ దోఁపక వినువీ
దిని జూడ నెఱుంగ నగునె? - తెలివరి కయినన్. ౩౭

కం॥ తన వంగడంపుఁ దేజటఁ
బొనుపడ రక్కసుఁడు పోరె-పో! యని వగపుం
గొని ప్రొద్దుఁ గ్రుంకె నిరులును
బనుపడె వినువీది-నలుపు వన్నె వెలార్చెన్ ౩౮

ఆ॥వె॥ దవ్వు పోక వలన - దప్పిక పెల్లయి
యట్టు లిట్టుఁ జూడ - నచేట 'మాయ
దారి కాలనేమి; తబ మొనర్చుచునుండు
టరసి దూఁపునాపు నాసఁ బోవ ౩౯

కం॥ 'రావణు' పనుపున బన్నముఁ
గావింపం బూను కోన-కాఁపరిఁ గని సా
మీ ! వేఁడికోలొకటి వినఁ
గా వలతున్ దూఁపటిల్లి-కళవళ పడితిన్. ౪౦

చం॥ అనవిని 'కాలనేమి' బళి-
రా ! యిది రాముని కర్జమాట, నే
నును జెలికాఁడ నౌదును, గ-
నుంగొను మల్లదె మడ్గు దానిలో
ననువుగ నీరువట్టుడిపి-
యీవల రండన 'హన్మ' వేగిర
మ్మునదిగి నీరుఁ ద్రావు తఱి -
ముందఱ కాల్మొసలట్టె పట్టెనన్ ౪౧

కం॥ వంచేన యని తెలిసి మెయిన్
గుంచించియుఁ గడుపు దూరు-కొని మఱి బలకా
యించి బయల్మెఱసిన నసు
రుంచక పోఁ ద్రోయ మొసలి-యువిదగ మారెన్. ౪౨

సీ॥ 'ధాన్యమాలిని' యను వేల్పుఁ దలిరుఁ బోఁణి
మున్ను 'శాండిల్యు' తిట్టుచే బన్ను పడుటఁ
దెలిపి యీ 'కాలనేమి' మా-యల బికారి
త్రుంచి నీ పని నెగ్గింప-నెంచు మనిన - ౪౩

క॥ 'మారీచు'నికి ననుంగుఁ గొ
మారుండగు 'కాలనేమి' – కడకుం జన వా-
డారసిఁ యుసురిడు మందిటఁ
గూరును నీవాజ్ఞే కాన్క – నొసఁగి కొనుమనన్. ౪౪

క॥ పిడిగుద్దులతోఁ గానుక
నిడెద నటం చాడి జేముని – యింటికి విందుల
గుడువం బంచి వడిన్ బ
ర్విడె 'ద్రోణముఁ గన్గొనంగ – వేగుం బోలెన్. ౪౫

క॥ చేని చేని యమ్మూలఁ గని బ
త్తిని వలగొని వేడి కోలుఁ – దెలిపి పయనమై
తన వచ్చుదారిఁ బడు చెడు
గును విడివిడిగాఁ దలంపుఁ – గొని పలుమారుల్. ౪౬

క॥ జరిగిన కత యంతయుఁ దా
నెఱిఁగించిన మిన్నకున్న – నిటు గాదనుచున్
బెఱికి యఱచేత నిడి చేను
సరికిన్ గాఁపరులు నెదిరి – జగడము సేయన్ ౪౭

ఆ॥వె॥ వేల్పు పాటగాండ్రు – వెంటాడి 'హనుమంతు'
నడుగు సాగనీయ – కడ్డుఁ దవిలి
గోరమైన పోర – దొరింప జేతపడ
వారినెల్ల నడచి – దారిఁ బట్టె ౪౮

గీ॥ 'మాల్యవంతుండు' 'రావణు' – మాటఁ బట్టి
'హనుమ' నడి సంద్రమందు ముందడ్డగింప
బరవసమ్మున నెక్కటి బవరమందు
'హనుమ' చేఁ జచ్చె – నింక నెట్లబ్బె? యనుచు ౪౯

కం॥ వేగిన పని చెడు నని కడు
వేగిరపడ మందుకొండ – వెలుతురుఁ దోఁచెఁ
వేగుం బోక తెఱంగున
బాగరి 'రాముండు' ఱిచ్చె – పడి యడలు పడెన్ ౫౦

కం॥ చెంతం గల కాలరులా
వింత నిజే మ్మొఱఁగి కొంత – వినిపింప మదిన్
సంతసపడె 'రాముఁడు' – హను–
మంతుఁడుఁ గొనివచ్చె మందు–మల నపుడపుడే! ౫౧

ఆ॥వె॥ గాలి సోఁకి నంతఁ – గదలాడె 'లక్ష్మణుం'
డదిర! తేజుఁ గూరి – నిదుర నుండి
లేచు మాడ్కి వచ్చె – లెంకల యుసురులు
మఱలి వచ్చె బలిమి – గుఱుతు హెచ్చె– ౫౨

గీ॥ 'స్థూలజంఘుఁడు' 'హనుమపై – సూడుఁ గూడి
పోడుఁ గొట్టునటుల్ దుర – మ్మున గలంప
తారుమాఱయ్యెఁ బగఱవి – తాకుఁ జెంది
తుదకు 'హనుమంతు చే దెబ్బ – దోరి పడియె ౫౩

కం॥ తడి జొన్న లారఁ బోసిన
వడువున రిక్క లొడఁగూడె - బయలున కేరా
యడు వొడమెఁ, గోళ్ళఁగూసెను
బడిబడి తెల్లగను దెల్ల - వారెఁ మీరెన్ ౫౪

గీ॥ అపుడ రక్కెస యొజ్జె డాయంగఁ బిలిచి
'రావణుఁడు' మంతన మొనర్చె - 'రాము' గెలుచు
యుత్తి యొక్కటి చెప్పుమం - చొత్తి యొత్తి
'సుక్కరుఁడు' వ్రేల్మి సేయఁ దావక్కణించె ౫౫.

కం॥ నలువలఁకుల రక్కసులను
బలువిడి కాఁపుంచి సడ్డ - పడి యక్కఱ న
ర్మిలి నేలయాడుగు జన్నము
సలిపెను జిదగొదలు మదిని - సదమదమునకై ౫౬

కం॥ నేల దిగఁదలను జేసిన
వ్రేలిమి పొగలంత కంత - వినువీదిని బి
ట్టోలిం గ్రమ్మ 'విభీషణుఁ'
డాలోఁ గని 'రాము' చెంతఁ - కరిగి యిటులనెన్. ౫౭

ఆ॥వె॥ అన్ని యాసలుఁడిగి - యడియాస సుక్కరు
నాన నేలపాదు - నంద వ్రేల్మి
నూని చేయుపూన్కి - నున్నాఁడు మాయన్న
బన్నపఱుప నిదియ - పట్టు మనకు ౫౮

ఆ॥వె॥ గోటఁ బోవు దాని - గొడ్డలిచేఁ ద్రుంచ
నేల? వైళమేగి - యెట్టులైన
నది బఱీతుఁ జేసి - నంతట్ట నెనలేని
మేలుఁ గలుగు గీడుఁ జాల తొలఁగు ౫౯

కం॥ ఆమాటలు విని నంతట
'రాముం' డఱమఱికఁ గ్రోఁతి-రాణువఁ బంపన్
బ్రామినుకు లట్టి యానకు
నా మల్లదిమ్మరులు జెన్న - మటమట పఱుపన్ ౬౦

కం॥ చేనె నంగదుఁ డాదాటున
కును బడవాలగుట మెండు - కొని పోఁజునకున్
మునుమున్న బఱపె జెన్న
మ్మును బన్నము సేయ గోర - పుం బోటాగ్గన్ ౬౧

కం॥ పట్టుదలఁ బూని ప్రేల్మిడి
నెట్టయినన్ నెగ్గు నట్టు - లిట్టలపు మదిన్
గట్టుప కాసయి చేసెడి
పట్టున "నంగదుని" దాడి_బలకాయించెన్ ౬౨

కం॥ కొందఱు మీసలఁ బెఱికిరి
కొందఱు నొదలను వంచి-గ్రుద్దిరి మఱియుం
గొందఱు గడ్డములూఁపిరి
కొందఱు ముందునకు నెట్టి - కొట్టిరి మిగులన్ ౬౩

సీ॥ గాలితాఁకని దివ్వెయు - పోలె నివము
గట్టువలె జోగి డెందమ్ము - పట్టుమాడ్కిఁ
గట్టుకదలక ప్రేల్మిడి - పట్టువిడక
చేయుచున్నట్టి 'రావణు' చేఁత లరసి ౬౪

కం॥ ఇటు గాదని 'యంగదుఁ' డ
చ్చోటు విడి యంతిపురిఁ జొచ్చి - చయ్యన దెచ్చెన్
కట! కట! 'మండోదరి' నా
దట జెన్ను మొనర్చు మగని - దగ్గఱ కంతన్. ౬౫

ఆ॥వె॥ వడలి వనరి వగచి వాపోయి వందురి
వసముఁ దప్పి విసివి 'ప్రాలి' వనట
వెక్కి వెక్కి యేడ్చి - నెక్కిళ్ళుఁ బుట్టి 'నం
గదుని' చేతి బొమ్మ - గా మెలంగె ౬౬

కం॥ అడుగులకు మడుగులొత్తెడి
వడఁతుక - 'రావణుని' ప్రోలఁ - బడి యెలుఁగున్ రా
ల్పడ నేడ్చి యెంతఁ జెప్పిన
విడువవు నీయుడుముపట్టు - వింగడపు మదిన్ ౬౭

ఉ॥ 'సీత'ను దెచ్చుటన్న నొడిఁ -
జిచ్చున గట్టుటంచు లంకనున్
బొఁతగలించుటంచు మన -
వంగడముం జెడఁగూల్చుటంచు ని

న్నేతఱి ‘రాముఁడే’ యటము -
టించు నటంచెద దట్టి చెప్పనే ?
పూఁత మెఱుంగు చేఁతలకు -
బోరగిలన్ గడకట్టులోఁ గదా ౬౮

కం॥ ‘రాముఁ’ డొక మేనితాల్పని
నీమది నెంచితివి యిద్ది - నేరము సుమి! యీ
భూమిని మునిగితిం గూర్పఁగ
సామిగదా! వారి కొరులు - సరి రాఁగలరా? ౬౯

కం॥ పుడమిని దొడరిన చెడుగులుఁ
దుడుపఁగఁ బదివేసములను దొడరి కనటుఁ బోఁ
గడిగి నిడు పున్నె మడరం
గడు దరమము నిలిపి నట్టి - కర్జము లొర్చెన్ ౭౦

కం॥ జగముల గెలిచిన నిన్నే
తెగటార్పఁగ వచ్చినాఁడు - దెప్పరమగు నీ
యగ చొట్టుఁ బోవు ‘సీత’ను
దగనిమ్మా! చెప్పుకొనుమ! - తప్పేయనుచున్. ౭౧

కం॥ అంతటి వాఁడొకఁడు జగం
బంతయు దివెఁబట్టి వెదక - నగపడునే ? యీ
మంతన మెఱుఁగక చేసితి
వెంతయుఁ దప్పిదము లుడుగు-మీ! యికనైనన్ ౭౨

కం॥ కడకొక్క మాటఁ జెప్పెద
నడుగులఁ బడి కొడిమఁజేసి _ తని మన్నింపం
గడఁగుఁడని 'సీత' నిడి నీ
యెడఁదలఁపుం దెలుప నాతఁ_డే! మన్నించున్ ౭౩

కం॥ కనికరపు సంద్రమగు 'రా
ముని పుట్టు వెలుంగువారు _ ముగితిం గనరే?
మును రుసులాతని యదుగులఁ
గాని ముగితిం జూడఁగానరె! కొల లుడిపోవన్ ౭౪

కం॥ తటి దాపురించు వారికి
దరమపు సేఁతలును మదికిఁ _ దట్టవు నితవుం
బురి కొలుప వినరు _ పుట్టుక
బెరసిన గానము లుడివోవ – వెర వెటులుండున్ ౭౫

కం॥ నీయునికి మనికి సిరిఁ గన
మాయురె! యెవ్వారికిట్టి _ మనుగడఁ గలదే!
యీయెడ నినుఁ గనఁ బానము
లేయెడగోఁ బోయెఁ జేయు _ టేమున్నదిఁకన్. ౭౬

కం॥ నీకాలినయ్యు, నీపని
చేకొనులాబమ్ము నిన్నుఁ జెందును గానీ
నాకెట్టు లడరు నెవరెవ
రేకర్జ మొనర్ప వారి _ నెనుయుట లసదా? ౭౭

ఉ॥ వేలుపు లెల్ల నీయెదుర -
వెట్టి పనిం బొనరింప రాణినై
త్రేలిమి సాదమున్ గుడిచి -
విన్ననువొప్ప వెలింగి యీవి ప్రమా
న్యాలు కడింది తావులు గుబుల్కొన
వేనలి నుంచు నేను నీ
యాలరి క్రోతి యీడ్వ నిటు -
లక్కట! వచ్చితి సాము సచ్చితిన్ ౭౮

కం॥ అని చెప్పిన మండోదరిఁ,
గనుఁగొనలన్ జంద్రనిప్పు - కలు రవరవ మం
డిన వెఱచి పఱచె 'రావణుఁ'
డనఁ దెలిసిన మోఱకుఁడుఁ గదా! తలపోయన్ ౭౯

కం॥ 'మండోదరి' చేనఁ గ్రోఁతుల,
దండు చెకాపికిని మూఁగి - దళవాయి యితం
బండఁగొని యెదుర నిలఁబడి
గండు మగంటిమిని జూపఁ - గా రావణుడున్ ౮౦

సీ॥ పట్టుదల నేటఁగలిపి క్రొ - వ్వాఁడి వేఁడి
గుద్దులకుఁ దట్టుకొనలేక - కొసకు చేయు
జెన్నమును విడి యదికొన - సాగ కునికి
వగచి రోసమ్ము పోసరిం పఁగను లేచి ౮౧

సీ॥ తొమ్మిది రతనముల్ - తొంగి చూచిన తేవ
సిరమున బొమిడిక - తుఱఁగలింప
వ్రేల్మిడి గుండాన - వెలుఁగు నిప్పుల మాడ్కి
నెఱుపు డాల్కను గ్రుడ్డు - లురవడింప
బమ్మ గ్రుడ్డొక దెబ్బ - బ్రద్దలుఁ గావించు
సత్తి నార్బాటమ్ము - చౌకళింప
పది మొగమ్ముల పండ్లు - పటపటఁ గొఱకుచో
దెసల వాయిదముల - తీరుఁ బెంప

గీ॥ నొక్క పరి నేడుసంద్రముల్ - గ్రుక్కఁగొనఁగ
జేతనుపడు పాఱుటసర నాఁ - జెక్కవచ్చె
బూమి వడకఁగ బూతముల్ - పొనుఁగు పడఁగ
రక్కెస కొలంపుఁ దలగుండు - 'రావణుండు ౮౨

కం॥ తలగాము ప్రొద్దు నడ్డిన
బలుపున సప్పమ్ము గరుడి - బొరింబడు న
ట్టులు నేన్గు సింగ మెదురున
టులు 'రావణుఁ డొత్తె రాముఁడును నిలఁబడియెన్

కం॥ అరదమ్ము లేనుఁగులు వా
పురములుఁ గాలరులఁ గూడి పొంగిన సంద్రం
బురడించివచ్చె 'రావణుఁ'
డురవడి పరువడిని బరువు - నుదిల కొనంగన్. ౮౪

మ॥ జెగముల్ గ్రుక్కఁ గొనంగ నేచు నటులా-
సల్ ముందుఁ బర్వొత్త స
త్తి గడెత్తున్ మల ద్రిమ్మరుల్ దురమునన్
దీంద్రంబు వేంద్రంబునన్
దెగటార్పన్ మది నెంచి ముందుఱికెఁ, గా-
నీ కాని తోయమ్ము నం
దగచాట్లం జెలిచీమలన్ బుడమి తా
ల్పల్లాడునట్లై వడిన్. ౧౫

కం॥ తన్నెఱుఁగ కెదిరి నెఱుఁగక
మన్నందిను పాము వోలె - మది విడి కన్నన్
మిన్నరయక గరువమ్ముపై
కొన్నటు దనుదాను బాఁగడి-క్రోల్ గావించెన్ ౧౬

చం॥ వలఁకుల తేండ్ల నెల్ల సిగఁ-
బట్టి వెలార్చితి వెట్టి చాకిరిన్
సలుపఁగఁ జేసితిన్ జెముని చేట్టలు
వాపితి వేల్పుతేనికన్
బులిమిడి నన్నుమించేఁగల-
పోటరి నేఁటి జెగమ్ము నందె క
న్నులఁ గనరాడు నీవిఁక న-
నున్ దురమం దెదిరింప నోపుదే ౧౭

శా॥ ఈసున్ రోసము మీసరమ్ముగుట న-
 డ్డేనారి సారించి పై
పై సందీయని చిచ్చుటంపజుల నో-
 వ్వం గ్రువ్వఁగాఁ బల్కె రా
కాసీ! పోటు మగండవైన నెదురం-
 గా గమ్ము నీపై మదిన్
గోసున్ బాసట గాసిఁ గూర్చెదను గై-
 క్కోల్ దుంత రాతౌనసన్ ౮౮

చం॥ గొనకొని రాముఁడిట్లనియెఁ-
 గోడిగపుం బొగడింపు లున్న వా
రనువుగఁ జెప్ప రెప్పుడుఁ ద-
 మంత మగంటిమిఁ జూపి చెప్పఁ బొ
ల్గొనుటది సాజ మియ్యెడఁ ద-
 గులొక్కని పల్కుటఁ జూడ నేతిబీ
రను నెయి యున్నటుల్ దెలిసె-
 రామా! మానుమ జొల్లు మాటలన్ ౮౯

కం॥ మగఁ డండలేని యొంటరి
మగువను దొంగిలితి వెంత - మగటిమిఁ గలవాఁ
డగుదువా! యెఱుఁగక, ఛీ ప్రే
లఁగ సిగ్గును లేదె! నీదు - లావొక లెక్కా! ౯౦

కం॥ నీలోఁ బగతుఱ నాఱ్వుర
నోలిన్ గెలువంగ లేక - యొరు గెలుతు నటం
చాలమున నిలుచు నీబం
డాలము నేనెఱుఁగనే? బడాయి, గరాసూ! ౯౧

కం॥ దరమమ్ము లేని బరవస
మురలిన జెగమునకు మేల్మి-యొదవునె? నీలో
దరమము బరవస మఱిగొఱ
వఱలని నీవొక్క- పుట్టు - వా! పరికింపన్ ౯౨

కం॥ లావున్ జేవయుఁ గలదని
కావరమున నొరుల కల్మి - కై నోఁచిన నీ
ప్రావఁ బెడ నిప్పు డనిలోఁ
గావించెద మార్పుఁ దీర్పుఁ-గడు నేర్పు మెయిన్ ౯౩

కం॥ సిగ్గింత లేక దోసపు
టగ్గింబడి యొడలుమండి - యటమటపడి పై
నెగ్గులు సెగ్గులు పెగ్గెలు
బిగ్గఱగాఁ బలుకు టొక్క - బీరమె, చెప్పుమా! ౯౪

ఉ॥ నేనొక పోటు జోదునని -
నిక్కెదు నీసరి వారు పోరిలోఁ
బానము లూడ్వ నప్పుడెటుఁ -
బండితివో! యెఱుఁగన్ గొమారుఁడొం

డేనియు దక్క - కేగినపు -
డెక్కడ నుంటివో! యిప్డె నిద్దురన్
మానితివో! బడాయి నిఁక -
మానుమ! పూనుమ పోరొనర్పఁగన్ ౯౫

గీ॥ ఒడలు మండి బదుల్ వల్క - నోడి కనులఁ
జింత నిప్పులు రాల ని - సీ! యటంచు
సీదరించి కనారిలి - చిందు వందు
నైన డెందాన 'రావణు' డంగలార్చి ౯౬

గీ॥ కనఁబడిన వారినెల్లఁ జీ - కాకుపఱచి
చిక్కువారిని వలిబిలి - చేసి పాఱి
పోవు వారిని వెంటాడి - పొంగడంచి
బవరమును దోచి బగ్గము - పాడుఁ జేసె ౯౭

ఉ॥ ఆఁకలిఁ గొన్న సింగమటు -
లాదర బాదర ద్రంత వెల్వడన్
దూఁకి మెకాల పైనఁబడి -
తొందర దందడిఁ జిందు వందుగాఁ
బోకడఁ బెట్టు కట్టడిని -
బోరిత మూని యెదుర్చు క్రోఁతులన్
నూకలు పిండినిన్ దునియ -
నున్ దుమురున్ దువఁ జేసి తూర్పిడెన్ ౯౮

ఉ॥ మూఁడవ నాఁటి పోటగుట -
ముమ్మరపుం బగఁ బూని ఆమ్ముపైఁ
గాడఁగ నేయ వాఁడిఁగల -
కైదువుఁ గైకొని త్రుంచి వెంటనే
వేఁడి వెలుంగు లుబ్బఁ గనువేదురుఁ
గూర్చు నలుంగు వేసెఁ గ్రొ
వ్వాడి మగంటిమిన్ బోరయఁ -
బల్మరు-'రాముఁడు'-'రావణుఁ గడున్ — —

ఉ॥ సోడగలింప నొంపఁ దలఁ -
జొచ్చి చేనన్ బరిగోల వేసినన్
వాఁడి మెఱుంగుఁ గోల నది -
వ్రయ్యలు సేసిన 'రాము' డంతటన్
మూఁడు లకోరు లొక్కమొగి -
ముమ్మొన వాల్సరిపోల నేసినన్
వాఁడెఱుకన్ బదుల్ వదలె -
వాఁడి సరమ్ము లొకం డొకండునై ౧౦౦

ఉ॥ చిచ్చుమియన్ లకోరి గొని -
చెచ్చెర వేసిన 'రావణుండు' ము
చ్చిచ్చును గ్రక్కు తూపుఁ గడుఁ
జిందర వందరఁ జేయఁ గిన్కపై

పెచ్చు మదిన్ బెనంగి సెల -
వేసిన నయ్యది ప్రక్కలించి నే
ర్పచ్చు వడంగ 'రావణుఁడు' -
నంపగుముల్ పదునేడు వాడుచున్ ౧౦౧

చం॥ పొద విడివడ్డ సింగమటు -
పొంచి కుఱుంగటఁ దారి పై పయిన్
వదలిన తూపు లేపు మెయి -
వచ్చినఁ గచ్చెఱ వచ్చి 'రాముఁడ'
య్యదనున వాడి యల్లు లోల -
యన్ విరజిమ్మిన నవ్వి తేరినిన్
జిదగొాదఁ జేయ వాఁడుఁ గది -
సెన్ మఱి యొండరదమ్ముఁ జేరఁగన్ ౧౦౨

శా॥ చూపున్ దూపు నొకం డొకం డురవడిం -
చున్ మించు రాకాసిపై
నేపుంజూపి యదల్పుఁ బ్రేల్చు మెయి వాఁ -
డేటార్చి బిట్టోర్చి ముం
గోపున్ వాఁడి సరమ్ము లేయ నడుమన్
గూలార్చె 'రాముండు' బి
ట్టోపం జాలని చిచ్చుటల్లు గమి చే -
నూటార్చె నా రావణున్ ౧౦౩

కం॥ హోరాహోరిగ నిరువురు-
తీరుబడి యొకింత లేక - తెగబడి యంపా
ధారమ్ము వడువుఁ నెక్కటి
పోరన్ వినువీధి వేలు - పులుఁ గనిరెలమిన్ ౧౦౪

కం॥ ఓరంత ప్రొద్దు విడువక
పోరాడఁగ నుప్పరమ్మె - పోలి కలనయ్యెన్
బేరెమ్ము వాఱు వెడఁద - ల
కోరులు బిట్టావరించి - కోకొల్లలుగాన్ ౧౦౫

కం॥ బూమిపయిన్ నిలుచుండియె,
రాముఁడుఁ గంచరము నెక్కి--రావణు! డెదురం
గా మంచిది కాదని తో
డ్రో! మిగులన్ వగచి కడకుఁ- దోరపు టెడఁదన్ ౧౦౬

కం॥ వేలుపు టేలిక యయ్యేడ
జాలిన్ సాయమ్ము సేయు- జేతనమ్ము మెయిన్
మేలున్ గూర్పఁ దలంచుఁడు
మాలిమి మేలిమిని దలఁచె-'మాతలి' సంతన్ ౧౦౭

కం॥ తూరుపు దెస దోర - 'మాతలి'
రా రమ్మని పిలిచి వేగి - రమ్మున మనకై
పోరాడె దరమమోమఁగ
నారామునికిమ్ముఁ దేరు-నటఁ గొని పోమ్మా! ౧౦౮

సీ॥ పదునాఱు పసిఁడి కం - బాల్ నాలుగంచులఁ
దామర కెంపులఁ - దళుకులీనఁ
బంచల ముగుద రా-యంచల మిడి నుదుల్
పొందించి పీనుల - విందు గూర్పఁ
దొమ్మిది రతనాల - తోఁ జెక్కడపుఁ బనుల్
చూపఱులకు వేఁగు-దోఁప జేయ
తమ్మి గద్దియ కుద్ది - యిమ్మగు నడికట్టు
పలుగు ఆ గద్దియ పొలుపుమీఱ

గీ॥ మెఱుపు టెక్కెవల పిల్లిక - న్ను రతనమ్ము
నొగలు పగలింటి దొర దొర - యఁ గల వెలుఁగు
నలుపలంకుల జిలుఁగులు - వెలుఁగు చుండ
నరద మొక్కఁడు 'మాతలి'-యటకుఁ దెచ్చె ౧౦౯

కం॥ ఓసామి! దరమ మోమఁగ
గాసిం బడు మీకు మేల్మిఁ-గావించుటకై
మాసురతాణి, యె పని చెను
మీసరమగు తేరుఁ బోణి-మివి గయికొనుఁడీ ౧౧౦

కం॥ అని యొసఁగిన 'రాముండో'
య్యని వేలుపుఱేని తేరు-నందుండియె తా
నని సేయ మొదలిడెన్ ముది
యని వారలు తెప్ప వేయ-కటఁగ నిరహాహా! ౧౧౧

కం॥ 'లోపాముద్ర'కు మగఁడయి
యేపారు 'నగస్త్యుఁ' డవేటి _ కేతెంచి మదిన్
బ్రాపైన తలపుఁ 'రాము'ని
కాపోవఁగఁ జెప్పి నంత _ నతఁ డాలించెన్ ౧౧౨

కం॥ జగములు నీచేఁ బొడమును
జగములు నీవలననడరు _ జగములకెల్లన్
ముగితి నిడునీకు నేవే
జగ నుడువం గలనె! యీస_రుఁడ వీవగుటన్ ౧౧౩

గీ॥ ఐనఁ బల్కెద మంతన_మైన దొకటి
యదియ గుర్తింప గెలుపు నీ_కగ్గమగును.
నీకొలము సామి. చెయువుల_సాకిరిని ద
లంపు మవ్వాని మేలుఁ ద_లంపఁ దలమొ? ౧౧౪

కం॥ తమ్మిదొరఁ గొలువఁ గోర్కులు
గ్రమ్మర నెగ్గునని పలుకఁ_గా వినుకలిచే
నెమ్మది బత్తిని గొలిచెను
తమ్ములల విందును మఱెంత_తనివారు మదిన్ ౧౧౫

గీ॥ 'అగ్నివర్ణుండు' 'రాము'తో _ ననిఁ బొనర్ప
వచ్చె నట దుంత యెకిమీఁడె _ వచ్చె ననఁగ
వాని యురవడిఁ జెప్ప వీ_ల్గాని దయ్యె
వాని డంబాలు వినుటకే కాని వావి ౧౧౬

మ॥ దెసలేలం గల పాళెగాండ్రు కలనన్-
దీటింత లేకున్కి దీ
మస మొప్పంగ నగరందు చాకిరిని నే
మం బొప్పఁ జేయుంతు న
క్కసుఁ గొన్నన్ మరుగొంగ బన్న పఱుతున్-
గన్నెత్తి కన్గొన్నఁ జో
బసుమం బోమరు నీవు నీకొలువరల్-
పల్కేల పెక్కాడఁగన్ ౭

కం॥ అని తీండ్రంబగు రోస
మ్మున 'రాముని' పైన నూరు - ములుకులు వేసెన్
మునుకొని నడుమనె వానిం
దునుమాడి యలంతి వాని - తోఁ దలపడినన్ ౧౧౮

గీ॥ ఒండొరులు వెను దివియక - మండుటగ్గి
వోలెఁ గినుక రవల్ రేఁగి - బులియు దివియుఁ
గ్రమ్మ్రదే రంగ 'రాముండు - కత్తి దూసి
వాని తలఁ బట్టి యూడ్చి బి-రాన నఱకె ౧౧౯

కం॥ డంబాల కోరు 'రాముని'
యంబుల సెక మచ్చెముడిఁగి - యటు నిటు లనిసే
యం బొలుపోక చెచ్చెను
డంబము సత్తెమ్ము కడ ను-డాయింప చోకో! ౧౨౦

కం॥ అంతట 'రావణుఁ' డెదిరిని
బంతమ్మున గెలువఁ బూని - బరవసమున నొ
క్కింత దరిఁ జేరి 'రాముని'
వింత లకోరిం దవిల్చి - వేసిన దోడ్తో ౧౨౧

మ॥ పది నూరంచుల వాలుఁ బోలు సరమొ
ప్పన్ వింటఁ జేకూర్చి ని
మ్మదిఁ దూంట్లుం బొనరించి యావలకుఁబో-
వ్రమ్మన్నాటు మై 'రావణుం'
డెదురన్ గుండె గబీల్మనటుం చెదర నెం
తేఁ దట్టుకోఁ గల్గి తెం
పొదవన్ వందలు వేలు కోలలును వే-
యున్ డాయు రోసమ్మునన్ ౧౨౨

సీ॥ పాఁప జే తూపులుఁ - బఱపిన వెనువెంటఁ
గరుడి కోలుల చేతఁ - గట్లువిప్ప
నీటి యల్లులను ము-న్నీ రేర్పరింప వా
ర్వపుటగ్గిచే దాని - బన్నపఱచు
మంచు దారి_లకోరి - మించి మబ్బుంగూడ్ప
గాలి యమ్ముల దానిఁ - గడకునెట్టు
కసటు పిసాసి నా - రసమేయఁ దోడ్తోడ
బూచుల తేని చేఁ - బొంగడంచు

గీ॥ ఇరువు రిటు చేతికొదవి దగ్గఱఁ గలట్టి
నారసము లీరసముఁ బూని-పేరు మిగులు
నట్టి వెన్నియో? వేసి క-య్యమ్ముఁ జేసి
రయిన నొక్కరు జేకొట్ట - ననువు పడమి ౧౨౩

కం॥ పెక్కు రకమ్ముల యమ్ములు
దక్కన రావణుని మీఁదఁ-దడవ తడవ పెం
కెక్కఁగ మార్చి విదిర్చిన
నక్కలల సెకల కార్వ-కార్పులు వట్టెన్ ౧౨౪

కం॥ మున్నెన్నఁడు కని-విని తలఁ
ప న్నెగ్గని పోరు జరిగెఁ బదఁపడి యిటుపై
నెన్నండుఁ జూడఁ జాలని
యెన్నందగు కయ్య మయ్యె-నీ నాఁడవావో! ౧౨౫

కం॥ అట్టియెడ 'రావణు'డుఁ దన
కట్టెదురఁగ మెలఁగు 'రాముఁ'-గని రామా! నే
నెట్టిఁడనో? యెఱుఁగవే? నీ
యెట్టెదురఁగ జేయు దురము-నెగదిగఁ జూడన్ ౧౨౬

ఉ॥ నీవొక మేని తాల్పవని -
నెమ్మది నమ్మి దురమ్మొనర్పఁగా
'రావణు' నన్నెదిర్చితివి రామఁ -
ననుఁ గనినంత నీమెయిఁ

జేవ యదెట్టులో చెదరి -
 చిందర వందరఁ బొంది నెమ్మదిన్
తావులుఁ దప్పి యూపిరి
 హుటాహుటిఁబోవు నిజమ్ము సుమ్మిఁకన్ ౧౨౭

చం॥ తునిమితి గట్టుదాయఁ బడఁ -
 ద్రోసితి నగ్గిని దుంతరాతునున్
బానుపడఁ జేసితిన్ బయర -
 మూలకుఁ దోలితి వల్లెతాల్పుఁ ద్రు
ళ్ళణఁచితి సోఁకుతేనిఁ దెగ -
 టార్చితి నీసరు గెల్చితిన్ గుబే
రుని బాగరార్చితింక నెవ - రున్
 ననుగెల్తురు నిల్చి పల్కుమా! ౧౨౮

గీ॥ అనిన 'రావణు' డంబమ్ము - లాలకించి
తన దొసంగు నెఱుంగని-తరటు మొఱటు
గానితో వాదు లాడుట - గాని వావి
యంచు నవ్వుతాలు నొక్క- మా - టాడెనిట్లు ౧౨౯

కం॥ నాయెదుర నిలిచి పోరఁగ
నీయబ్బ వసమ్ము గాదు - నీవొక లెక్కా-?
నీయిరువు పొరువు లేమయి
రో! యెఱిఁగియు నుఱక పలుక-నేలాబమ్మా? ౧౩౦

గీ॥ పాఱి పోయిన గాని నిన్ - బట్టి తెచ్చి
వ్రచ్చి నీ నెత్రు కండలు - గ్రద్దలకును
విందుఁ జేసెదఁ గాని నిన్ - విడువ నసర!
యనిన 'రాముని కిట్లు' రా-వణుఁడు పలికె ౧౩౧

ఉ॥ కొండఱ సోఁకు మూఁకలను
గ్రొవ్వడఁగించిన యంత నే? యెటో
సందర మీఁదినంత నె! ని - జేష్మగు
మేటి మగండవై తివా!

పుండలఁ దప్ప క్రోఁతులను -
బూన్చి యెదిర్చిన గెల్పు కై వసం
బందు నే? యెల్లఱన్ గెలిచి -
నట్టి ననున్ గెలువంగఁ జెల్లునే? ౧౩౨

కం॥ నే నెంత వాఁడఁ! జులకన
మానిసి వీ వెంత? మీకు - మాకంతరువెం
తేనియుఁ గలదయ్యది యిపు
డైన నెఱుంగమికి వగపు - నందితి రామా! ౧౩౩

కం॥ అని పెగ్గెలు పలికిన 'రా
వణుఁతో' వావాదదేల? - వలదని కనలుం
గొని మంటలురియు కోలలఁ
బెను జడివాన బలె విడిచి - బీరముఁ జూపన్ ౧౩౪

కం॥ విడిచెడి తోడుగులుఁ బగతుర
నడఁచెడి యలుఁగులును వచ్చు - నవి పోవునవే
ర్పడక తికమకలునై పొలఁ
గుడువరులకు దిక్కు - ద్రొక్కుఁ-గోల్పో వలసెన్ ౧౩౫

గీ॥ వెదురు బియ్యము కఱవులో - వెలికి వచ్చు
నోజఁ బరిగొని రక్కెస - యుక్తివులును
'రాము' నెదిరించి పేర్చెప్ప - గా మిగులక
గసిక ప్రేటులఁ బంచబం-గాళమైరి. ౧౩౬

కం॥ గరువపుఁ బలుకులుఁ బలుకు న
సరపై సరములు నిగుడ్చి - జెడి గుటిపింపక
దొరఁ 'గాలకేతుఁ' డరదము
బఱపిన నవ్వానిఁ జూచి - పలుకాడె నిటుల్ ౧౩౭

కం॥ అరదము వెనుకకు మఱలుప
నుఱవే? యను రావణునకు - నోఁగి గాడీవూ
న్పరి బదులిడె మున్నెన్నం
డరయఁగ లేదిట్టి కయ్య - మయ్యా! యనినన్. ౧౩౮

కం॥ ఔనౌను! నీవచెప్పిన
దే నిక్కంబైన నిట్టి - వెన్నియొ? గెలువం
బూనిన నాకిటు చేయుట
మానని చెడుపగును సుంత-మరియాదగునా? ౧౩౯

కం॥ పోర నొకరొకరు వేసిన
నారసములు నిరువురందు - నాటిన మేనన్
గారిన నెత్తురు వఱ్ఱయి
సారెకు మోదుగలుఁ బూయు - చందం బాయెన్ ౧౪౦

కం॥ పేరెత్తి పిలుచు వారుం
గారుగదా! అయినవారుఁ - గలనం దెందే
నేరయినన్ 'రా' యనుచో
నా'రాము'నిఁ దలఁచి యుసుర - యడలుం గుడుచున్ ౧౪౧

కం॥ విడువక మడమను ద్రిప్పక
యెడపడక కడింది గోసు - నేర్పడఁ దోడుగుల్
బడి బడి వేయఁగఁ బోటున
కొడఁబడి కడు నీరసమ్ము - నుడ్డాడింపన్ ౧౪౨

కం॥ తఱఁగిన తలలును మఱి మఱి
విరిగిన చేతులును మఱల - వెలువడ 'రాముం'
డటిముటి ఱిచ్చవడెన్ వే
సరి చేయున దేమి లేమి - చేక్కన్ నిలిచెన్ ౧౪౩

కం॥ సరములచే సిరములుఁ దెగి
మఱల మఱల మొలిచి తోంటి - మాడ్కిం గని య
బ్బురవడె నేమియుఁ దోఁపక -
తిరముగ గుడిలోని బసవ - దేవర పోలెన్. ౧౪౪

కం॥ ఎక్కటి పోర న్నిలబడి
యొక్కొ మొగిన్ వాలు తూపు - లుద్దవిడిన్ బె
ల్లక్కసు వెడలం గ్రక్కుచు
బెక్కున దలపడిరి కడుఁ గ-డింది మగఁటిమిన్ ౧౮౫

మ॥ విలు నార్వ్యాటపు మ్రోఁత మబ్బు
యులివుల్-వెంటాడు వాల్దూపు క్రొ
వ్వెలుఁగుల్ మించులు పైడి
సొమ్ము రవలుఁన్ - విన్నాణపున్ వానఱా
లు, లలిన్ మేనఁ దొఱంగు నెత్తురులుఁ
బొ-ల్చున్ జిత్తడిం బోలి య
క్కలనున్ వాన తఱిన్ వెలార్చు
నిరువంకల్ సేయు పోరామెడన్. ౧౮౬

కం॥ ఇరువుర చిచ్చఱ కోలలు
పొరిఁ బోరి సరి దాకి బయల-పోయి యలమినన్
వెరవేది పగలు రాతిరి
నెఱుఁగక బవరమునఁ దటపటించిరి జోమల్ ౧౮౭

కం॥ ఓరంత ప్రొద్దు లంపా
దారమ్ముటు లిమ్ము లేసి-యలపు సొలపునున్
గూరక వేసటఁబొందక
కోరిక తీవలుఁ జిగిర్చి-కొన లెడ సాగన్. ౧౮౮

కం॥ ఎదురెదు రరదము లురవడి
వెదిరి లకోరీల తుటుము_లేయునెడన్ నె
త్తురు దిండి తలలు చేతులు
నటుకఁ బడియు తెప్ప పాటు_నం బొంకమటచే. ౧౪౯

కం॥ తెగి పడిన తలలుఁ జేతులు
బిగువున నెగిరెగిరి యెదిరి పెనఁకువఁ బటువన్
పగఁగొని నెలపై దుముకం
దగు మొండెపుగాము వోలెఁ_దలఁచుట కాయెన్ ౧౫౦

కం॥ పడు తలలు మొలుచు తలలతు
నెడమించుక లేమి నసర_యే_తబమున మున్
బడసెనని యబ్బ మెంతయు
నడరన్ 'రాముండు'ఁ బలుమ_రటుఁ గనుచుండెన్ ౧౫౧

మ॥ అలసెన్ మేనుఁ గడింది చే బలిమి
డూ_యంబొఱె వింటన్ సర
మ్ములు బొందించు కొలంది నోర్పుడిగె
నె_ప్పున్ జూడ లేనట్టి యా
పొలసుం దిండి సిరమ్ములున్ నటుకి
న_ప్పున్ వెంటనే పుట్టుటల్
తలఁకుం గూర్చె నిఁకెట్లు వీని గెలుతున్ -
దయ్యమ్ము తోడ్పాటెటో? ౧౫౨

కం॥ అని దొదవ్వులఁ దలఁపుగా
గొన సాగించియు దిగుల్ దగుల్గొను 'రాముం'
గనుఁగొని 'విభీషణుం'డి
ట్లను దేవర! వీని గుట్టులరయుట లొప్పున్. ౧౫౩

గీ॥ బొడ్డుదమ్మిని వేలుపు - బోన మున్న
యట్టి మైరేని కలదు చయ్యనను దాని
నగ్గి తూపున నీటార్చి - నంతఁ దొరగ
నదియు చెడి 'రావణుఁడు' బొలియఁ గలఁడనినఁ౧౫౪

కం॥ తన యన్న చావు నోర్చియుఁ
దన బంటు తనంపు సొబగుఁ - దప్పక మది నెం
చిన నేమక మున్న 'విభీ -
షణు' 'రాముఁడు' మెచ్చి సంత - సపు టెద నలరెన్

కం॥ ఆమాటలు మది నమ్మిన
'రాముఁడు' చిచ్చుమియు కోల-రా' దిగిచి పొదిన్
వేమారు తొడిగి విడిచిన
గాముంబలె నదియు బొడ్డ - గల్చి కలఁచినన్ ౧౫౬

మ॥ అదియుంగాక! పదారు నూర్ల
సెలలొ - య్యన్ వేసినన్ దూసి గ్ర
క్కదలం బొటి గరాగరిగా
జొటిఁబడేగా - గ్రయ్యంబడెన్ బొడ్డునం

దు౯ దగన్ వేలుపు బోనపుం
గుదురు క్రిం-దున్ మీ౯దునై యగ్గిచే౯
జెదరం బాఱి కరంగె 'రావణు౯డు'
క్రుస్సెన్౯ వ్రస్సెస_త్తిం జెడెన్. ౧౫౭

॥ తలలును జేతులు పదపడి
తొ౯లఁగుట మొలుచుటలు నూట-తొమ్మిది సారుల్
కలిగె నటు మీ౯దఁ జిచ్ఛిఱ
యలుఁగున నవ్వేల్పు బోన - మడఁగుట కతనన్ ౧౫౮

౦॥ ఒకతల రెండుచేతులయి -
యొప్పెను నల్గురవోలె నేఁటికే
మొకొ? రుసులుౠ జేగమ్ము
తోడు-సూడ్వఁగ౯ బున్నెపు సెయ్వు లేమి
చేఁయక యిటుఁగల్గె నోక్కో! యని -
యబ్రముసం దలపోసి రందఱుౠ
గకవిక పాటుఁ జెందిన జే - గా
మగ లచ్చెరువంది రెంతయుౠ ౧౫౯

వ౦॥ గొడుగులఁ జించి టెక్కెములఁ -
గూలిచి వార్వపుగుంపుఁ జంపి యె
క్కు-డు మొకముల్ వడిౠ గలఁచి -
క్రోలరదమ్ముల దుమ్ముచేసి పే

ర్వుడు పౌలదిండ్లనుం జెమరి -
బగ్గముపాడుగఁ జేసె నన్మురా
యఁదుఁ గలనంత తానగుచు -
నన్నిదెసల్ చెరలాడి పోరినన్. ౧౬౦

గీ॥ గట్టుద్రిమ్మరు లెల్లరుఁ - బట్టుదలను
కఱచి వెన్నుల నఱచి తోఁక మెలిపఱచి
కన్నుగ్రుడ్డుల నుఱిచి ర_క్కసులఁ జెఱచి
దండు నంతయు విఱిచి రెం_తయునుబలిమి. ౧౬౧

ఉ॥ పొక్కిలి నున్న వేలుపుల -
బోనముఁ గూర్చిన మంతనమ్ము నొం
డొక్కఁ డెఱుంగఁ బోఁడిదియు -
నొక్క 'విభీషణుఁ'డే యెఱుంగునం
చక్కసుఁ బూని వీనిఁ దిము - రార్చెదఁ
గూర్చెద సత్తి నంచుఁ గెం
పెక్కిన కిన్క నేసె నది - యాడ్గిలఁ
జేసెనుఁ రాముఁడా సెలన్. ౧౬౨

చం॥ అది వితమైనఁ గిన్క పును -
కంటె మగంటిమి మింట మంటలై
కదమును ద్రొక్కఁ గ్రిక్కిఱియఁ
గ్రక్కదలం గల యింగలింపు ట

ల్గదరఁగ నేసినన్ నడుమ –
నద్దితునాతునకల్ బొనర్చి పై
రెద నగలించు మించు సర – మీడ్చి
పెఠిల్మని యేసె రాముఁడున్. ౧౬౩

ఉ॥ బోరనఁ గ్రొమ్మెఱుంగు లల – వోక
బయల్ సుడిఁ జుట్టినట్టు లో
ప్పారు లకోరి వేయు నెడ –
నప్పుడ 'రావణుఁ' డూచేముట్టు పో
కారిచి వెంటనే సురియఁ –
గైకొని పోరిన నొక్క దెబ్బ నూ
టారుగ తుంటలై పడిన –
యట్లగలించెను 'రాముఁ' డంతటన్ ౧౬౪

చం॥ ఈతని నాలసించిన మ –
జేమగునో? తలలెన్ని పుట్టునో?
యేతటి మైన వీని తల –
యీడ్చి భువిన్ బడఁగూల్చి తన్నిన
ట్లీ తఱిఁ జిచ్చుటమ్ము విడు – మీ!
యను 'మాతలి' మాట కంతటన్
బూఁత మెఱుంగు నవ్వోలయఁ –
బూనిక 'రాముఁడు' డా తలంపునన్ ౧౬౫

కం॥ ముని 'విశ్వామిత్రు డొ'సం
గిన జేన్నము నాఁటి యలుఁగు - నిండిన పొదినుం
డిన దీసి దాని మంతర
ముని ముమ్మా రెంచి యెడఁదఁ బోరచి వేసెన్ ౧౬౬

చం॥ బువి దివి యెల్ల నిండి యటు -
బోవఁగఁ దావును లేక 'రావణున్'
రవరవఁ గూల్చి నంత నె హు -
టాహుటిఁ గ్రిందఁ బడెన్ సబమ్ము న
ప్డు, వెతలుఁ దీరె నంచు జేగ -
మున్ గడు సంతస మందె వేల్పులున్
మివుల నెలర్చిరాయసర -
మిండని గండడఁగింప నెంతయున్ ౧౬౭

గీ॥ అన్న చావు విభీషణుఁ' - డరసి మిగుల
చెడ్డ పని చేత నీపాటి - చేటుఁ గూడె
నంచుఁ దలపోసి మదిరోసి - యలపుఁజెందె
చెడుగరుల మెచ్చేఁబోడుఁ ద - మ్ముడును గూడ ౧౬౮

కం॥ జేరిగిన దంతయు 'రాముం'
డరసి వెరసి కొంత యోర్మి - నందుకొని సరా
సరి వచ్చిన పని ముగిసిన
తెలుఁగున దొదవ్వ తలఁపుఁ - దెరదాటి చనెన్ ౧౬౯

కం॥ మైతాల్పు లెడఁదఁ గూడని
చేఁతకుఁ బొల్పడుట కతన - చెడుగయి జగమున్
బాతర లాడించి తుదిఁ
బ్రాఁతిగఁ గోల్పోవ వలసెఁ - బానము లకటా! ౧౭౦

కం॥ ఇంతటి వాఁడీ దోసపు
దొంతరయై జగము వెగటు - తో బ్రదుకు పగఁ
వంతుఁగాని పేరు పెంపు నొ
కింతయు గొనకూడ్చెఁ బుట్టు-విది కసటుఁగదా! ౧౭౧

గీ॥ మివులఁ దలపోసి తలపోసి - మిన్నకిట్టు
లేది యెటులగు నదియు న-ట్లేజరగుట
కెడఁద నబ్బురపడి చేయు - టేమి? యింక
ననుచు దగ్గఱనున్న లక్ష్మణునిఁ జూచి ౧౭౨

కం॥ చేతఁగల విల్లుఁ దమ్ముని
చేతికి నందించెఁ దాను - చేయుఁ గల పనిన్
ఈతటిఁ దీర్చితి వలదన
నాతఁడు సేకొనియె నన్న - యానతి మేరఁ ౧౭౩

కం॥ లంకను గలఁ 'మండోదరి'
యింకను జెవరాంద్రు పెక్కు - రెట్టులొ! యనిలో
జెంకు గలంకును గింకిరి
కొంకున జారఁబడిరి "కాకి - గోల"య్యె నటన్ ౧౭౪

కం॥ 'రావణు'ని సభను డగ్గఱి
నా వలపుల తేడ! నేఁడు – నన్నవద నిటుల్
గావించి యొంటరిగఁ బడి
పోవం గతమేమి? కసటు – బుద్ధిని గాదా! ౧౭౫

గీ॥ ఎంత జెప్పిన వినక న–న్నిట్టి గతికిఁ
దెచ్చితివి యెందఱాండ్రు మున్ – దిట్టి నట్టి
చెడుగునన్ గట్టికుడుపక – విడుచునొక్కొ!
పసిపలుఁకుఁ గట్టికుడుపక – వదలఁగలదె! ౧౭౬

కం॥ ఆఁటది చెప్పిన మంచిని
పాటించుట లెస్స! చెడ్డ – పలికిన మగవాఁ
డోటు పడునంచు విడచుట
నేటగు నేమకము దీని–నిన్ వింటెపబూ! ౧౭౭

ఆ॥వె॥ అనుచు వనరి పనవి – యలఁదురి వాపోయి
వగచి యేడ్చి తుదకు – వలను గాక
సొమ్మసిల్లి సొక్కి – బమ్మెర వీడి డా
యంగఁ జాలె మెల్ల – నంతిపురికి ౧౭౮

కం॥ ఉసురెడలు వారలకు న
ప్పస మొనరుపఁ దగిన – పనులు పనుపడి చేయన్
వెసఁబురికొలిపె 'విభీషణు'
డొసపరి కర్జమ్ము ముగియ–నొక మేల్మి తటిన్ ౧౭౯

కం॥ ఆలంక నేలుబడి తన
మోాలి 'విభీషణున' కొసఁగి_యోాపెన్ 'రాముం'
డాలమున గెలుపు 'సీతకు'
వాలాయము 'హనుమ' విని చెం బలుమరు వరుసన్

కం॥ 'సీతను' 'విభీషణుఁడుఁ' గొని
యేతెంచెన్ 'రాము' పనుపు _ నెదఁ గొని బత్తిన్
'సీత'యు 'రాము'ని జూడఁగఁ
బాతరలాడంగ నెడఁదఁ_బరువులు వాఱెన్ ౧౮౧

ఉ॥ అంతట 'సీతఁ' జూచి మగు _
వా! నినుఁ గాంచఁగఁ గ్రోఁతి మూఁకతో
సంతసమారఁ జెల్మిఁ గొని -
సంద్రము దాటి యనిన్ మగంటిమిన్
వింతగఁ జూపిఁ రావణునిఁ -
బీచెమడంచి 'విభీషణున్' గదుఁ
మంతున కెక్క_నోమి విను -
మానమునన్ నినుగంటి నేఁటికిన్ ౧౮౨

మ॥ తన యాలిం జెఱఁ గొన్న లేకి గెలుపొం_
దంగల్గు బీరమ్ము లే
దని వాపోయెడి వారి వాదడఁచి డా _
యంజాలితిన్ గెల్పు 'రా

వణు' నింటం దడవుండ నోర్చిన నినున్
బాగంచుఁ గైకొంట చె
ల్లునె! నీయిచ్చకు వచ్చు మచ్చునను వీ-
ఱం జూచి పో పొమ్మికన్ ౧౮౩

కం॥ నినుఁ గొను మది లేదించుక
యని పల్కిన నన్నెఱింగి-యటు పలుకుటలో
ప్పునె? యని పలికిన 'సీతకు'
వినిచెన్ 'రాముం' డెడందఁ-బెనఁగొను తలఁపుల్

కం॥ అచ్చెపు మా వంగడమున
మచ్చునుమా! యిద్దిఱుఱికి-మఱిమఱి తోమన్
పొచ్చెమగుఁ బొచ్చెమంతటఁ
జొచ్చును, నీవట్లొనర్పఁ జూడుము సీతా! ౧౮౫

కం॥ చెఱఁబడు వారిని మఱలన్
జెఱ విడిపించుటయ పాడి-చేకొను టెందే
నుఱవగునె? రాచేదరమము
నెఱవేర్చితి నింక పొమ్ము-నీదారి బడిన్ ౧౮౬

కం॥ పొరుగింట నున్న యన్నును
మఱలన్ జేకొనఁ డదెట్టి-మగవాఁడు నిజం
బరయుగ దానికి మించిన
కొఱమాలిన చెడ్డ పేరుఁ-గొఱలునె? యనినన్ ౧౮౭

కం॥ నను వెదుక వచ్చి నప్పుడ
'హనుమంతుని' కెఱుక పఱచి-నంతట నాఁడే!
పానుపడి యుసురులు విడువక
మనుము నె? నీవొప్పనట్టి-మనుగడ యేలా ? ౧౮౮

చం॥ అని మది గోలు గోలు మని -
యంగద పొంగి కనుంగవన్ వాఱం
గిన నులి వెచ్చ నీటి జేడి -
నివ్వెఱఁ జేల చెఱంగు కొంగునన్
బనుపడ నద్ది కొంచు-సొదఁ -
బడ్డ ననున్ గయి కొంట సందియ
మ్మును గలదే ! యటన్న-సరి -
పోవు నటంచని 'రాముఁ' డాడినన్ ౧౮౯

ఆ।వె॥ నమ్మకమ్ము లేని - నాబ్రదు కేటికి ?
యగ్గి నుఱికి సొచ్చె-మైన వెనుక
యిచ్చె వచ్చి నట్టు - లే! తీసికొందు ర
టంచు విన్నవించె - నపుడ 'సీత !' ౧౯౦

చం॥ కనుఁగవ నీరు సోనలయి -
కాల్వలుఁ బాఱఁగ 'సీత'-పైట కొం
గును నిలువెల్లనుం దడిసి -
కొల్ను పదంపడి వచ్చు యంచ పో

లిన నది స్రోఁతు లారయఁగ –
లేక మొగమ్మున జేతులడ్డి బో
రన వగ పంది రమ్మ నెన –
ఘుం గొను బిడ్డల మాడ్కి నొక్కటన్ ౧౯౧

కం॥ అందఱు నోదారిచి పెను
ఘుం దనుపున్ నిలువుఁజూపి_పొడవగు విలు న
మ్ముం దాల్చి యున్న 'లక్ష్మణు'
ముందఱఁ బొడఁగాంచి 'సీత' మొదలిట్లనియెన్ ౧౯౨

కం॥ మఱఁదీ ! నాయీలుఁవుతన
మెఱఁగిన మీయన్న కింత_యెఱఁగింపుమ ! నీ
యెఱఁగిన నా నడవడి యని
తెఱపు మఱపొకింత తేట_తెల్లము సేసెన్ ౧౯౩

కం॥ సొదఁ బేర్పమనిన 'లక్ష్మణుఁ'
డెదురయి మాటాడ 'రాముఁ'_డెటా ! సన్న యిడన్
సొద రగిలింపన్ జేసెను
గద ! 'రాముఁడు' పట్టుదలకుఁ_గాణాచి సుమీ ! ౧౯౪

కం॥ పరువడి తన నడవడి జెగ
మొరవడి యగు 'సీత' 'రాము'_నొత్తరపు మదిన్
మెఱయ వలచుట్టి యొరిగలఁ
బొరిఁబొరిఁ జేకూర్చి బత్తి_మొన దేరుదుదిన్ ౧౯౫

గీ॥ 'రాము' నడుగుల నెడఁదఁ ది_రమ్ముగా తెలిపి
వేల్పు లందఱఁ గొనియాడి _ వేఁడికోలు
సలిపి తనుదా నెఱింగిన _ 'జనకు' కొమిరె
'సీత' యగ్గికి ముమ్మారు _ జోతలిచ్చి ౧౯౬

గీ॥ చెడుగు మది. 'రాము'నికిఁ దప్పి _ నడతు నేని?
నేనెడంద నొరుఁ దలఁ _ పూనె నేని?
'రాము' మెయి సగ బాలుఁ గో_రఁ దగ దేని!
అగ్గిలోఁ గాలి బూడిద _ నగుదు ననుచు ౧౯౭

కం॥ రాయంచే కొలను లోఁ బడు
ఛాయను నిప్పుఱికి 'సీత' _ చెల్లఁగ వెలిఁగెఁ
డాయఁజెనె, నచ్చెటందఱుఁ
బాయక కొనియాడి రరిది ప్రన్నని నుడులన్ ౧౯౮

కం॥ మాయురె! యీయమ క్రొత్తడి
యే యయ్యు నడెట్టిసేగి _ కెనఁగావలసెన్
యీయమ నడవడి యొరవడి
యై యేలుఁత మేలుబంతి _ యై జెగమెల్లన్ ౧౯౯

కం॥ అని గుజె గుజె వోయిరి ని
ష్పున బడు నపుడ యచేట _ మూఁగిన వారల్
కనుమూసి తెఱచు లోపలఁ
గనఁబడెఁ జూపఱకుఁ గొలను_కడ తమ్మి వలెన్ ౨౦౦

ఆ|వె|| 'సీత' వలన దోసఁగు _ చీమంత లేదని _
యంద ఱొప్పు కొనిరి_యవల 'రాముఁ'
డెడఁద బేట మొత్తి_వెడదయై నిడుదయై
కడు కొనంగ 'సీత' _ గారవించె ౨౦౧

గీ|| అంగములవేళ్ళు గట్టు దా_య, నలువయును
వేలుపులఁ గూడి రాముతో_విన్నవించి
రిట్టి మగఁటిమిఁ జూపి_ము_న్నెవ్వఁడేని
రక్క_సుల నుక్క-డంచిన _ రాజు లేడు ౨౦౨

ఆ|వె|| అలఁతి దోస మేనిఁ _ గలుగదు 'సీతమ్మ'
వలన నీకడింది _ పనుల వలన
పొలసుదిండ్లు మడియ - వలసి యిదంతయు
జరిగె నొండుఁ దలఁపఁ_ జేనదటంచు ౨౦౩

గీ|| పలికి వారున్న చోటికిఁ_ బయన మగుచు
నందఱును మున్ను చేసిపోయి _ నట్టి గట్టు
ద్రిమ్మరుల కుసురందఁగా దీవెన లిడి
చెప్పకయ సొంత యునికిలోఁ _ జేరి రవల ౨౦౪

కం|| జరిగిన కత యంతయు నొం
డొరు లొకటొకటి పలుకు_ చుండి రుబుసునన్
దఱిఁ గడపుచుఁ దిరుగుచు సం
బరమునఁ బుష్పకము' నెక్కి_పయనం బయినన్ ౨౦౫

కం॥ అందఱు దుఁదడి సందడిఁ
బొందిన గెలుపులను బోలుపొందగు మాటల్
విందులటు లాడు కొనుచున్
ముందుసగుఁ జేనుచుఁ-దావి మోఁపరి ఎలనఁ ౨౦౬

కం॥ ఎలమిం బొందుచు నెదురం
గలవింతలు సెప్పుకొనుచుఁ గడలిని దాటం
గలిగితి మిపుడని పలుకుచుఁ
బలు నాణియములను జూచి - పరువం బలరన్ ౨౦౭

సీ॥ నడి దారిలో 'సీత' - యడిగిన దానికి
బదులాడుచును 'రాముఁ'-డిదె దురమ్ము
రావణుండు'ను మఱి రక్కసుల్ పొలిసిన
తావిదె! కట్ట సం-ద్రమునగట్టు
చోటిదె! యిచేటనే!-సుగ్రీవు నేస్తమ్ముఁ
గుదిరె! వాలిననిటఁ గూల్చినాఁడ
నీ 'హనుమంతుఁ' డి - య్యెడ మమ్ముఁ గన్గొనె,
నదె! 'కబంధుని' జంపి - నట్టి బూమి

గీ॥ ఇయ్యదే! 'రావణుండు' నిన్నెత్తి కొని చ
నన్ - 'జటాయువు' కని-చేచ్చి-తల మడియ
ఆకుటిలు కాపురము సేసి-నట్టి తావు
'రావణుఁడు' నిన్నుఁ గైకొన్న-తావిది సుమి! ౨౦౮

సీ॥ పెను మాయదారి లే_డిని జంపినది యిదే!
"ఖర-దూషణులు"-ద్రుంచు_నిరవు నదియె
ముకు చెవుల్ చుప్పనా_కకుఁ గోసినది యిట!
యయ్యా దగస్త్యుని_యాకుటిల్లు
'అనసూయ' మైత్రాఁత - నలరించె నీకెందు
నిను విరాధుఁడు' పట్టు _ కొనిన దచేట
నిదె 'చిత్రకూట మ_ల్ల దె 'భరతుఁడు' మన
లను గొనిపోవ వ_చ్చిన తలమ్ము

సీ॥ అదియ గంగ' 'భరద్వాజు _ నాకుటిల్లు
సిదె! యటంచును వ్రాలి నే_స్త _ మెదఁ దలంచి
చేప్పునన్ దిగి యచ్చోటు_గొప్ప వెలుఁగు
లన్నికడలకు నెగఁద్రాఁకు_టరసి మిపుల! ౨౦౯

సీ॥ రావి తీవెల డాయ_రచ్చె కేడ్వఁగఁ జాలు
చెదరిన కెంజడ _ సిరిఁ గలాఁడు
మొనలి వాయొంట్ల క్రొ_మ్మిసిమి నుఁ జెక్కి_ళ్ళఁ
దొంగి చూచెడు వీను _ దోయి వాఁడు
మెలివడ్డ తొలసి పే_రులు విప్పు ఱెదమీద
దిగజారి వెలిఁబర్వు_జిగిఁ గలాఁడు
నొసల జేన్నపు బూది _ పసమించు తిగ లేక
పట్టిపై కుంకుమ _ బొట్టు వాఁడు

గీ॥ భగ్గు"మని వ్రేల్మి మంట కా-వల వెడంద
పంచె టరుగున కూర్చుండి - బమ్మవోలెఁ
బొదలుచున్న 'భరద్వాజు' - నెదుర నిలిచి
చాఁగిలిం బడి మోడ్పుఁ గేల్ - సవదరించి ౨౧౦

గీ॥ 'భరతు'నికిఁ జెప్పి పంపు ట-క్కరయటంచు
'హనుమ'తోఁ గొన్ని మంతనా-లాడి 'రాముఁ'
డనుపఁగాఁ బోయి యయ్యయో-ధ్యఁ బొడఁ గాంచి
మఱలి పోయెను 'నందిగా'-మమ్ముఁ జేర ౨౧౧

సీ॥ మెలిపెట్టి చుట్టిన - మీసు సిగఁ గట్టిన
కొండ మల్లెల తావి-గుబులుకొనఁగ
దామర తూటిలో - దారమ్ము ముప్పేట
జందెమ్ము వ్రేలి పాల్పొంది వెలుఁగఁ
బటికంపుటా సరుల్ - పచ్చని బొంతపై
నిగ నిగ తేజ మ-న్నికను దెలప-
నర చెందురుని నొస-లందు నామము దిద్ది
గిలుకు పావల యడ్గు - లులివు లీనఁ

గీ॥ జెంకలో జింకతోల్ దల్చి-చాపఁ దెండి
రాచ కర్జమ్ము లెల్ల వే-ర్పఱచి తీర్చి
దిద్ది 'రామ' యటంచుఁ బ-దిం బదిగను
దేనమొనరించు 'భరతుని' దేరి చూచి ౨౧౨

గీ॥ క్రొత్త వాఁడౌటఁ దన కతఁ గొంత చెప్పి
'సీత' - గోల్పోవుటయు మఱి - చేసుకొనుట
మొదలయిన పోలుపొందు లెట్టెదురఁ గనులఁ
గట్టినటు చెప్పి చెలికార - ముట్టి పడఁగ - ౨౧౩

గీ॥ 'రాముఁ' డాడిన మాట తేర్పఱచి పలుకఁ
దల మునుకలైన నెలమి కడల మునింగి
'రాముఁ' గన్గొన 'భరతుఁ' డా-రజేము మీరి
తల్లులను దమ్ములను గూడి - తరలి రపుడ ! ౨౧౪

కం॥ అందఱకుఁ గేలు మోడ్పులఁ
బొందించిన 'భరతు' నెడఁదఁ బొంగిన తలఁపుల్
క్రందయి విందయి పొందయి
పొందామర లోని నీటి - బొట్లటు లొలసెన్ ౨౧౫

కం॥ తండ్రి మాటకు నడవుల-దారిఁబట్టి
యిడుమఁ బడు వానిఁ దండ్రియై యేలువాని
'రాము' నింజూడఁ బజలు హాతాళముగను
వచ్చి రెడసందు లేకదే - పండువనుచు - ౨౧౬

కం॥ గుంపులు గుంపులుఁ దామర
తంపరగా వచ్చి చూచి - తనిసనిరి ప్రజల్
సొంపున బెంపున నింపున
సంపతిలఁగ మనిరి-'రాము' చెల్లని చూడ్కిన్ ౨౧౭

సీ॥ ప్రజల కోరిక లిమ్మడిం - పఁగ "నయోధ్య"
నేలుబడి తన మొసఁగఁ దా - రెంచి కొలువు
చేసి తీర్మానమునకు సం_తోసమంది
యన్ని జేతనమ్ముల్లోనరింప - ననువు పఱచి ౨౧౮

గీ॥ పొడుగు మడుగున నీరు గో_బ్బున గడించి
తాన మాడించి యీావుల - మాని పూలు
కోసికొని వచ్చి 'సీతమ్మ కొప్పున నిడి
దొరతనపు హంగు లన్నిటఁ - గొఱఁతఁ దీర్చి ౨౧౯

గీ॥ కొలవు టొజ్జ 'వసిష్ఠుఁడు' గెలన నిలువ
బుద్ధి వచ్చిన 'కైకమ్మ', ముందు-వెలయ
'రాము'నకు దొరతనమ్ముఁ గూర్పంగ దలఁచి
ప్రజల తోడ్పాటు నొడగూర్చు-పనులఁ దీర్చి ౨౨౦

గీ॥ 'భరత' 'శత్రుఘ్ను' లిరుదెసల్ - వరుస నిలువ
యెడమ దెస 'సీత' యును 'లక్ష్మణుఁడు' గుడికడ
నిలువఁ దల్లుల దీవెనల్ - నిండు కొనఁగ
వేల్పులును జడదార్లు దీ - వెనల నీయ ౨౨౧

గీ॥ బండ్ల కొలఁదిగ కానుకల్ - ప్రజ లొసఁగఁ
జెట్టుపట్టులు_ జేజేలుఁ గొట్టుచుండ
నెల్ల యాణియపుఁ జజే - లేగుదేరఁ
నేలుబడిఁ బూనె 'రాముఁ' డో_లగమున- ౨౨౨

గీ॥ ఐదువలు నేస్త్రాలు వోయంగఁ బజేలు
నిండెలమిఁ బండుగలొనర్చి – నివ్వటిలఁగ
తండ్రి-లేని కొఱఁతఁ దీర్చి – తండ్రివోలె
పజేల నేలెను 'రాముఁ' డక్కజ ముమీర ౨౨౩

గీ॥ అపుడ ముత్తైదువలు 'సీత'-యండ జేరి
క్రొత్తడి వటంచుఁ గొండాడి-కొలువుఁదీర్చి
యడుగులకుఁ బూసి పారాణి-నవలఁ బోయి
గంతమంచి దటంచు సీతమ్మఁ బొగడి ౨౨౪

సీ॥ వంకరల్ కురులందుఁ-బొఱు నేఱుల యందు
కుదిరికల్ మలలందు-గుబ్బలందు
అలకన దొసఁగు చేఁ-తలయందు నడుమందు
పెనకువల్ పగఱందు-పెదవులందు
పొందిక నేస్తమ్ము-నందుఁ గౌఁగిలి యందు
మత్తు నిద్దురయందు-మగత యందు
బరవసం బెదురొడ్డు-పనియందు-మనుటందుఁ
జెలిమి ప్రోయాండ్రందుఁ-గలిమి యందు-

గీ॥ కట్టడులుఁ దనయందు-వక్షణము నందు
జాలి కొల్వారు-లందుఁ గై-సరుల యందు
బలిసి యొంత ప్రొద్దులు-వెలయఁ దల్లి
పిల్లలటు 'రాము' నేల్బడి-పెంపు నింపె! ౨౨౫

ఉ॥ వేరుల గొల్చు పంటలొద -
వెన్ దటి వానలువచ్చి పంటము
క్కారును బండె లేమిడియుఁ -
గాటకమున్ దెవులింత లేక చె
న్నారి రయోధ్యఁగాకఁ జగ -
మంత పజేల్ సిరులంది హాయిఁ బొ
ల్పారిరి 'రాముఁ'డేలు నపు -
డట్టిద ముందొడఁ గూడుఁ గావుతన్ ౨౨౬

కం॥ రామా! నీ యేలుబడిన్
మేముండని కతనఁ గొఱఁత - మెండొడ్డెను నీ
ప్రేముడి నేఁడైనను మా
పై మోపిన నంతకంటె - బొగ్గముఁ గలదె! ౨౨౭

చం॥ తెవులున మ్రగ్గియుఁ దుదకుఁ -
దేరి నినుఁ గొనియాడి మన్గడన్
దవిలితి నిబ్బరంపు బెడఁ -
దన్ ననుఁ బ్రోవుమ! యింతకంటె నే
నెవియును గోర నన్ని విడి -
పించిన నాకొక నీవుఁదప్ప నె
య్యవియు సయింప దిద్ది నిజ -
మాదిట నారసి కావుమో ప్రభూ! ౨౨౮

కం॥ నీవొనరుచు పను లివె ! యని
నే వాకొన, దరమె! జగమె_నీవుండని చో?
వే వెలుఁగులేని పవలటు
లావుల్ సెడు బూతముల యెడాటమె, తప్పన్ ౨.

గద్దెము_

కం॥ ఇది నారు నాగనార్యుని
కెదవచ్చిన "రామకత" కయానరు తెలుగిన్
బొదలాడి చేదువ బాసకు,
గుదురేర్పడు బుత్తి ముత్తిఁ గూడుట లసదే ? ౨

మేల్మేల్.

రమణుని యడుగుదోయి కిది యప్పనము.

ముగిసినది.



శ్రీ బాలాజి ప్రెస్ గాంధీరోడ్, చిత్తూరు.

# తప్పొప్పుల పట్టిక

| బాలకాండము | పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | ౧౦ | బత్త్రమ్ములు | బతమ్ములు |
| ,, | ౧౨ | సేయమను | సేయగను |
| ,, | ౨౨ | బూసుదు | బూనుదు |
| ,, | ౨౯ | కులమంగ | మలమంగ |
| ,, | ౩౩ | డోన | దోన |
| ,, | ౩౯ | జేన్నమందు | జేన్నమందు |
| ,, | ,, | ఱేడపు | ఱేడప్డు |
| ,, | ౪౬ | నల్గురను | నల్గురును |
| ,, | ౪౭ | వలంతి | నలంతి |
| ,, | ౪౮ | ద్రెండము | డెందము |
| ,, | ౫౬ | మినమ్ము | మీసమ్ము |
| ,, | ౬౪ | యసువై | యనువై |
| ,, | ౬౬ | నెనె | నేనె |
| ,, | ౯౦ | బఱంగినది | బఱంగినదిడి |
| ,, | ౯౮ | లంబాడుదు | లంచాడుదు |
| ,, | ,, | వంచకులగు | వంచేకులగు |
| ,, | ౧౦౦ | బొనర్ప | బొనర్ప |
| ,, | ౧౦౯ | గూడికసు | గూడికను |
| ,, | ,, | విసుట | వినుట |
| ,, | ౧౧౦ | మిత్త్రి | మిత్రి |
| ,, | ౧౨౩ | బొనరించి | బొనరించు |
| ,, | ౧౨౭ | వెలనాగలు | తెలనాగలు |
| అయోధ్యాకాండము | ౬ | టెరుల | టేరుల |
| ,, | ౨౦ | టలపల | బలపల |
| ,, | ౪౮ | మెలంగస్ | మెలంగన్ |
| ,, | ౬౮ | భరతుండిట్లని | భరతుండిట్లు |
| ,, | ౭౨ | మొలడేమి | మొండేమి |
| ,, | ౭౪ | దశరథుండగు | దశరథుండగు |
| ,, | ౮౨ | నుండ | గుండ |
| అరణ్యకాండము | ౬ | నా కొనె | వా కొనె |
| ,, | ౨౯ | కురవగునని | కురవని |
| ,, | ౪౫ | నౌటి | నోటి |

| | | | |
|---|---|---|---|
| అరణ్యకాండము | ౪౯ | నొడుదాన | నోడుదాన |
| ,, | ౫౪ | వెడఁద | లెడఁద |
| ,, | ,, | లెపుడెపుడు | నెపుడెపుడు |
| ,, | ౫౫ | నచ్చోట | నచ్చోట |
| ,, | ౬౦ | నిగార్తమ్ము | నిగారమ్ము |
| ,, | ౭౧ | యెత్తిని | యెత్తిన |
| ,, | ౭౫ | నీ తీరు | యీ తీరు |
| ,, | ౮౦ | వినవు | విసపు |
| ,, | ౮౭ | యుక్కవు | యుక్కివు |
| ,, | ,, | గైకొన | గైకొని |
| ,, | ౮౮ | రవళున్ | రవళుల్ |
| ,, | ,, | మార్మ్రోయ | మార్మ్రోయ |
| ,, | ౯౧ | దాటి | దాట |
| ,, | ౯౫ | దీనీ | డీనీ |
| ,, | ౧౦౭ | దమనెద | దమయెద |
| ,, | ౧౧౧ | కింతేనియు | కంతేనియు |
| ,, | ౧౧౭ | మాయసు | మాయను |
| ,, | ౧౨౨ | ట్లెపార | ట్లేపార |
| కిష్కింధాకాండము | ౮ | మ్మొర్చి | మ్మొనర్చి |
| ,, | ౨౭ | నిది | యిది |
| ,, | ౩౩ | యడలి | యడలె |
| ,, | ౪౭ | బోదిలో | బోరిలో |
| ,, | ౫౬ | నలుఁగుఁ | యలుఁగుఁ |
| ,, | ౫౮ | యానల | యావల |
| ,, | ,, | వంచనన్ | వంచెనన్ |
| ,, | ౬౦ | లేరుదిన | లేరును దిన |
| ,, | ౬౧ | స ననేల | న ననేల |
| ,, | ,, | యెులుక | యెలుక |
| ,, | ౬౪ | వేడఁగ | వేడంగ |
| ,, | ౬౮ | దనాస | దనాన |
| ,, | ౯౪ | యిటు | యిట్లు |
| ,, | ౯౮ | కెలగేలన్ | కెంగేలన్ |
| ,, | ౧౦౫ | సువమ్ము | సుకమ్ము |

| | | | |
|---|---|---|---|
| సుందరకాండము | ౪ | గ్రొమ్మ | గొమ్మ |
| ,, | ౯ | దాలుఁగ | దాటఁగ |
| ,, | ౧౪ | దెలిపఁడ్లు | దెలిపండ్లు |
| ,, | ౧౬ | లేనటంచు | లౌనటంచు |
| ,, | ౨౨ | యొకని | యొకరి |
| ,, | ౨౩ | గ్రైసేని | గ్రైసేసి |
| ,, | ౩౪ | దేవెలుఁగు | రేవెలుఁగు |
| ,, | ౪౬ | కేలుపుల | వేలుపుల |
| ,, | ౫౩ | ప్రెంపు | పెంపు |
| ,, | ౫౯ | మఁదమెంచి | మందమెంచి |
| ,, | ౬౯ | దనముం గలవాఁడున్ | దనము గలవాఁడు |
| ,, | ౭౪ | బ్రుమ్మిన | బ్రమ్మిన |
| ,, | ౭౮ | బ్రాఁచితి | బ్రాఁచిత |
| ,, | ౮౬ | తనమ్మలంతి | తనమలంతి |
| ,, | ౮౯ | నగరుల్ బదిం | నగరుల్ వెసం బదిం |
| ,, | ౯౦ | కయిర్ | కయిల్ |
| యుద్ధకాండము, | ౩౧ | విభీషణు | విభీషణుని |
| (1-వ భాగము) | ౩౮ | నొక్క | నొక్కా। |
| ,, | ౫౦ | నెల్ల | యెల్ల |
| ,, | ౭౪ | మాటార్పు | వోదార్ప |
| ,, | ,, | కౌసల్యత | కౌసల్యమ్మ |
| ,, | ౮౩ | బట్టుదలిం | బట్టుదలం |
| ,, | ౮౭ | బెట్టులైన | బెటులైన |
| ,, | ౧౦౬ | రాము | యా రాము |
| ,, | ౧౦౯ | గాన | నాస |
| ,, | ౧౧౦ | చూపల | నల్వాలఁకుల |
| ,, | ౧౧౭ | దంగద | డంగద |
| ,, | ౧౨౮ | ప్రిదిలిరో | ప్రిదిలినరో |
| ,, | ౧౨౯ | గొంతమందిను క్కరుల మిగుల | గొందఱంబిల్చి యుక్కుమిగుల |
| ,, | ౧౩౯ | మహాపార్శ్వండా | మహాపార్శ్వుండున్ రా |
| ,, | ౧౪౯ | లేమ | లేమి |
| ,, | ౧౫౯ | నిద్రం | నింద్ర |

| | | | |
|---|---|---|---|
| యుద్ధకాండము, (2-వ భాగము) | ౧౮౦ | తెలిని | తెలివి |
| | ౧౩ | గొట్టైత్రై | గొట్టిత్రై |
| ,, | ౧౬ | జుదల | జెదల |
| ,, | ౪౧ | రండన | రమ్మన |
| ,, | ౪౫ | విందుల | విందుం |
| ,, | ౭౭ | నెనుయుట | నెనయుట |
| ,, | ౮౫ | గౌనీ | గానీ |
| ,, | ౮౯ | రామా! | రావణ! |
| ,, | ౯౩ | బెడ | జెడ |
| ,, | ౧౦౯ | టెక్కవల | టెక్కము |
| ,, | ,, | వలంకుల | వలంకుల |
| ,, | ౧౧౦ | మివి | మిని |
| ,, | ౧౧౨ | కొలువరల్ | కొలువరుల్ |
| ,, | ౧౨౦ | బొలుపోక | బోలుపోక |
| ,, | ౧౨౨ | పెంకెక్కగ | పెంపెక్కఁగ |
| ,, | ౧౨౫ | దవావో! | దహాహో! |
| ,, | ౧౩౦ | పలుకనేలా బమ్మో! | పలుకులొండననేల |
| ,, | ౧౩౬ | రకె్రసయుక్తివులును | రక్కసయుక్కివులున |
| ,, | ౧౪౪ | మొలిచి | మొలువ |
| ,, | ౧౫౯ | తోడుసూ | తొడుసూ |
| ,, | ౧౬౦ | నన్మరా | మన్నురా |
| ,, | ౧౭౭ | చేయుఁగల | చేయఁగల |
| ,, | ౨౦౦ | నవుడ | సీతఁగని |
| ,, | ౨౦౫ | డొరులొకటొకటి | డొరులపుడొక టొక |
| ,, | ౨౦౮ | చెచ్చితల | చెచ్చినతల |
| ,, | ౨౦౯ | యిదే | యిందె |
| ,, | ౨౧౦ | మొనలి | మొసలి |
| ,, | ౨౧౨ | దల్ప | దర్ప |
| ,, | ౨౧౬ | దండ్రి | దండ్రి |
| ,, | ౨౨౨ | జజే | బజే |
| ,, | ౨౨౭ | గలదె! | గలదే! |
| ,, | ౨౨౮ | మ్రగ్గియుఁ | మ్రగ్గియుం |
| ,, | ,, | మాదిట | మాదట |

## నాయని సుబ్బారావు వ్రాసిన కబ్బములు

1. వీరపూజ-విద్వత్పరీక్ష పతనీయ వీరగాథ 2—50
2. తెలుగుతల్లి-అన్నిపక్షముల విమర్శించునది 1 00
3. తిలోత్తమ .... .... .... 1—25
4. తిలోత్తమా సాహసికము 1—25
5. ఉషారాజ్ఞి .... .... 1—25
6. ధాన్యమాలిని 7. వసంతోదయము (ఒక్కొక్కటి) 1—25
8. దేవయాని 1, 2 భాగములు ,, 1—25
9. శ్రీ రమణాభ్యుదయము 2—00
10. శ్రీరామకృష్ణ మహోదయము 2—00
11. సత్యాన్వేషి (శ్రీ గాంధీమహాత్మ చరిత్రము) 2—00
12. పృథ్వీరాజ విజయము 2—00
13. పరాధీనభారతము (ప్రౌఢ కావ్యము) 2—00
14. హృదయాభ్యుదయము సీతా-రామాదుల హృదయ వివరణము 2—00
15. పరివర్తనము .... .... 2—00
16. ఉద్బోధ సామ్యవాద-నిరూపణ-కల్పితకథ 2—00
17. ప్రణయిని-ఒక కవిదంపతుల ప్రణయగాథ 2—00
18. త్రిపురారహస్యము (వేదాంతము) 3—00
19. గీతానుగీత (భగవద్గీత) 3—00
20 మెచ్చులవచ్చు ముచ్చిలి - పారిజాతాపహరణము 2—00
21. మనువు పుట్టువు - మనుచరిత్ర (ఒక్కొక్కటి) 2—50
22. ఊర్వశి 23. శకుంతల 24. వెన్నెల పెండ్లి 1—50
25. రామకత .... .... 4—00

ఈ 5—సు అచ్చతెనుగు

అచ్చుకావలసినవి: 1. శ్రీహరిసాహస్రి 2. ఆర్యవాణీసాహస్రి 3. టంకసాల 4. రమణవాఙ్మయదశకము 5. ప్రబోధశతకపంచకము 6 ఉపనిషదనువాద పంచకము రత్న వివణి వగైరా.

ఇవి వ్రాసిన కావ్యములవలె సలలిత విరచిత పద్యకావ్యములు.

| | | | |
|---|---|---|---|
| యుద్ధకాండము, (2-వ భాగము) | ౧౮౦ | తెలిని | తెలివి |
| | ౧౩ | గొఱ్ఱెలై | గొఱ్ఱెలై |
| ,, | ౧౬ | జూదల | జేదల |
| ,, | ౪౧ | రండన | రమ్మన |
| ,, | ౪౫ | విందుల | విందుం |
| ,, | ౭౭ | నెనుయుట | నెనయుట |
| ,, | ౮౫ | గానీ | గానీ |
| ,, | ౮౯ | రామా! | రావణా! |
| ,, | ౯౩ | బెడ | జెడ |
| ,, | ౧౦౯ | టెక్కెవల | టెక్కెము |
| ,, | ,, | వలంకుల | వలంకుల |
| ,, | ౧౧౦ | మివి | మిని |
| ,, | ౧౧౭ | కొలువరల్ | కొలువరుల్ |
| ,, | ౧౨౦ | బొలుపొక | బోలుపోక |
| ,, | ౧౨౭ | పెంకెక్కఁగ | పెంపెక్కఁగ |
| ,, | ౧౨౫ | డవావో! | డహాహా! |
| ,, | ౧౩౦ | పలుకనేలా బమ్మో! | పలుకులొండననేలా |
| ,, | ౧౩౬ | రక్కెసయుక్తివులును | రక్కెసయుక్కివులును |
| ,, | ౧౪౪ | మొలిచి | మొలువ |
| ,, | ౧౫౯ | తోడుసూ | తొడుసూ |
| ,, | ౧౬౦ | నన్మరా | మన్నురా |
| ,, | ౧౩౩ | చేయుఁగల | చేయఁగల |
| ,, | ౨౦౦ | నపుడ | సీతఁగని |
| ,, | ౨౦౫ | డొరులొకటొకటి | డొరులపుడొక టొక |
| ,, | ౨౦౮ | చేచ్చితల | చొచ్చినతల |
| ,, | ౨౦౯ | యిదే | యిందె |
| ,, | ౨౧౦ | మొనలి | మొసలి |
| ,, | ౨౧౨ | దల్చ | దర్ప |
| ,, | ౨౧౬ | దంౘ్రిడి | దంౘ్రిడి |
| ,, | ౨౨౨ | జజే | బజే |
| ,, | ౨౨౭ | గలదె! | గలదే! |
| ,, | ౨౨౮ | ౘ్రమగ్గియుఁ | ౘ్రమగ్గియుం |
| ,, | ,, | మాదిట | మాదట |

## నాయని సుబ్బారావు వ్రాసిన కబ్బములు

1. వీరపూజ-విద్వత్పరీక్ష పఠనీయ వీరగాథ 2—50
2. తెలుఁగుతల్లి-అన్నిపక్షముల విమర్శించునది 1 00
3. తిలోత్తమ .... .... .... 1—25
4. తిలోత్తమా సాహసికము 1—25
5. ఉషారాజ్ఞి .... .... 1—25
6. ధాన్యమాలిని 7. వసంతోదయము (ఒక్కొక్కటి) 1—25
8. దేవయాని 1, 2 భాగములు ,, 1—25
9. శ్రీ రమణాభ్యుదయము 2—00
10. శ్రీరామకృష్ణ మహోదయము 2—00
11. సత్యాన్వేషి (శ్రీ గాంధీమహాత్మ చరిత్రము) 2—00
12. పృథ్వీరాజ విజయము 2—00
13. పరాధీనభారతము (ప్రౌఢ కావ్యము) 2—00
14. హృదయాభ్యుదయము సీతా-రామాదుల హృదయ వివరణము 2—00
15. పరివర్తనము .... .... 2—00
16. ఉద్బోధ సామ్యవాద-నిరూపణ-కల్పితకథ 2—00
17. ప్రణయిని-ఒక కవిదంపతుల ప్రణయగాథ 2—00
18. త్రిపురారహస్యము (వేదాంతము) 3—00
19. గీతానుగీత (భగవద్గీత) 3—00
20 మెచ్చులవచ్చు ముచ్చిలి - పారిజాతాపహరణము 2—00
21. మనువు పుట్టువు - మనుచరిత్ర (ఒక్కొక్కటి) 2—50
22. ఊర్వశి 23. శకుంతల 24. వెన్నెల పెండ్లి 1—50
25. రామకత .... .... 4—00

ఈ 5-ను అచ్చతెనుగు

అచ్చుకావలసినవి: 1. శ్రీహరిసాహస్రి 2. ఆర్యవాణీసాహస్రి 3. టంకసాల 4. రమణవాఙ్మయదశకము 5. ప్రబోధశతకపంచకము 6 ఉపనిషదనువాద పంచకము రత్న వివణి వగైరా.

ఇవి ప్రాచీన కావ్యములవలె సలలిత విరచిత పద్యకావ్యములు.